జనవరి

సంపుటి : 6

సంచిక : 1






మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818

ఈ సంచిక వెల : రు. 10-00

సంవత్సర చందా : రు. 42-00

4 సం॥ల చందా : రు. 150-00

జీవిత సభ్యత్వం : రు. 600-00

Cheques & Drafts should be drawn in favour of SREEVANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at

SPANDANA PRINTERS MACHILIPATNAM


# విషయసూచిక

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి ఆశీస్సులతోను, స్పందన ప్రింటర్స్, విజయవాడ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ మరియు కనకమహాలక్ష్మి బైండింగ్ వర్క్స్ వారి సహాయ సహకారములతో శ్రీవాణి ఆరవ జన్మదిన ప్రత్యేక సంచిక ( 61 వ సంచికను ) ను పాఠకులకు సమర్పించుకుంటున్నాను. రచనలను పంపిన రచయితలకు, ప్రకటనలు ( Advertisements ) ఇచ్చిన వారికి మరియు జీవిత సభ్యులుగా చేరిన ఉదారవదాన్యులకు కృతజ్ఞతలు.

శ్రీవాణి శీర్షికలను ప్రశంసిస్తూ అనేకమంది లేఖలు వ్రాస్తున్నారు. స్థలాభావం వలన అభిప్రాయవేదిక శీర్షికను నడుపలేకపోతున్నాను. అభిప్రాయలేఖలను వ్రాసిన పాఠకులలో చాలామంది భగవాన్ బాబావారి వ్యాసములు, అమృత వాణి, కారాగార లేఖలను ప్రశంసిస్తూ వ్రాశారు. శ్రీవాణిని వ్యాపార దృష్టితో ఆలోచించకుండా ఉన్నత విలువలను ప్రచారంచేస్తున్నందులకు అనేకమంది అభినందనలు కూడా తెలియపరిచారు. వారందరికి నా కృతజ్ఞతాభివందనలు.

ప్రశంసలు, అభినందనలు చదువుతున్నప్పుడు నాకు కలిగే సంతోషమును వర్ణించలేను. అది ఒక మధురమైన అనుభూతి. దానిని వర్ణించడానికి మాటలు చాలవు. అదే విధముగా ప్రెస్‌వారికి, పేపరువారికి బిల్లు చెల్లించవలసి వచ్చినప్పుడు నా స్థితిని కూడా వర్ణించలేను. అది కూడా ఒక రకమైన అనుభవమే. ఏది ఏమైనప్పటికీ, ఎన్ని కష్టములు ఎదురౌతున్నప్పటికీ పాఠకుల మెప్పును పొందే విధంగా శ్రీవాణిని తీర్చిదిద్దగలుగుతున్నందులకు నిజంగా సంతోషిస్తున్నాను. ఇది నా ప్రతిభ కాదు. భగవాన్ బాబావారి ఆశీస్సుల ప్రభావమేనని నా విశ్వాసం. ది 26-11-1986 న పవిత్రమైన అంగుళీయమును సృష్టించి నా వేలికి పెడుతూ " శ్రీవాణికి నా ఆశీస్సులున్నాయి. ఏమీ ఫరవాలేదు. నా అనుగ్రహం ఉన్నది కదా " అంటూ భగవాన్ బాబా నవ్విన నాటి నుంచి నేను నవ్వుతూ శ్రీవాణిని చాలా సునాయాసంగా నడుపగలుగుతున్నాను.

ఈ ప్రత్యేక సంచికకు నేను వెళ్ళకుండానే అనేకమంది ప్రకటనలు అందించారు. వారలకు నా కృతజ్ఞతాభివందనలు. ఎంతోమంది సహృదయులు ప్రకటనలిచ్చి సహకారం అందించడం వలన శ్రీవాణికోసం చేసిన అప్పులో సగం పైన తీర్చగలుగుతాననే నమ్మకం నాకు ఈనాడు కలిగింది. ఇకపోతే శ్రీవాణి అభిమానులకు ఒక చిన్న మనవి చేయ సంకల్పించాను. కేవలం ప్రశంసలు, అభినందనలు వలన పత్రిక నడువదు. ఈనాటి కాల పరిస్థితిలో ' శ్రీవాణి ' వంటి ఉత్తమ పత్రిక అవసరమని భావించిన ప్రతి ఒక్కరూ తమ వ్యక్తి ధర్మమును నిర్వర్తించినప్పుడే 'శ్రీవాణి' నాలుగుకాలాలపాటు నిలబడి ఉత్తమ విలువలను ప్రచారం చేయగలుగుతుంది. ఉదారవదాన్యులు ప్రకటనల ద్వారా గాని, జీవిత సభ్యత్వం పంపటం ద్వారా గాని సహకారమును అందించుతారని ఆశిస్తున్నాను ఈ రెండూ చేయలేని వారు కనీసం ఒక క్రొత్త చందాను చేర్పించి పంపి శ్రీవాణి సర్క్యులేషన్ పెంచేందుకు తోడ్పడుతారని ఆశిస్తున్నాను. రాష్ట్రస్థాయిలో రెండుసార్లు [1986 మరియు 88] ఉత్తమ పత్రికగా ఎంపిక చేయబడి, విశిష్ట అవార్డును కూడా అందుకో గలిగాను సహృదయుల సహకారం వలననే శ్రీవాణి ఈ స్థాయికి ఎదగగలిగినదని నా నమ్మకం, వాస్తవం కూడాను.

నాలుగు కాలాలపాటు ఇంకా మంచి పత్రికగా నడపటానికి అవసరమైన శక్తిసామర్థ్యాలను నాకు ప్రసాదించమని సాయీశ్వరుని ప్రార్థిస్తున్నాను, సహకారమును అందించమని పాఠకులను అర్థిస్తున్నాను

కొమరగిరి కృష్ణమోహనరావు

# దావాగ్ని

**సాయికృష్ణ**

బాలబాలికలలో క్రమశిక్షణారాహిత్యం పెచ్చు పెరిగిపోవటానికి, పవిత్రమైన విద్యాలయాలు అశాంతికి ఆలవాలమైపోవటానికి గల కారణాలు, కారకులను గురించి గత సంచికలలో కొంతవరకు వివరించబడింది. కారణాలను సునిశితంగా పరిశీలించకుండా విద్యార్థులమీద అభాండం వేయటం ఏమాత్రం సముచితం కాదు, న్యాయం అంటికన్నా కాదు. లోపభూయిష్టమైన విద్యా విధానమే దీనంతటికీ మూల కారణం. భారతీయ సంస్కృతీ వైశిష్ట్యం ప్రతిబింబించే సాహిత్యంకాని; దేశభక్తి భావాలను పెంపొందించేటటువంటి కథలుకాని; నైతిక విలువలను పెంచేందుకు అవసరమైన స్ఫూర్తినిచ్చేటటువంటి పాఠ్యాంశములుగాని; ఈ సమాజ పురోభివృద్ధి కోసం సర్వస్వాన్ని సమర్పించిన స్వార్థ త్యాగుల దివ్య జీవిత చరిత్రలుగాని; ఆత్మవిశ్వాసాన్ని కలుగజేసి, స్ఫూర్తిని, శక్తిని యిచ్చేటటువంటి సంఘ సంస్కర్తలు వెదజల్లిన ఆణిముత్యాలనుగాని; మహా ప్రవక్తలు, జాతీయ నాయకులు ప్రపంచానికందించిన పవిత్రమైన పసిడి పలుకులనుగాని; సౌశీల్యవంతులుగా తీర్చిదిద్దటానికి మహర్షులు, మహనీయులు ప్రవచించిన సుభాషితములను కాని బాలబాలికలకు విద్యాలయములలో బోధించటంలేదు, చెప్పటంలేదు. అసలు అటువంటి సుభాషితములకు వుండవలసినంత ప్రోత్సాహం లభించటంలేదు. త్యాగశీలుర దివ్యసందేశాలను విద్యాలయములలో వినిపించడం లేదు. దేశభక్తి గీతాలను విద్యాలయాలలో ఆలపించడం లేదు. అటు విద్యాలయాలలోకాని, ఇటు ఇంటివద్దగాని బాలబాలికలలో నైతిక శీలసంపత్తులను పెంపొందించే ప్రయత్నం జరుగటంపోవటం వలన బాలబాలికలు లౌకిక విద్యలో మాత్రం ఫస్టు ర్యాంకులు తెచ్చుకుంటున్నారు, గోల్డు మెడల్సు సంపాదిస్తున్నారుగాని, గుణము, సత్ప్రవర్తన అభివృద్ధి కావలసిన స్థాయిలో అభివృద్ధి కావటంలేదు. "గుణములేని మానవుడు శిథిలమందిరం లాంటివాడు" అన్నారు బాబా. ఇది యదార్థం, వాస్తవం. అయితే ఈ దుస్థితికి బాధ్యులు మాత్రం బాలబాలికలు కారు. వారిని సరియైన మార్గంలో పెట్టవలసినవారు, వారి బాధ్యతలను విస్మరించటంవలన నేడు ఈ దుస్థితి దాపురించింది.

నైతిక శీలసంపత్తిని పెంపొందించే ప్రయత్నం విద్యాలయాలలో జరగటంలేదు. దానికి అవసరమైన సిలబస్ కూడా లేదు. Moral Classes నిర్వహించబడటంలేదు. Moral Classes లో బోధించడానికి అవసరమైన శిక్షణను అధ్యాపకులకు ఇవ్వడంలేదు. వీరికి అవసరమైన పుస్తకాలు కూడా అందుబాటులో లేవు. ఇండ్లవద్ద తల్లిదండ్రులు కూడా నీతిని బోధించేటటువంటి పుస్తకాలను పిల్లలకు అందించడంలేదు. తల్లిదండ్రులలో చాలామంది ఫిక్సన్ పుస్తకాలనో, డిటెక్టివ్ నవలలనో చదవటానికి అలవాటుపడ్డప్పుడు, వారి పిల్లలకు మంచి పుస్తకాలు ఎలా లభిస్తాయి? అందువలన రచయితలు కూడా నీతి గోధ పుస్తకాలను వ్రాయటంలేదు. ఒకవేళ వ్రాసినా ముద్రించటానికి పబ్లిషర్సు ముందుకు రావటం లేదు. పబ్లిష్ చేసినా గ్రంథాలయాలవారు వాటిని కొనటంలేదు. మార్కెట్‌లో అమ్ముడుపోవటంలేదు. ఇదీ ఈనాటి పరిస్థితి. ఈ పరిస్థితి మారాలంటే విద్యావిధాన స్వరూప స్వభావమే మారాలి. తల్లిదండ్రుల మనస్తత్వం మారాలి. అధ్యాపకుల ప్రవర్తన మారాలి. ప్రభుత్వ ఆలోచనాసరళి మారాలి. అప్పుడే బాలబాలికలలో నైతిక పరివర్తన వస్తుంది. సత్ప్రవర్తన అలవడుతుంది. ఆ శుభసమయం ఎప్పుడు వస్తుందో...

సంకుచిత మనస్తత్వం, పెంకితనం కలిగిన మనుష్యులు నిజమైన స్నేహితులు కాలేరు - ఛార్లెస్ కింగ్స్‌లే

శ్లో॥ అసారే సంసారే విషయ విషసంగాకులధియః!
క్షణార్ధం క్షేమార్థం పిబత శుకగాథాతులసుధాం
కిమర్థం వ్యర్థం భో! వ్రజతకుపథే కుత్సితకథే
పరీక్షిత్సాక్షీ యచ్ఛ్రవణగత ముక్త్యుక్తికథనే ॥




ఇంద్రియాలను ఆకర్షించే విషయాలు, ఏదో సుఖాన్నిస్తున్నాయనుకోవటం భ్రాంతి. విషయములన్నీ విషం లాంటివి. విషయ సుఖాలతో సాంగత్యం పెట్టుకొన్న ప్రతివారికీ ఆ విష ప్రభావం తప్పదు. అయితే యీ విషం మాత్రం బుద్ధిని చెడగొడుతుంది. మనిషికి బుద్ధే కదా మిక్కిలి ప్రధానమైంది? అలాంటి బుద్ధిని వ్యాకులపరచేది యీ ప్రాపంచిక విషయ విషం.

జనన మరణాత్మకమైన యీ సంసారం సారహీనమైనదని విజ్ఞులకు బాగా తెలుసు. నిస్సార సంసార లంపటంలో పడి ప్రాపంచిక విషయాల విషవలయంలో చిక్కుకొని వ్యాకుల చిత్తులయిన మానవులను సంబోధిస్తూ శ్రీమద్భాగవత మాహాత్మ్యంలో చెప్పబడింది యీ అమృతవాణి.

"విషయ విష సంగాకులయిన ఓ మానవులారా! నీచ విషయాలతో గూడిన కుమార్గంలో ఎందుకు వెళతారు మీరు? దానివల్ల ఏమాత్రం ప్రయోజనం లేదు. ఒక్క అరక్షణం ఆగండి చెపుతా. మీకు క్షేమం కలగాలంటే ఒక లిప్తకాలం చాలు. ఆ శుక మునీంద్రుని ముఖ పద్మం నుండి వెలువడే భాగవత కథామృతం త్రాగండి. జన్మ తరిస్తుంది" అని.

వీనుల విందైన భాగవత కథాసుధను శుకముని వల్ల వింటే చాలు క్షేమం కలుగుతుంది. పరీక్షిన్మహారాజు భాగవతం సాప్తాహ్నికదీక్షతో విని ముక్తి పొందాడుకదా! అంతకంటె ప్రత్యక్షమైన వుదాహరణం యింకేం కావాలి?

వ్యాసమహర్షి వేదరాశిని విభజించటమే గాక పద్దెనిమిది పురాణాలను కూడా రచించి లోకోపకారం చేశాడు. ఎంత సారస్వతాన్ని లోకానికిచ్చినా తనకు మాత్రం భాగవతాన్ని రచిస్తేనే మనశ్శాంతి కలిగిందట.

భాగవతంలో శ్రీకృష్ణపరమాత్మయొక్క తత్త్వమేమిటో తరచితరచి వివరించాడు వ్యాసుడు. భక్తిజ్ఞానాలకు ప్రాధాన్యమిచ్చి శ్రోతల హృదయాల్లో రసానందాన్ని నింపిన మహోదాత్త గ్రంథం శ్రీమద్భాగవతం. భారతీయులకిది పెన్నిధి. భక్తిజ్ఞాన దృష్టితో పరికిస్తేతప్ప భాగవతసారం అందుకోలేరెవరైనా. అందుచేతనే శుకమునీంద్రుడు శౌనకాది మహర్షులనందరిని కూర్చోబెట్టుకొని భాగవత కథలు ప్రవచనంచేసేవాడు. కృష్ణతత్త్వాన్ని, సూక్ష్మ, నిశిత పరిశీలనంతో శౌనకాదులకు తెలియజెప్పేవాడు. దీని రుచి మరిగితే మనసు మరోచోటికి పోదు. కనుక పనికిమాలిన ఇతర విషయాలు వినేకంటే అమృతం లాంటి భాగవతం భక్తి శ్రద్ధలతో విని తరించవలసిందిగా సూచింపబడింది.

—0—

ఉన్నత లక్ష్యములతో ఉత్సాహవంతులము కావలెను - కిట్టుమంచి



# శ్రీ సత్యసాయి చెప్పిన బాలసాయి చరిత్ర

[ భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారే స్వయంగా ఒక పర్యాయం తమ చిన్ననాటి చరిత్రను తమ విద్యాలయ విద్యార్థులకు వివరించినారు. దానిని యథాతథంగా శ్రీవాణి పాఠకులకు అందించే మహద్భాగ్యం కలిగినందులకు సహజంగా సంతోషిస్తున్నాను. స్థలాభావంవలన పూర్తిగా ఈ సంచికలో అందించలేకపోతున్నాను. మిగతా భాగం వచ్చే సంచికలో యివ్వబడుతుంది. ఈ అసౌకర్యమునకు మన్నించ ప్రార్థన. - సంపాదకుడు

నేను విద్యార్థిగా ఉండినటువంటి సమయమునందు చేసినటువంటి విషయాలను కొన్ని నేను మీకు అందిస్తున్నాను. పుట్టపర్తి కుగ్రామమనే విషయం మీకు తెలిసినదే. బుక్కపట్టణం స్కూలులో E. S. L. C, అనే తరగతిలో చేరి చదువుతూ వచ్చింది ఈ దేహం. Public Examinations పెనుగొండలో పెట్టారు. పెనుగొండ పోవాలంటే ఏ అమెరికానో, రష్యానో పోయినంత పెద్ద భయం అనాడు. బుక్కపట్టణానికి కూడా బస్సులు లేవు, రోడ్లు లేవు. అప్పుడే పెనుగొండకు క్రొత్తగా రైలు బడింది. ఈ రైలును గురించి అనేకమంది పల్లెలవారంతా చాలా చిత్రవిచిత్రంగా మాట్లాడుకునేవారు ఏదో ఒక కన్నుమాత్రమే ఉందిట. చాలా పెద్ద రోకలిబండ మాదిరిగా పెద్దగా వస్తుందట అని దానిని చూడటానికి అనేకమంది బండ్లు కట్టుకొని వెళ్లేవారు. ఈ విధంగా ఉంటున్న సమయంలో నేను ఒక్కడ్ని మాత్రమే పుట్టపర్తి నుండి పోవలసివచ్చింది ఇంత దూరం పరదేశానికి పంపించాలా ! మా పిల్లవాడిని అని ఈ దేహాన్ని కన్న తల్లి అన్నిరకాల తిను పదార్థములు, మురుకులు, కొన్ని నిప్పట్లు లాంటివి చేసి ఒక చిన్న మూట కట్టి ఇచ్చింది. పంపించేటప్పుడు అంతా ఏడ్పటమే వెంకమ్మ, పార్వతమ్మ ( సోదరీమణులు ) లు కూడా ఏడ్పటమే. ఎంత దూరమో ! ఏమో ! ఎప్పుడొస్తాడో !

## శ్రీ సత్యసాయి బాబా

ఏమో ? అని అందరూ బాధపడ్డారు. ఆ రోజులలో పెనుగొండకు పుట్టపర్తికి సంబంధం ఆ విధంగా వుండేది. బుక్కపట్నం వరకు నాతోపాటు ఒక యెద్దబండిలో మా కుటుంబ సభ్యులందరూ వచ్చారు. అక్కడ నుంచి మేము ఎనిమిదిమంది పిల్లలం కలసి పెనుగొండకు ఒక ఎద్దులబండీని మాట్లాడుకున్నాం. మా వెంట ఒక టీచరు కూడా వచ్చారు. ఒక మైలు దూరం ఎద్దు బండీలో 5 మైళ్ళు దూరం నడవాలి ఎందుకంటే అది సరియైన రోడ్డు కాదు. ఎత్తుపల్లములు వుండటం చేత, ఎత్తు వచ్చేసరికి మేం బండి దిగాలి ఈ విధంగా తరచుగా ఎక్కడం, దిగడం కన్నా నడిచిపోతేనే బాగుండేదని

గతానికి వర్తమానానికి వారధికట్టే విజ్ఞానభాండాగారమే గ్రంథాలయం - శ్రీ అనంతశయనం అయ్యంగార్

పించింది. అప్పుడు నేను చాలా చిన్నపిల్లాడ్ని. నేను ఇప్పుడే ఇంత వున్నాను ! అప్పుడు నాకు తొమ్మిదవ సంవత్సరం. చాలా చిన్నగా ఉన్నాను. నాతో వచ్చిన వారందరూ చిన్నవారే గదా ! ఆ టీచరే ఎక్కించేది, దింపేది. ఈ విధంగా తెల్లవారుజామున 5 గంటలకు బయలుదేరిన మేము రాత్రి 9 గంటలకు పెనుగొండ చేరు కున్నాము. అక్కడ ఏ సౌకర్యాలు లేవు. ఊరు బైట ఒక చిన్న సత్రం వుండేది. బియ్యం, బేడీలు అంతా తీసుకొనివెళ్లాము గదా ; వంట నేనే చేసేటటు వంటి వాడిని. ఇంటి దగ్గర నుంచి అన్ని పొడులు మిరపపొడి, చట్నీపొడి తీసుకొనివెళ్ళాముగదా ; అన్నం వండి ఆ పొడులు వేసుకొని కలిపి తినేవాళ్ళం. ఈ విధంగా మూడు దినములు గడిపి పరీక్షలు వ్రాసి వచ్చాము. ఆ పరీక్షలలో స్వామి ఒక్కడు మాత్రమే First class లో వచ్చాడు. మిగతావారందరూ తప్పి (Fail) నారు. పరీక్ష హాలు దగ్గరకు పోయేటప్పటికి, నిక్కరు జేబుల్లో ఏమైనా కాగితాలు పెట్టుకొని వచ్చారేమోనని టీచర్లు సోదా చేయటం మొదలుపెట్టారు. అందరూ చిన్నపిల్లలే కావటం, పరీక్షలు వ్రాయటం ప్రథమం కావటం వలననూ, అందులో క్రొత్త ప్రదేశం కావటం వలననూ, టీచర్లు స్ట్రిక్ట్‌గా చెకప్ చేయటంతో పిల్లలు చాలా భయపడిపోయారు. బుక్కపట్నం వారం దరిలో ఈ రాజు ఒక్కడే First class లో వచ్చాడని, పెద్ద ఎడ్ల బండిపై కూర్చోపెట్టి పెనుగొండ బాలురు పెద్ద ఊరేగింపు చేశారు.

ఆ పరీక్ష ప్యాస్ అయిన తరువాత చదవటానికి బుక్కపట్టణంలో వేరే క్లాసు ఏదీ లేదు. దీనిని పురస్కరించుకొని ఈ దేహానికి Brother (సోదరుడు) అయినటువంటి శేషమరాజుగారి అత్తవారి ఊరు అయిన కమలాపురానికి నన్ను తీసుకొనివెళ్ళారు. అది కడపకు 16 మైళ్ల దూరంలో ఉన్నది. అక్కడ స్కూలులో నన్ను III Form లో చేర్చినారు. అక్కడ నిత్యమూ చదువుకోవటానికి వీలుండేది కాదు. ఉదయం, సాయంత్రం ఒక పెద్ద కుండ నొకదానిని తీసుకొని, అక్కడికి 6 మైళ్ళ దూరంలో నున్న కృష్ణకాలువకు పెళ్ళి, మంచినీళ్ళు తీసుకొని రావలసి వచ్చేది. నీళ్ళు తీసుకొని వచ్చిన తక్షణమే అంబలి త్రాగి బడికి వెళ్లేవాడను. అప్పుడు ఈ టిఫెన్లు, గిఫెన్లు, కుర్మాలు, బర్మాలు ఇవేమీ లేవు. చద్ది అన్నం, ఊరగాయ అదే ఆనాడు మంచి వాడుకలో ఉంటుండేది. ఆ స్కూలులో వున్న ఒక డస్కు మీద ముగ్గురం కూర్చునేవాళ్ళం. నేను మధ్యలో కూర్చునేవాడను. నాకు ఒక ప్రక్క రమేష్, మరొక ప్రక్క సుధీర్ అనే అబ్బాయిలు కూర్చునేవారు. ఈ విధంగా ఒక సంవత్సరం జరిగేటప్పటికీ, ప్రతి Subject లో కూడా మా ముగ్గురికి



మనం ఎంత పాండిత్యం పోగుచేసుకున్నామన్నది కాదు,

శ్రీవాణి ఆరవ జన్మదిన

First class వస్తుండేది. కడపకు కమలాపురం నికి మధ్య ప్రదేశంలో పుష్పగిరి తిరునాల ప్రతి సంవత్సరం జరుగుతుండేది. మా స్కూలులో 'స్కౌట్' కూడా ఉండేది. మా డ్రిల్లు మాష్టర్ ప్రతి ఒక్కరూ "స్కౌట్" లో చేరాలని నిర్బంధం చేసేవాడు. ఒక ఖాకీ పాంటు కాకీ షర్టు, బెల్టు, విజిల్ - అన్నీ సిద్ధం చేసుకుని పుష్పగిరి తిరునాలకు వెళ్ళి సేవ చేయాలని మా డ్రిల్లు టీచరు ఆర్డరు వేశాడు. అప్పుడు నా వద్ద ఒక్క పైసా కూడా లేదు. ఈ దేహానికి తండ్రి, నేను వచ్చేటప్పుడు 2 అణాలు యిచ్చి పంపాడు, అప్పుడు రెండు అణాలు అంటే చాలా గొప్ప విలువ. నేను వచ్చిన ఆరు నెలల్లో ఆ రెండుఅణాలు ఖర్చుపెట్టాను. మా క్లాసువారందరికీ నేనే లీడర్ని. కనుక నేను తప్పనిసరిగా వెళ్ళితీరాలి. నీవు వచ్చి తీరాలని టీచరు కూడా గట్టిగా ప్రెస్ చేశాడు.

నాకు సంకట పరిస్థితి ఏర్పడింది. చాలా యోచన చేశాను. డబ్బు లేకుండా ఎట్లా పోయేది? నాకు సంవత్సరానికి ఒకే చొక్కా, ఒకే నిక్కరు ఉండేటటువంటిది అప్పుడు. స్కూలు నుంచి రావటంతోనే ఒక టవల్ కట్టుకొని, నిక్కరు, చొక్కా తడిపి ఉతికి ఆరవేసేవాడను. ఆ తరువాత చెంబులో నిప్పు వేసి వాటిని రుద్ది ఒక పెట్టెక్రింద పెట్టేవాడను. ధోబీకి యివ్వడానికి కూడా నా వద్ద డబ్బుండేది కాదు. ఈ రకంగా గడిపేవాడను. సంవత్సరాంతంలో అవి చినిగిపోతే, దానిని మడిచి సేఫ్టీ పిన్ కొనిపెట్టుకోవటానికి కూడా నా వద్ద డబ్బుండేది కాదు. ఒక ముల్లు గుచ్చి ఆ చినుగు కనపడకుండా చేసేవాడను. ఒకే చొక్కా, ఒకే నిక్కరుతో సంవత్సరమల్లా కాలం గడిపే నాకు ఈ ఖాకీ డ్రస్ ఎక్కడ నుండి వస్తుంది? రానని చెప్పడానికి వీలు లేదు. నాకు డబ్బు లేదని చెబితే మా కుటుంబానికి అగౌరవం, ఈ రెండూ చెప్పకూడదు. ఏం చేయాలి? బాగా యోచన చేసి ఒక ఉపాయాన్ని పన్నాను. నేను రావడానికి వీలులేదని టీచరుతో చెప్పలేదు, పిల్లలతో మాత్రం చెప్పాను. నాకు ఒంట్లో సరిలేదని చెప్పాను. నా పక్కన వుండే రమేష్ ఈ విషయాన్ని కనిపెట్టాడు. వాళ్ళ నాన్నకు మంచిగా డబ్బుండటం వలననూ, అతను ఒకే ఒక కుమారుడు కావటం వలనను అతను ఎంత చెబితే అంత వాళ్ళ నాన్న ఏం కావాలంటే అవి కొని యిచ్చేవాడు రమేష్‌కు వాళ్ళ నాన్న. కాకీ డ్రస్ అంటే నాకు బాగా ఇష్టమని చెప్పి రెండు పాంట్లు, రెండు షర్టులు కుట్టించుకున్నాడు రమేష్.

ఇది ఇట్లుండగా అందరు పిల్లలూ మా ఇంటికి వచ్చి రాజు నీవు రాకపోతే మేం పోం! నీవు రాకపోతే మేం పోం! అని గొడవ చేయటం మొదలుపెట్టారు. క్లాసులోనూ అదే గొడవ. ఒక రోజున రమేష్ తాను కుట్టించుకొనిన రెండు కాకీ డ్రస్సులలో ఒక దానిని కాగితంలో చుట్టి నా పుస్తకాల దస్కలో పెట్టి వెళ్ళిపోయాడు. దానిలో ఒక చీటీని కూడా వ్రాసి పెట్టాడు. "ఇదుగో! నేను నీ తమ్ముడితో సమానం. ఈ డ్రస్సు నీవు తీసుకోకుండాపోతే, నేను చచ్చిపోతాను. నేను కాల్చుకుంటాను. నేను రైలుక్రింద పడుతాను. కనుక ఈ డ్రస్సు తీసుకోవలసిందే" అని వ్రాసి నా దస్కలో పెట్టిపోయాడు. కాని నేను ఆ చీటీని చించివేశాను. నేను ఒక చీటీ వ్రాసి అక్కడ పెట్టాను. "నీవు నాకు Brother తో సమానం. మన యొక్క Frienship ( స్నేహం ) శాశ్వతంగా ఉండాలంటే ఇదికాదు. ఈ విధంగా ఇచ్చిపుచ్చుకోవడం వల్ల మన స్నేహం చెడిపోతుంది. కనుక మన స్నేహం శాశ్వతంగా ఉండాలంటే కేవలం ఒక ప్రేమను మాత్రమే పంచుకోవాలి. ఈ విధమైన వస్తు సంబంధమైన దాంట్లో మనకు సంబంధం ఏర్పడిందంటే మనం స్నేహం శాశ్వతంగా ఉండదు. నీవు నిజంగా 'రాజు' స్నేహాన్ని ఇష్టపడేవాడివయితే ఈ విధమైనటువంటిది నీవు చేయకూడదు" అని వ్రాసి అదే దస్కలో పెట్టివేశాను. ఈ విధంగా వ్రాసేటప్పటికి అతను చాలా

మనం ఎంతెగా అవగాహన చేసుకున్నామన్నదే ముఖ్యం - శ్రీ జిడ్డు కృష్ణమూర్తి

బాధపడ్డాడు. ఇంక ఏమి చేయలేక వాటిని తీసుకొని వెళ్ళిపోయాడు. తిరునాలకు వెళ్ళటానికి ఇంకా మూడు దినములు మాత్రమే ఉన్నది. అఖరు వరకు నేను వస్తున్నాను, నేను వస్తున్నాను. అన్నీ ప్యాక్ చేసు కున్నాను, అట్లా, ఇట్లా అని చెబుతునే ఉన్నాను. బయలు దేరే సమయం వచ్చింది. జ్వరం వచ్చిందంటే ధర్మా మీటర్ పెట్టి చూస్తారు. అంతా అబద్ధమని తేలిపోతుంది. తిరునాలకు వెళ్ళే స్కౌటు పిల్లలందరూ ఊరేగింపు (Procession) తో మా ఇంటివద్దకు వచ్చారు. డ్రిల్లు టీచరు కూడా వచ్చి ఏం చేస్తున్నాడు రాజు, ఏం చేస్తు న్నాడు రాజు అని పిలిచారు. “ అయ్యో వచ్చింది ! కడుపు నొప్పి వచ్చింది ! నిలబడలేను. ఏమీ బాగాలేదు” అని ఏడుస్తూ చెప్పాను. ఇంతలోకి మహబూబ్ ఖాన్ వచ్చేటప్పటికి నేను ఇంకా ప్రసవవేదన పడుతునేఉన్నాను. అయన “ అయ్యో రాజు బాగుంటే చాలు. మీరు తొందర పెట్టకండి ! వెళ్లిపోండి ! వెళ్ళిపోండి ! రాజు బాగుంటే చాలు ” అని చెప్పి ఆ మహబూబ్ ఖాన్ ఆ డ్రిల్ టీచర్ని పిల్లల్ని పంపించివేశాడు. ఆ రాత్రి గడచిపోయింది. తరువాత తగ్గిందని చెప్పి లేచి తిరగడం మొదలుపెట్టాను. రెండవ దినం ఎట్లాగయినా తిరునాలకు వెళ్ళాలని అనుకున్నాను. నాకు డ్రస్సుకే డబ్బు లేదు. ఇంక బస్సులో ఎలా పోయేది అని రెండవ రోజంతా ఆలోచించాను.

నా దగ్గర అన్ని పాఠ్యాంశ (Subjects) పుస్తకాలు ఉన్నాయి. ఆ పుస్తకాలన్నీ నేను ఏనాడు తెరిచి చూచి ఎరుగను. నేను ప్యాసయిపోయిన తరువాత నాకు ఆ పుస్తకాలు అవసరం లేదు ఇంకొకబ్బాయి బీద హరిజన కుర్రవాడున్నాడు. వాడింటికి నేను వెళ్ళాను. నీవు ప్యాసయిపోయినావుగదా ! వచ్చే సంవత్సరం నీకెట్లాగా పుస్తకాలు కావాలిగదా ! నా పుస్తకాలు యిచ్చే స్తాను. తీసుకుంటావా అంటే, నేను తప్పక తీసుకుంటా నన్నాడు. అయితే నాకు అర్థ ఖరీదు ( Helf rate ) కు కావాలి, నేను బీదవాడ్ని అన్నాడు. అర్థఖరీదు ఎంతవు తుందంటే పదమూడు రూపాయలు. నా పుస్తకాలన్నీ కొత్తగా ఉన్నాయి. నాకు అర్థ ఖరీదు కూడా అవసరం లేదు. నాకు ఒక ఐదు రూపాయలు యిస్తే చాలు. ఈ పుస్తకాలన్నీ తీసుకుపో అన్నాను. రు 20 పెట్టినా రాని పుస్తకాలు రు ౫ లకే వచ్చినందులకు చాలా సంతోష పడ్డాడు ఆ పిల్లవాడు. ఆ రోజులలో ఈ రూపాయనోట్లు లేవు. దమ్మిడీలు, బొట్లు, అణాలు, బేడాలు, పావలాలు ఇలాంటివంతా ఉంటుండేవి. రు ౫ లకు ఇంత చిల్లర తెచ్చి నాకు ఇచ్చివేసినాడు. అదంతా ఎట్లా తీసుకొని పోయేది. నాకున్నది ఒకే చొక్కా, ఒకే నిక్కరు. అప్పుడేం చేసినాను. పాత చొక్కాలో ఒక చిన్న ముక్కను చించాను. దానిని తీసుకొని గోడ ప్రక్కకు

వెళ్ళి, దానిమీద ఆ చిల్లర పోసి గట్టిగా బిగించి మూట కట్టేసరికి అది పగిలిపోయి డబ్బంతా క్రింద పడిపోయింది. ఇంతలో ఆ యింటి యాజమానురాలు వచ్చి "డబ్బంతా కొట్టేసినావా ? మా ఇంట్లోనుంచి" అని నాతో తగాదా పెట్టుకున్నది. నాకు డబ్బు యిచ్చిన పిల్లవాణ్ణి తీసుకొని వచ్చి, వాడికి పుస్తకాలు యివ్వగా, వాడు నాకు డబ్బిచ్చాడని చెప్పినప్పటికీ ఆమె వినక మీరిద్దరూ దొంగలేనని చెప్పి ఆ డబ్బు తీసుకోవడమే గాక రెండు దెబ్బలు మా ఇద్దరిని కొట్టి అన్నం కూడా పెట్టకుండా పంపించివేసింది నన్ను. కాని అప్పుడు బయటవుంటే బయిటవారి దృష్టిలో చాలా చులకనై పోతామని, అనవసరంగా కుటుంబంలో ఉన్న గౌరవాన్ని బట్టబయలు చేసుకోవడం మంచిదికాదని భావించి, ఇదీ ఒక మంచి అవకాశమని, అక్కడ నుంచి పుష్పగిరికి బయలుదేరాను. ఆ రాత్రి చక్కటి పూర్ణిమ దినం కావటం వలన అందరితో కలసి నడచుకొని వెళ్ళి అక్కడ అ రాత్రి పడుకున్నాను. తెల్లవారి లేచి చూచేసరికి పిల్లలంతా డ్రస్సులు వేసుకొని విజిల్సు వేసుకుంటూ అక్కడక్కడా తిరుగాడుతుండటం చూచాను. నడచిరావడం వలన చాలా అలసిపోయాను. అందులో ఎండాకాలం అవటంచేత దప్పిక బాగా అవుతున్నది. ఎక్కడ చూచినా మంచినీరు కనిపించలేదు. అదంతా తిరుగుతూ కొంతదూరం వెళ్ళగా అక్కడ పశువుల్ని కడుగుతున్నారు. ఆ కడిగే నీరునే కొంచం త్రాగాను. అంతా గలీజుగా ఉంది. వెనుక తిరిగి వస్తుంటే ఒక రాతిపైన ఒక బీడీలకట్ట, ఒక అణా కనిపించింది. వాటిని తీసుకున్నాను. ఇది ఎవరిది ? ఇది ఎవరిది ? అని అక్కడ వున్న వారందరినీ అడిగాను. ఎవరూ నాదని ముందుకు రాలేదు. ఇంకా ఏం చేసేది ? ఆ బీడీలకట్టను త్రుంచి ఇసుకలో పూడ్చిపెట్టి, ఆ అణాను మాత్రం తీసుకొనిపోయి 4 బొట్లు చేసుకున్నాను (చిల్లర). ఇంకా యిక్కడ 8 దినాలుండాలి. ఈ నాలుగు బొట్లతో ఏ విధంగా ఉండటమని ఆలోచించాను.

నేను నా జీవితంలో ఒకటే ఒక పెద్ద తప్పు చేశాను. అక్కడ "బుడబుడకాతా" అని ఆడుతుంటారు (పేకాట). ఆ ఆట పోయి ఆడినాను. 12 అణాలు వచ్చినాయి. ఇంకా ఎక్కువ ఆశ పనికిరాదని భావించాను. రోజుకొక అణా ఖర్చు పెట్టుకున్నా సరిపోతుందని, వెళ్ళేటప్పుడు రెండణాలు పెట్టి పండ్లు కూడా తీసుకొని వెళ్ళవచ్చునని సరిపెట్టుకున్నాను. ఆ రోజులలో ఒక బొట్టుకు మూడు పెద్ద పెద్ద దోసెలు వచ్చేవి. ఉదయం ఒక బొట్టు, సాయంత్రం ఒక బొట్టుతో సరిపుచ్చుకుందామనుకున్నాను. ఆ రోజు ఆ విధంగా గడిపాను. రాత్రి అయింది. మిగిలిన చిల్లర ఎక్కడ దాచుకోవాలా ? అని ఆలోచించాను. నేను వచ్చేటప్పుడు ఒక టవల్‌ను మాత్రం తీసుకొనివచ్చాను. ఆ టవలును కొంచం చించి, ఆ చిల్లరను మూటగట్టి, ఇసుకలో పెట్టి, దానిని కుప్పగా చేసి, దానిమీద టవల్‌ను పరచి తలపెట్టి పడుకున్నాను. గత రాత్రంతా నడచి రావటం వలన, గాఢ నిద్ర పట్టింది. ప్రక్కకు వత్తిగిలేసరికి, ఎవరో దీనిని పసిగట్టి, ఇసుకలో పూడ్చిపెట్టిన ఆ చిల్లర మూటను సంగ్రహించి తీసుకొనిపోయారు. ఇంక ఏమీ చేసేదిలేక మూడు దినాలు పస్తున్నాను ఇది రమేష్ కనిపెట్టాడు. ప్రతి పూట ఒకటో రెండో దోసెలు నాకు పెట్టేవాడు. ఆ విధంగా మిగిలిన మూడు రోజులు గడచిపోయాయి. పుష్పగిరి తిరుణాల అంటే అక్కడ చాలా గొప్ప పేరు. తిరునాల చూచి ఇంటికి తిరిగిపోయే వారందరూ ఏదో ఒకటి కొనుక్కొని వారిండ్లకు తీసుకొనిపోతుంటారు. నాకు ఏదో ఒకటి తీసుకొనివెళ్ళాలని అనిపించింది. అందులో శేషమరాజు భార్య నవమాసాల గర్భిణి ఏదైనా తీసుకొని వెళ్లుదామంటే నా చేతిలో దమ్మిడీ కూడా లేదు. అప్పుడు రమేష్‌ని అడిగాను. ఇంటికి వెళ్ళిన తరువాత తప్పకుండా తీర్చుకుంటాను, ఒక అణా ఇవ్వమని కోరాను. రమేష్ ఇచ్చాడు. ఒక అర్ధణాతో ఇంత కుంకుమ, పసుపు ఇంకో అర్ధణాతో పూలు పండ్లు తీసుకొని మూటగట్టుకొని నడచుకుంటూ ఇంటికి తిరిగి వచ్చాను

గ్రంథాలయాలు అలా ఉపయోగపడుతాయి - శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి

నేను కష్టపడి ఆ ప్రసాదం తీసుకొని ఇంటికి పోయే సరికి Training holidays కావటం వలన శేషమరాజు ఇంటికి వచ్చి కూర్చున్నాడు. నేను లేని ఈ ఎనిమిది దినాలు ఇంటివద్ద నీళ్ళు తెచ్చిపెట్టేవారు లేకపోవటం వలన, వారు నా పైన చాలా కోపంగా ఉన్నారు. నా పై వారు ఏమేమో చెప్పారు ఆయనకు. నేను ఆ యింట్లోకి పూలు వగయిరాలు తీసుకొనిపోయేసరికి ఆయన రూళ్ళ కర్రతో రూల్సు వేసుకుంటూ Home work చేసుకుంటు న్నాడు. నేను అక్కడికి పోయేటప్పటికి ఆ రూళ్ళ కర్రతో నన్ను కొట్టేశాడు. అది మూడు ముక్కలై పోయింది. ఒక్కసారి చేయి బురబుర బాగా వాచి పోయింది. తడిగుడ్డ కట్టాను. అయినప్పటికి అది బాగా వాచిపోయింది. ప్రక్కింటిలో గోవిందమ్మ అనే ఒకామె ఉండి. ఆమెకు తెలిసి బాధపడుతూ, చాటుగా నాకు దోసె తెచ్చిపెట్టేది.అయినప్పటికి దానిని నేను ముట్టలేదు. ఇంతలో ఉన్నట్లుండి శేషమరాజు పెద్దకొడుకు నిద్రబోతూ, నిద్రలోనే చనిపోయినాడు. ఈ దేహానికి తండ్రి అయిన పెదవెంకపరాజు సంతకోసమని బుక్కపట్నం వచ్చినాడు. పిల్లవాడు పోయినాడని తెలిసి పుట్టపర్తి తిరిగి వెళ్ళకుండా, ఆయన ఆనాటి సాయంత్రానికి కమలాపురం చేరుకున్నాడు. వచ్చిన తరువాత నన్ను చూచాడు. ఏమిటిది ? ఏమిటిది ? అని అన్నాడు. ఏం లేదు. కీలుముడి లేచిందని, ఏదో గుల్ల లేచిందని ఊరికే అబద్ధం చెప్పివేసినాను. అందులో ఈ దేహానికి తండ్రి, ఆయనకు మాటలు జాస్తి. ఎవరు కనిపిస్తే వారితో ఎక్కువగా మాట్లాడటం ఆయన అలవాటు. అందులో పిల్లవాడు పోవటంచేత ఇంట్లో ఎవరూ మాట్లాడటంలేదు. నిశ్శబ్దంగా బాధపడుతున్నాడు ఆయన పాపం. ప్రక్కింటివారు, వాళ్ళు, వీళ్ళు ఏమేమో ఆయనతో చెప్పడం మొదలుపెట్టారు. రాత్రింబవళ్ళు ఆ అబ్బాయిపడే బాధను మేం చూడలేకపోతున్నామని, మీ ఊరుకు తీసుకొనిపోండని చెప్పినారు. ఆయన చాలా బాధపడి వుంటాడు. అప్పుడు సరీగా రాత్రి 8 గంటలు అయింది. చీకటిగా వుంది. ఒక యుకి వేసినాడు. నేను బయటకు పోవాలన్నాడు. బయటకు అంటే రెంటాలకు ( బహిల్ ప్రదేశము ) పోవాలని చెప్పినాడు. కొత్త ఊరు ఎక్కడికి పోతాడో ! ఏమో ! అని లైటు తీసుకొని నన్ను వెళ్ళమని శేషమరాజు చెప్పాడు. అప్పుడు నేను లైటు తీసుకొని ముందుకు నడుస్తుంటే, ఆయన వెనకాల వస్తున్నాడు. ఊరు బయటకు వెళ్ళిన తరువాత లైటు అక్కడపెట్టి మీరిక్కడకు వెళ్ళవచ్చునన్నాను. అని నేను వెనుకకు వస్తుండగా ఆయన నా చేయి పట్టుకొని కంట నీళ్ళు పెట్టుకున్నాడు. "ఎందుకు నీవు అవస్థలు పడాలి ? నీకు చదువు రాకపోయినా ఫరవాలేదు. నేను బిచ్చమెత్తుకొని అయినా నిన్ను సాకుతాను నీవు యిక్కడ వుండనక్కరలేదు. నీ అవస్థలంతా నేను వింటున్నాను. వద్దు ! వద్దు ! ఊపిరివుంటే ఉప్పు అమ్ముకొని తినవచ్చు. అంతేగాని నీవు ఇక్కడ వుండవద్దు. రేపు ప్రొద్దున్నే బయలుదేరి మన ఇంటికి వెళ్ళిపోదాం. నేను ఏనాడు నిన్ను కొట్టలేదు. అలాంటిది నీవు ప్రతి దినం ఇక్కడ దెబ్బలు తింటున్నావు. ఇది నేను వినలేను, చూడలేను. నువ్వు వెంటనే ప్రయాణం కావాల్సింది. " అని గట్టిగా చేతులు పట్టుకొని అడిగాడు. సరే నేను చెప్పాను. " ఇది మంచిదికాదు. ఇప్పుడు వారు పిల్లవాడు పోయి బాధపడుతుంటే, ఇలాంటి సమయంలో నేను వారిని అనాథలను చేయటం మంచిదికాదు. అంతేకాక బయటవారు కూడనూ అనేక విధాలుగా అనుకుంటారు. లోకులు కాకులు. ఇలాంటిదంతా ఉండకూడదు. మీరు పొండి. నేను పదైదు దినాలు చూచి నిదానంగా వస్తాను " అని ఆయనకు శాంతంగా, ధర్మరీతిగా, అనేక రీతులుగా చెప్పాను. ఆయన వెళ్ళిపోతూ " నీకు ఏమన్నా గుడ్డలున్నాయా ? " అని అడిగాడు. " ఓ ! బోలెడు గుడ్డలున్నాయి నాకేమీ వద్దు " అని చెప్పి అతనిని సంతోషపెట్టి పంపించాను పుట్టపర్తి. ఆయన పోతూ పోతూ కొట్టె సుబ్బన్న బట్టలషాపుకు వెళ్ళి "మా పిల్లవాడు వచ్చి అడుగుతే, ఏం కావాల్సినా మీరు కుట్టించి ఇవ్వండి ! నేను డబ్బు పంపిస్తూ వుంటాను. మీరేమి యోచన పెట్టుకోవద్దండి ! " అని అతనికి చెప్పేసి వెళ్ళిపోయాడు.

( సశేషం )

ఉత్తమ సాహిత్య గ్రంథము మానవుని ధర్మాత్మునిగా చేయును.

# నేను ఎవరు?

**మన** హిందూమతము ఒక మతకర్తతో ప్రారంభము కాలేదు. మనది సనాతన మతము. అనగా ఉపనిషత్ సారము. సృష్టి ప్రారంభమునుండి ఉన్న జీవుల కందరికి మోక్షము రావలసినదని సిద్ధాంతము. హిందూ మతములో "సంకల్పము" ప్రధానము. "శ్రీ మహావిష్ణు రాజ్ఞయా.... అహంభో అభివాదయే" అని చెప్పుకొందుము. ఏమికావాలో అర్థించుదుము. దేశ కాల పాత్రములన్ని రాగలవు.

మన సనాతన మతములో కావలసినది వేదప్రమాణ బుద్ధి లేక ఆస్తిక్యబుద్ధి, "దేవుడు ఉన్నాడా లేడా?" అన్న విచారణతో పనిలేదు. మన దేవుడు ప్రకాశించును అంతే. ఈ సృష్టిలో కనబడు హెచ్చు తగ్గులతో ఆయనకు సంబంధము లేదు.

"ఆస్తిక్యబుద్ధి" అనగా చచ్చిపోయిన తర్వాత "నేను ఉంటాను" అన్నది.

నేను జీవుడను, నిత్యుడను, వెనుకవున్నాను, ఇప్పుడు ఉన్నాను, ముందు ఉంటాను.

ధర్మాధర్మాలకు స్వతంత్రః కర్తను, భోక్తను. పరిపాలించే ఈశ్వరుడున్నాడు. ఆయన కర్మఫల ప్రదాత.

జీవులు చేసుకున్న పుణ్య పాప కర్మల యొక్క ఫలములను, ఆయన ఇచ్చుచుండును ఆ యా జీవులకు.

జీవులకు, ఈశ్వరునకు మధ్య చిత్రగుప్తుడు మహా చిత్రముగా, రహస్యముగా, ఆ యా జీవులయొక్క కర్మల లెక్కలను, తూ చా న్యాయముగ ఏ ఏ జీవులవి, ఆ యా జీవులపేర వ్రాయుచుండును. వీటిని 'Confidential Reports' అని చెప్పవచ్చును.

ఈ లెక్కలను ఆధారము చేసుకుని ఆ యా జీవులకు, ఏ ఏ శరీరములు యివ్వవలయునో, ఆ యా శరీరములు ఎంత కాలము, ఆ యా జీవులకర్మననుసరించి ఉండవలెనో, నిర్ణయించి, అందుకు కావలసిన ఆహారమును, గర్భోత్పత్తికి కారణభూతమైన పురుషుని రేతస్సులోనే ఇముడ్చును, లేక ప్రవేశపెట్టును, ఈ రేతస్సు జీవునితో కలసి వున్నప్పుడే అనగా ఈశ్వరాజ్ఞ వల్లనే గర్భోత్పత్తి కాగలదు.

## శ్రీ త్రివిక్రమరామానంద భారతీస్వామి

"అయు రన్నం ప్రయచ్ఛతి," పిపీలికాది బ్రహ్మ పర్యంతము ఉన్న అందరు, అన్ని, జీవులే, జీవరాసులే. మానవులు ఆలోచించి, ధర్మాధర్మ విచక్షణ చేయ శక్తి కలవారు. తదితర జీవులు, కర్మఫలములను అనుభవించే జీవులుమటుకే. కర్తృత్వము వహించి, మంచి జన్మలను గాని, మోక్షమునుగాని, సంపాదించ జాలవు. మనము, స్వయంకృత కర్మ బద్ధులము.

ఈశ్వరుడు ఏ ఏ జీవులకు, ఏ ఏ శరీరములను యివ్వవలయునో, అందుకు తగినట్లుగా ఒక ప్లాను తయారుచేసి చతుర్ముఖబ్రహ్మకు పంపితే, ఆయనగారు దీనిని ఈశ్వరాజ్ఞగా భావించి, సృష్టించుచుండును.

ఇట్లు సృష్టి, స్థితి, సంహారములు జరుగుచుండును. ప్రళయములో లయమగుచుండును, ప్రళయాంతమున "ధాతా యథాపూర్వ మకల్పయత్" అని పూర్వము ఎట్లున్న అట్లుగా, అనగా యీ సృష్టిలో నున్న హెచ్చు తగ్గులతో ఆయనకు సంబంధము లేకుండా, సృష్టి సాగిపోవుచుండును.

మానవులు ఏ కార్యము తలపెట్టినా (శుభముగాని, అశుభముగాని) సంకల్పము చెప్పుకొందురు. వేదమ్మో,

సరస్వతి నివాసమే పుస్తక భాండాగారం - శ్రీ పుచ్చా పూర్ణానందం

ప్రవృత్తి ధర్మము, నివృత్తి ధర్మము అని రెండు మార్గములు సూచింపబడినవి.

ఈ సృష్టి కంతకు, అనగా యీ జగత్తు సాగి పోవుటకు, లేక "ధర్మా దర్ధస్య కామశ్చ" శ్రేయో రాజ్యములో తనకు, తన ఆస్తిపాస్తులకు స్థిరత్వము ఏర్పరచుటకు ప్రవృత్తిమార్గము అవలంబించవలయును.

"పునరపి జననం, పునరపి మరణం" అని, యీ జనన మరణములతో కూడిన మహా భయంకరమైన విషమ చక్రము నుండి బయటపడి, బంధవిముక్తి చెంది మోక్షము అర్జించవలెనన్న జీవునికి మార్గము నివృత్తి మార్గమును లేక నివృత్తి ధర్మమును, అవలింబించ వలసినదే అని శాస్త్రము. ఇక "నే నెవరు? నా ధర్మము ఏమిటి ? ఆహార నిద్రా భయ మైథునములేనా నా ధర్మము?" అన్న ప్రశ్నలు, పరంపరగా రాగలవు.

"గోవు" అన్న శబ్దమునకు అర్థము పాంచభౌతిక శరీరముతో, గోశాలలో వుండును. ఈ అర్థము (గోశరీరము) పోవచ్చును, పోవును.

"గోవు", "శబ్దము" నిత్యము, "శబ్దము", వేదము. వేదము జ్ఞానము, ఇటులనే "నేను" అన్న శబ్దమునకు "అర్థము" ఎవరు ? ఏది ?

"నేను" అన్న శబ్దమునకు అర్థము, ఈ నా రూపము (శరీరము), ఈ రూపమునకు పెట్టిన "నామము" ఆంజనేయులు,

నేను = రూపము + నామము నేను = శబ్దము.

రూపము + నామము = అర్థము.

విచారించిన రూప నామములె నేను.

నేనే-రూప నామములు.

నేనే ఆంజనేయులు, ఆంజనేయులే నేను,

"గో" శబ్దముయొక్క అర్థము "గో" శాలలోయున్న భౌతిక శరీరము, అది నశించును అని తెలుసుకొంటిమి.

ఇదే రీతిని "నేను" అన్న శబ్దమునకు అర్థమైన, రూప + నామములు నశించును.

"నేను" అన్న శబ్దము నశించదు. నిత్యమందామా ? ఇచ్చట గల్లంతు పడరాదు. విచారించిన శబ్దమే నిత్యము. ఈ భౌతిక శరీరము గతేమి కాను ?

"శబ్దము" నిత్యము గనుక, "అర్థము" ఈశ్వరాజ్ఞ వలన ఎప్పుడు కావాలని సంకల్పించిన అప్పుడు భౌతిక శరీరముగల గోవు రాగలదు, సృష్టి రాగలదు.

ఇక విచారణ.

'నేను' అన్న శబ్దము నిత్యమా అన్న ప్రశ్న రాగలదు.

అనగా, నేను యీ రూపమూ, నామమేనా ? ఈ రెండును కాకుండా వున్నానా ? ఉన్న, ఎట్లున్నాను ?

కనుక నేను ఎవరు ?

Who am I ?

I am Anjaneyulu.

ఈ వాక్యమునకు తెలుగులో తర్జుమా చేసిన, నేను ఆంజనేయులును అయివున్నాను. అనగా వున్న నేను, ఆంజనేయులును అయివున్నాను మొదట ఉన్నాను, చివర వున్నాను, మధ్యలో, ఆంజనేయులును అయివున్నాను. నేను మొదటలో, మధ్యలో, చివరలో, ఎప్పుడూ వున్నాను. మధ్యమటుకు ఆంజనేయులును అయి వున్నాను.

ఈ ఆంజనేయులు ఎప్పుడు అయితిని అని ప్రశ్న వేసిన,

జవాబు-

పుట్టిన, పురుడు వెళ్ళిన 11-వ రోజున, తల్లిదండ్రులు "ఆంజనేయులు" అని నామకరణము చేయగా, ఆంజనేయులును అయితిని అని జవాబు చెప్పవలసినదే.

పుట్టి పెరిగిన తర్వాత, యీ ఆంజనేయులు అన్న పేరు, యిష్టము లేకపోతే మరొక నామము, ఏ శ్రీరాములు

నీకేమీ తెలియదని గుర్తెరగడం విజ్ఞాన సముపార్జనకు తొలి మెట్టు. - బెంజమన్ డిసరాలీ

అనో, మార్చుకొనవచ్చును గెజెట్ ద్వారా. పుట్టిన 11-వ రోజున, "నేనుకు" (నాకు) అంజనేయులు, అని వ్యవహరించుటకు నామకరణము చేయగా, అంజనేయులును అయితిని, తిరిగి యిది కాదని, శ్రీరాములు అని గెజెట్ ప్రచురణద్వారా నామకరణము చేసుకొనగా, శ్రీరాములును అయితిని. ఇపుడు నేను ఎవరు ?

మొదట అంజనేయులు, తర్వాత శ్రీరాములు, రెండూ నేనే.

అంజనేయులు అని 11-వ రోజున తల్లిదండ్రులు నామకరణము చేయకముందు అనగా నీవు అంజనేయులువు కాకముందు నీవు ఎవరవు ?

ఈ అంజనేయులు అని నామకరణము చేసినది ఎవరికి? పుట్టివున్న పదిరోజులు నిండిన శిశువుకు, అనగా శిశు శరీరమునకు, అనగా, శిశురూపమునకు, నామకరణము చేయటమైనది. ఆ వెంటనే ప్రాణముతో వున్న శిశువు అంజనేయులు అయ్యేను, పుట్టిన 11-వ రోజుకు పూర్వము, "నేను", ఎవరైనను కాని, అంజనేయులు మటుకు కాను, కనుక అంజనేయులు కాకుండా వున్న నేను, అంజనేయులును అయివున్నాను.

అంజనేయులు కాకుండా, శ్రీరాములు కాకుండా, నేను వున్నాను గనుక, నేను అంజనేయులు కాను, శ్రీరాములు కాను.

"నేను" అన్న శబ్దమునకు సామాన్య అర్థము ఏమన,

నేను (శబ్దము) = రూపము (శరీరము)
నామము (అంజనేయులు)

"నేను" శబ్దమునకు = నామము కాదు,
విశేషార్థము = రూపము కాదు,

అయితే "నేను" రూపమా ? తిరిగి విచారించుదాము.

"నేను" అన్నది శబ్దము అయినచో శబ్దము రూప మనవచ్చునా ? ఇది విచారణీయాంశము గదా !

ఈ రూప నామములు కాకుండా నేను వున్నానా ? నేను ఎవరు, వున్నచో ?

నామమునకు మొదలు నామకరణము చేసిన రోజు అని తెలుసుకొంటిమి.

కనుక 11-వ రోజునే నామకరణము చేయబడిన శిశువుకు ప్రారంభము ఏది ? ఎట్లా ? అనగా యీ నా శరీరమునకు ప్రారంభము ఏది ?

ఈ శరీరమునకు ( రూపమునకు ) ప్రారంభము పురుషునియొక్క (తండ్రియొక్క) రేతస్సు (బిందువు) అని అందరికీ తెలిసిన విషయమే. కాని చెప్పవలసి వచ్చిన సిగ్గుపడుదుము. సమస్త జీవరాసులకు యీ రేతస్సు లేకుండా గర్భోత్పత్తి కానేరదు.

నేను ఎవరు ? ఈ రేతస్సా ! గర్భోత్పత్తి అయిన తర్వాత తల్లి గర్భములో నవమాసములు వృద్ధిపొందు చున్న రేతస్సుయొక్క పిండమో, ఏ ఇంకా ఏదో అని చెప్పవలెనా ? అది ఏది ? నేను రేతస్సా ? పిండమా ? జన్మించిన తర్వాత ఆ పసికందా ?

ఆ పసికందుయొక్క శరీరమా లేక పసికందు వేరు, శరీరము వేరా ? ఆ తర్వాత బాల్య, యౌవన కౌమార స్థితులు గడుచుచున్న శరీరములా ? నేను ఎవరు మరి ? నేను ఆ రేతస్సును అని చెప్పవలెనా ? ఏమని చెప్పవలెను? ఆ రేతస్సు రేతస్సుగా లేదాయె. ఆ జన్మించిన శిశువు శిశువుగా లేదాయె. ఇన్ని మార్పులు చెందుచున్న ఏ శరీరము నేనని చెప్పవలెను ?

పోనీ రేతస్సు ప్రారంభము మొదలు వచ్చుచున్న శరీరముయొక్క మార్పులు, ఒక మార్పు వచ్చి మరొక మార్పును తెలుసుకొనలేవు. ఎందువలన ? ఈ మార్పున్నప్పుడు ఆ మార్పు లేదు. ఆ మార్పున్నప్పుడు యీ మార్పులేదు. కనుక మార్పులు పలు విధములుగ రావటము, పోవటము జరుగుచుండగా యీ మార్పులతో రాక పోక ఎప్పుడు అనగా అన్ని మార్పులతో స్థిరముగా

విజ్ఞానం లేని స్వేచ్ఛ ప్రమాదకరం, స్వేచ్ఛ లేని విద్య నిష్ప్రయోజనం - జాన్ ఎఫ్ కెనడీ

## శ్రీ వాణి జీవిత సభ్యులు



కీ॥ శే॥ కొత్తూరి శాయన్న (కోదాడ) గారి
జ్ఞాపకార్థం, వారి ధర్మపత్ని
శ్రీమతి కొత్తూరి మహాలక్ష్మమ్మగారు
యివ్వటమైనది.

వున్న వచ్చి పోయే మార్పులను తెలుసుకోగల శక్తిగల చేతనము వున్నదాని తెలుసుకొనుట జరుగదు. ఇదియు సత్యమే. ప్రతీ ఒక్క రేతస్సు గర్భోత్పత్తికి కారణము కాదు. ఆ ఈశ్వరాజ్ఞవల్ల ఆ రేతస్సు బిందువులో "జీవుని" (చేతనమును) ప్రవేశము జరిగిననాడే గర్భోత్పత్తి కాగలదు. ఈ విషయము గూర్చి చర్చ ఒకింత మనము చేసితిమి. ఒకసారి కాదు, అనేకసార్లు.

ఇప్పుడు నేను ఎవరు ? అన్న ప్రశ్నకు వద్దాము తిరిగి.

11-వ రోజున శిశువులో ప్రాణము (చేతనము) వున్నందుననే నామకరణము జరుగుచున్నది. అనగా "నేను" (ప్రాణమే) వున్నందుననే నాకు అంజనేయులు అని నామకరణము జరిగినది. నామకరణము జరిగినది ఎవరికి ? ఆ వున్న శిశువుకే, రూపమునకే. అనగా నాకే అని చెప్పవలసి యుండును తిరిగి. అయితే రేతస్సు మొదలు అనేక మార్పులు రూపమునకు రాగా ఆ మార్పులతో పోలేదు, కొత్తగా రాలేదు. కనుక యీ మార్పులు నేను కాదు, రూపము నేను కాదు, ఈ రూపము కాకుండా నేను వున్నాను. మార్పులను తెలుసుకుంటూ వున్నాను.

పర్యవసానము ఏమన, నేను ఏ రూపము కాదు, ఏ నామము కాదు.

"నేను" అన్న శబ్దమునకు విశేషార్థము, నేను రూపము కాదు, నామము (అంజనేయులు) కాదు.

పరిసమాప్తి

"నేను" అన్న శబ్దమునకు సామాన్యార్థము,

"నేను" శబ్దము= రూపము (శరీరము)
నామము (అంజనేయులు)

"నేను" శబ్దమునకు విశేషార్థము,

నేను (శబ్దము)= రూపము (శరీరము) కాదు
నామము (అంజనేయులు) నేను,

మరి నేను ఎవరు ? అనిర్వచనీయము, శూన్యము కాదు.

"సత్ చిత్ ఆనందము" అనగా "సచ్చిదానందము" అన్న శబ్దము.

మనము పెక్కు పర్యాయములు చర్చించిన విషయములే అయినను అనాది అజ్ఞానము, జన్మ జన్మాంతరముల నుండి పాతుకుపోయి 'నేను యిదే' 'నేను యీ రూప నామములే' అని తాదాత్మ్యము చెందుచున్నందున శాస్త్రాచార్యోపదేశములను పదే పదే మననము, అవృత్తి చేయవలసిన అవసరము కలదు, కాన వ్రాసితిని.



తాను ఇచ్చింది మర్చిపోవడం, పుచ్చుకొన్నది జ్ఞాపకం ఉంచుకోవడ



# బాబాకు సాటిలేరిలన్

ఉదాహరణలు చెప్పడంలోను, ఉపమానాలు వేయ్యడంలో బాబాకు సాటి లేరిలన్. చిన్న చిన్న ఉదాహరణల ద్వారా ప్రసంగాలు చేయడంలో ఆయనకు ఆయనయే సాటి. బాబా ఫిలాసఫీ అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్లుగా ఉంటుంది. ఎంత జటిలమైన విషయమునైనా సరే ఉపమానాల ద్వారా పామరులకు సహితం అర్థమయ్యేటట్లుగా వివరించగల సాటిలేని మేటి బాబా. అర్థం కానిది ఆధ్యాత్మికమని, అంతం లేనిది వేదాంతమని, అంతుపట్టనిది అద్వైతమనే భావం సామాన్య ప్రజానీకంలో పాతుకొని పోయింది. అందువలననే వేదాంత సభలకు అందరూ వెళ్ళరు. కొద్దో గొప్పో ఆ పరిజ్ఞానం ఉన్నవారే వెళ్ళటం పరిపాటి. అయితే భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు మాత్రం అత్యున్నతమైన వేదాంత విషయాలను సామాన్య పామర జనానికి అర్థమయ్యే రీతిలో ప్రసంగం చేయటం వారి ప్రత్యేకత. అందువలననే అటు విద్యార్థులు, ఇటు సామాన్య భక్తులు బాబా ఉపన్యాసాలను శ్రద్ధగా ఆలకిసుంటారు.

## ధృతరాష్ట్ర ప్రేమ

భగవాన్ బాబా ఒక ప్రసంగంలో తల్లిదండ్రులకు ఒక చక్కటి చురక వేశారు. వారి ఆ హెచ్చరికను అర్థం చేసుకుంటే తల్లిదండ్రులు తమ పిల్లలను మంచి మార్గమున నడిపించగలుగుతారు. " నేటి ఆధునిక యుగంలో నూటికి 90 పాళ్లు తల్లిదండ్రులే పిల్లల్ని పాడుచేస్తున్నారు. పిల్లలు తప్పులు చేస్తే దండించడం లేదు. పాపాలకు వడిగడితే నిందించడం లేదు. అక్రమాలకు పాలుపడితే శిక్షించడం లేదు. ఫలితంగా వారు పాతకులుగా మారి పోతున్నారు. అటువంటి కుమారులను తల్లిదండ్రులు ఏమాత్రం క్షమించరాదు. పుత్రప్రేమ ఉండవచ్చును గాని ధృతరాష్ట్ర ప్రేమవలె ఎన్ని అక్రమాలు, అనాచారాలు చేసినా క్షమిస్తూపోరాదు " అని బాబా ఒక పర్యాయం హెచ్చరించారు.

ధృతరాష్ట్రుడు కృష్ణుని బోధనలను విస్మరించాడు. విదురుడు ఎంత చెప్పినా వినలేదు. నా పుత్రులు గొప్పవారని విర్రవీగాడు. దుర్యోధనాదులు ఎంతటి అక్రమాలకు వడిగట్టినా నోరు మెదపలేదు. అందువలననే యావత్ కౌరవ వంశం సర్వనాశనమైపోయింది. పుత్రులు కావాలని సహజంగా తల్లిదండ్రులు కోరుకుంటారు. పుత్రులు లేకపోతే పున్నామనరకమును దాటలేమని భావిస్తారు. అయితే పుత్రుడు పుట్టగానే సంతోషించుతే ప్రయోజనం లేదు. ఆ పుత్రుడు ఉత్తమ గుణాలను ప్రదర్శించి పదిమందిచేత శభాష్ ! అనిపించుకున్నప్పుడే ఆ తండ్రికి నిజమైన ఆనందం చేకూరుతుంది. ఇదే వాస్తవమును సుమతీశతకం కూడా బోధిస్తున్నది.

కొమ్మగిరి కృష్ణమోహనరావు

---

దీనినే స్నేహమంటారు - షేక్స్పియర్

" పుత్రోత్సాహము తండ్రికి
బుత్రుఁడు జన్మించినపుడె పుట్టదు జనులా
పుత్రుని గనుగొని పొగడగ
పుత్రోత్సాహంబు నాడు పొందురసుమతీ!"

బాబా చలోక్తిగా చెప్పినా వాస్తవం చెప్పారు. ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడు. తన కొడుకులను గ్రుడ్డిగా నమ్మటం వలన జరిగిందేమిటో లోక విదితమే. పిల్లల్ని ప్రేమించవచ్చు. దండించాల్సి వచ్చినప్పుడు మాత్రం ఏమాత్రం వెనుకాడరాదు. పెట్టేటప్పుడు పెట్టాలి, కొట్టేటప్పుడు కొట్టాలి. సహజంగా చిన్నపిల్లలు చిన్నతనంలో చిన్న తప్పులు చేస్తారు. ప్రేమతో వాటిని ఆమోదిస్తే పెద్దవాళ్ళయిన తరువాత పెద్ద తప్పులు చేయడానికి ఏమాత్రం వెనుకాడరు. అందువలననే తల్లి దండ్రుల ప్రేమ ధృతరాష్ట్రి ప్రేమవలె వుండకూడదని బాబా సలహాయిచ్చారు. దీనిని పాటించడం తల్లిదండ్రుల ప్రథమ కర్తవ్యం.

## అంతా హిరణ్యకశిపులే

భగవాన్ బాబా ఒక పర్యాయం తల్లి దండ్రులు మరియు పిల్లల మనస్తత్వం గురించి చక్కగా వివరించారు. ఈ నాటి పిల్లలలో చాలామంది, తల్లి దండ్రుల నుండి నగలు, నాణ్యాలు, ఆస్తి పాస్తులు మాత్రమే కోరుతున్నారు. అట్టి పుత్రులు బ్రతికి వున్నా చచ్చినట్లే. కీర్తిని సంపాదించే పుత్రులే పుత్రులు. వారిని కనిన తల్లులే తల్లులు. అట్టి పుత్రులు, అట్టి తల్లులున్నప్పుడే దేశం బాగుపడుతుందని బాబా చెప్పారు. ప్రహ్లాదుని తల్లి లీలావతి భర్త హిరణ్యకశిపుని పోరు పడలేక నీవు హరి! హరి! అనడం వల్లనే నీ తండ్రి నిన్ను ఇంతగా బాధిస్తున్నాడురా! అని చెప్పిందని చెబుతూ "ఈ ఆధునిక యుగంలో చాలామంది హిరణ్యకశిపులు తయారైనారు.... పిల్లలు గుడికి వెళ్ళి దేవుని పూజిస్తే వీడికి దేవుడి పిచ్చి పట్టిందంటారు. స్వామి వద్దకు వస్తే వీడికి సాయిబాబా పిచ్చి పట్టిందంటారు. మరే పిచ్చి పట్టాలి? రౌడీగా, గూండాగా, దొంగగా మారే పిచ్చి పట్టాలా? లేక ధనం పిచ్చి పట్టాలా?" అని ప్రశ్నిస్తారు ఒక పర్యాయం భగవాన్ బాబా.

"దైవమే నిజమైన ధనం, కాని ఈ రోజుల్లో ఆ ధనం అక్కరలేదు. లౌకిక ధనం కావాలి. మనం దైవానికి అర్పితం కావాలి. దైవమార్గంలో సోదరుడు, తండ్రి, ఎవరు అడ్డంవచ్చినా.... త్యజించవలసిందే. ప్రహ్లాదుడు తండ్రిని త్యజించాడు. విభీషణుడు సోదరుని త్యజించాడు. దైవం నుండి నిన్ను దూరం చేయడానికి ఒకవేళ తల్లి ప్రయత్నించినా.... ఆమెనుకూడా త్యజించవలసిందే. దైవమార్గానికి అడ్డు తగిలితే భర్తనయినా మీరా వలె త్యజించవలసిందే. బలిచక్రవర్తి శుక్రాచార్యుని త్యజించినట్లు గురువునైనా త్యజించవలసిందే." అని అంటారు బాబా. కనుకనే "దైవముపకు సాటి ధనంబు లేదిలన్" అన్నారు పెద్దలు,

విరామము వేయి యిక్కట్లకు మూలము - నెపోలియన్

## పెట్రోమాక్స్ లైట్

ఒక పర్యాయం బాబా, బాలవికాస్ గురువుల సమావేశంలో ప్రసంగిస్తూ "పెట్రోమాక్స్ లైట్" యొక్క ఉదాహరణద్వారా చక్కటి నీతిని బోధించారు.

"మీకు నిత్య జీవితంలో కొన్ని అనుభవములుండ వచ్చును. పెట్రోమాక్స్ లైటుకు పంపు కొట్టినప్పటికీనీ, అప్పుడప్పుడు దానికి పిన్ను త్రిప్పాలి. అయితే ఎంత పంపుకొట్టినప్పటికీనీ, అందులో కొంత కిరసనాయిలు కూడా పోయాలి. కిరసనాయలు అనేది మన శ్రద్ధ. మన ప్రేమయే పిన్ను. మన విశ్వాసమే పంపు. ఈ మూటితో పాటు దివ్యమైన నామమనే వత్తి లైటుకు వున్నప్పుడే, దివ్య ప్రకాశాన్ని ఇతరులకు అందించటానికి వీలు ఏర్పడుతుంది." అని అంటారుబాబా. బాలవికాస్ గురువులకు ఇది ఒక చక్కటి ఉదాహరణ. ఏ పనిని సాధించాలన్నా శ్రద్ధ, విశ్వాసం ముఖ్యం. గురువులకు శ్రద్ధ వుండాలి. విద్యార్థులకు గురువులపై యెడల విశ్వాసం ఉండాలి. భగవంతుని మీద విశ్వాసం ఉండాలి. తన శక్తి మీద తనకు విశ్వాసం వుండాలి. "your faith is greater than my sakthi" "మీ విశ్వాసం నా శక్తి కన్నా మిన్న" అన్నారు ఒక పర్యాయం బాబా. కనుక బాలబాలికలలో గురువుల యెడల విశ్వాసాన్ని పెంపొందించాలి. తరువాత గురువులు పిల్లలను ప్రేమతో లాలించాలి. ప్రేమతో బుజ్జగిస్తే మాట వింటారు, కోపంతో దెబ్బకొడితే దూరంగా పోతారు. కనుక గురువులు చూపే శ్రద్ధ, ప్రేమలవలన పిల్లలలో గురువుల యెడల విశ్వాసం ఏర్పడుతుంది. ఆ విశ్వాసాన్ని పురస్కరించుకొని బాలబాలికల దృష్టిని భగవన్నామం మీదకు మరల్చాలి. "భగవన్నామమే భవసాగరమును దాటించే నావ" అని అంటారు బాబా.



సంపాదించినదానికంటే తక్కువ ఖర్చు చేయటం నేర్చుకో ! - స్మిత్

## గైడు పోస్ట్

బాబా ఒక చక్కటి ఉదాహరణ ద్వారా అధ్యాపకులకు మంచి ఆదర్శవంతమైన సందేశమును అందించారు. "అధ్యాపకులు దేశమునకు ఆదర్శవంతమైన జ్యోతులు. ఒక విద్యార్థి చెడితే కేవలం అతను మాత్రమే చెడగలడు. ఒక అధ్యాపకుడు చెడితే. అనేకమంది విద్యార్థులు చెడ టానికి అవకాశం ఏర్పడుతుంది. అధ్యాపకులు "గైడు పోస్టు" వంటివారు అని అంటారు బాబా. విద్యారంగం సంస్కరించబడాలంటే మొట్టమొదట అధ్యాపకులు సంస్కరించబడాలి అందువలననే అధ్యా పకులకు ప్రత్యేకంగా శిక్షణ యివ్వటం సత్యసాయి విద్యాసంస్థల ప్రత్యేకత.

విద్యార్థులకు సరియైన ఆదర్శమునందించడంలో అధ్యాపకులు నిశ్చల మనస్సుతో వ్యవహరించాలంటారు బాబా. గైడ్ పోస్ట్ స్థిరంగా నిల్చొని దృక్పథాన్ని చక్కగా ఇతరులకు వివరిస్తుంది. అదేవిధంగా అధ్యా పకులు నిశ్చలమైన మనస్సుతో, నిస్వార్థమైన హృదయంతో, ప్రేమతత్వమును పెంపొందించుకొని, విద్యార్థుల అభివృద్ధినీ, దేశాభివృద్ధినీ, సమాజక్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని ప్రవర్తించాలి.

## పాల చెంబు

ఈ నాడు రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక, సాంస్కృతిక రంగాలలో అనేక పరిణామాలు జరుగుతూ వస్తున్నాయి, మానసిక పరివర్తన రాకుండా ఎన్ని మార్పులు సంభ వించినా, ఎన్ని పరిణామములు వచ్చినా ప్రయోజనం లేదు. గ్రంథములద్వారా అనేక విషయములను తెలుసు కుంటున్నాం. కేవలం గ్రంథ పఠన వలన ఆత్మ జ్ఞానం లభ్యంకాదు. చదివిన విషయమును ఆచరణలో పెట్టినప్పుడే ఆత్మ జ్ఞాన సిద్ధి ప్రారంభమవుతుందని చెబుతూ బాబా ఒక చక్కటి ఉపమానాన్ని పేర్కొన్నారు.

"దూడను చూచిన తక్షణమే ఆవు చేపు చేస్తుంది. అదే విధంగా నిర్మలమైన, పరిశుద్ధ ప్రేమగల వ్యక్తిని చూచినప్పుడు గురువు జ్ఞానమనే క్షీరాన్ని అందిస్తాడు. ఈ జ్ఞాన క్షీరమును గ్రోలే అర్హత కావాలంటే ఆ గోవుకు తగిన బిడ్డగా మనం తయారు కావాలి అప్పుడే దివ్యమైన దైవత్వానికి, పవిత్రమైన ఆత్మతత్వాన్ని అందించాలనే అనుగ్రహం ఏర్పడుతుంది" అని బాబా పేర్కొనినారు. అందుకోసమనే కాబోలు గురువుకు తగ్గ శిష్యుడన్నారు పెద్దలు. అకలంక భక్తుడు మాత్రమే భగవదనుగ్రహమును పొందగలుగుతాడు.

## నిప్పుకోడి

భగవాన్ బాబా ఒక పర్యాయం నిప్పుకోడి ఉదంతాన్ని చక్కగా వివరించారు. నిప్పుకోడిని వేటకాడు వెంటాడుతాడు. అది తన ముక్కును ఇసుకలో దూర్చి దాస్తుంది. తననెవరూ గుర్తించుటలేదని అది భావి స్తుంది. తన పెద్దదైన దేహాన్ని విస్మరిస్తుంది, తాను చూడటంలేదు గదా యని, తనను కూడా ఎవరూ చూడటం లేదని అనుకొంటుంది ఇది చాలా మూర్ఖత్వం. దానిని వేటకాడు తప్పక గుర్తించి హతమారుస్తాడు. ఇదే రీతిగా మానవుడు తన దోషాలను ఎవరూ గుర్తిం చుట లేదని భావించినప్పటికినీ తాను దాచలేడు. మానవుని దోషాలు అతని ముఖమునందే ప్రతిబింబించుతూ వుంటా యంటారు బాబా.

ఇది ఎంతో వాస్తవం, Face is the index of mind గదా ! మంచి చెడులను ముఖం ప్రకటిస్తుంది. ఇది ఒక Notice board లాంటిది, మనం ఏది చెప్పి నప్పటికీ ప్రజలు గ్రహిస్తారు, గుర్తిస్తారు. ఈ ముఖము గ్రామఫోన్ ప్లేటు లాంటిది. దీనిలోని విషయాలు కనిపించకపోయినా వినిపిస్తాయి. అట్లే ముఖమున భావాలు వినిపించకపోయినా, కనిపిస్తాయి. కనుక దుష్ట భావాలను దాచలేము. అందువలన పవిత్ర భావాలను అభివృద్ధిపరచుకోవాలంటారు బాబా. కొంతమంది ఎవరూ చూడనిప్పుడు తప్పులు చేస్తుంటారు. ఎవరూ చూడలేదు

...వు చేసిన తప్పు, నీకు లభించిన ఒక మంచి సలహా కింద

గదాయని బుకాయిస్తారు. అది ఆత్మవంచన చేసుకోవటమే అవుతుంది. ఒకవేళ మానవమాత్రులు తప్పులను గుర్తించలేకపోయినా, అన్నిటినీ గుర్తించగల సర్వవ్యాపకుడైన సర్వేశ్వరుడు ఒకడున్నాడనే విషయం మాత్రం మరువరాదు. ఒకవేళ తోటి మానవుని మోసం చేస్తే చేయవచ్చునేమోగాని, సర్వజ్ఞుడైన ఆ జగద్రక్షకుని మాత్రం మోసం చేయలేముగదా ! ఒకవేళ తప్పు చేసిన వాడు చేయలేదని పైకి బుకాయించినా, లోపల మనసులో మథన పడుతునే ఉంటాడు. ఈ వాస్తవమును అర్థం చేసుకొనిన వారి జీవితం సార్థకమవుతుంది.

## చాతకపక్షి

భగవాన్ బాబా ఒక పర్యాయం ప్రసంగిస్తూ ప్రతి ఒక్కరూ ' చాతకపక్షి ' ని ఆదర్శంగా గైకొని జీవన యాత్రను కొనసాగించాలని హితవు చెప్పారు. చెవులు పగిలిపోయేటట్లు ఉరుములు ఉరుముతున్నా, కన్నులు మిరుమిట్లుగొలిపేటట్లు మెరుపులు మెరుస్తున్నా, చాతక పక్షి ఆ వర్ష బిందువులకోసమే ప్రాకులాడుతూ ఉంటుంది. త్రాగటానికి ఎన్ని నదులు లేవు ? ఎన్ని కొలనులు లేవు. కాని ఆ నీరు త్రాగడానికి అది ఏమాత్రం ఇష్టపడదు. ఆ పవిత్రమైన జలబిందువులకోసమే అది ప్రాకులాడుతుంది. అట్లే ఎన్ని భోగాలు, సౌఖ్యాలు, సదుపాయాలున్నా వాటిని లెక్కచేయక, ఒక్క దైవసన్నిధినే పెన్నిధిగా భావించి, దానినే ప్రధానంగా లక్ష్యంలో పెట్టుకొని, ఎన్ని చిక్కులు ఏర్పడినా, అవాంతరములు సంభవించినా త్యాగానికి పూనుకోవాలంటారు బాబా.

"కేసరి జీర్ణ తృణంబు మేయునే" ఎన్ని కష్టములు వచ్చినా, ఎంత ఆకలైనా ఎండిపోయిన గడ్డి పరకలను సింహం వాసన కూడా చూడదు. "లెక్కకు రానీయడు కార్యసాధకుడు దుఃఖంబున్ సుఖిన్'' కార్యసాధకుడు సుఖ దుఃఖములను లక్ష్య పెట్టడు. అదేవిధముగా "చాతకపక్షి" కూడా దేనినీ లెక్కచేయక ఆ జలబిందువుల కోసమే ప్రాకులాడుతుంది. కనుక ప్రతి ఒక్కరూ సుఖదుఃఖములను, కష్టసుఖములను, లాభనష్టములను లెక్కచేయకుండా దైవానుగ్రహమును సంపాదించడానికి ప్రయత్నించాలి. "చాతకపక్షి"ని ఆదర్శంగా తీసుకొని జీవనయాత్రను కొనసాగించాలంటారు బాబా. దైవ సన్నిధి ఒక్కటే మన పెన్నిది.

## అహంకారి కావద్దు, దొంగా కావద్దు

మనం చేసే సేవలు ఒకరి మెప్పుకోసం కాదు, పరులకోసం అంతకన్నా కాదు. తనకోసం తాను సేవ చేయాలి. ఎవరి భవిష్యత్తు కోసం వారు సేవచేయాలి. సేవచేయటం మానవ విద్యుక్త ధర్మం. సేవ కర్తవ్యమని భావించి చేయాలి. మానవసేవే మాధవ సేవ, సమాజసేవే సర్వేశ్వరుని సేవ అన్నారు బాబా. ఒక పర్యాయం సేవను గురించి ప్రసంగిస్తూ బాబా "ప్రేమతో సేవచేయాలి. దయాప్రేమలతో హృదయం నింపుకోవాలి. దయా ప్రేమలు లేకున్న, ఆ సేవలన్నీ కృత్రిమసేవలై పోతాయి. ఆడంబరం కోసం, పేరు ప్రతిష్ఠలు కోసం చేసినట్లువుంటాయి మనకు పేరు ప్రతిష్టలు అవసరం లేదు. ఆడంబరం అంతకంటే తగదు. ఆడంబరానికి పోతే అహంకారం పెరుగుతుంది. మనశక్తికి తగినట్లుగా మనం సేవచేయాలి. శక్తికి మించి చేస్తే అహంకారి అవుతాడు. ఉన్న శక్తి ఉపయోగించకపోతే దొంగ అవుతాడు. కనుక అహంకారీ కాకూడదు, దొంగా కాకూడదు. అహంకారం పతనానికి దారితీస్తుంది. దొంగబుద్ధి గౌరవ మర్యాదలను మంట కలుపుతుంది" అన్నారు. కనుక శక్తికి మించి ఏ పనీ చేయరాదు. ఉన్న శక్తిని దాచుకోరాదు. చేసే పని ప్రేమతో , హృదయపూర్వకంగా చేయాలి.

ఈ విధంగా భగవాన్ బాబా ఉదాహరణలతో, ఉపమానాలతో ప్రసంగిస్తుంటారు. అతిక్లిష్టమైన విషయాలను విడమర్చి సామాన్య పామర జనానికి కూడా అర్థమయ్యే విధంగా బోధిస్తారు. వారి ఆధ్యాత్మిక బోధనలు మానవునిలో మానసిక పరివర్తనను కలుగజేస్తాయి. ప్రేమతత్వమును పెంపొందిస్తాయి. మానవత్వమును ఇనుమడింపచేస్తాయి. పరోపకార బుద్ధిని పెంచుతాయి. మానవత్వంగల మనిషిగా తీర్చి దిద్దుతాయి. భగవాన్ బాబా కోరేది, ఆశించేది, అభిలషించేది అదే.... అదే....

భవిష్యత్తులో బాగా ఉపయోగిస్తుంది - చర్చిల్

# భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి సర్వజ్ఞ

భగవాన్ బాబావారి సర్వజ్ఞతను వర్ణించటానికి భగవాన్ బాబా అంతటి వారికే తగుతుంది। సూర్యుని ప్రకాశాన్ని చిరుదీపం వర్ణించలేనట్లు, సముద్రపు లోతును ఉప్పు బొమ్మ కనిపెట్టలేనట్లు, బాబావారి సర్వజ్ఞతను గూర్చి చెప్పటంలో మానవమాత్రులమైన మనము విఫలులం కాక తప్పదు।

## భారతీయ తత్త్వ శాస్త్రం దృష్టిలో

అయితే ఈ విషయంలో మనకు మన తత్త్వ శాస్త్రం కొంత తోడ్పడుతుంది।

దైవాన్ని యిచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి సంపన్నుడని మన శాస్త్రములు వర్ణిస్తాయి. ఈ మూడు శక్తులు భిన్నమైనవి కావు. ఒకే శక్తికి గల మూడు రూపాంతరాలు। భగవాన్ బాబావారిలో మనం చూచేది ఈ జ్ఞాన శక్తినే। భగవంతుడు సత్, చిత్, ఆనంద స్వరూపుడంటారు। చిత్ స్వరూపమే "సర్వజ్ఞత" యొక్క స్వరూపం।

జ్ఞాన స్వరూపాయ నమః। సుజ్ఞాన మార్గదర్శకాయ నమః। జ్ఞాన సిద్ధిదాయ నమః। అని భగవాన్ బాబా వారిని అష్టోత్తర శత నామ పూజలో వర్ణించుతాం। ఇవన్నీ బాబావారికి గల సర్వజ్ఞతను సూచించే నామాలే। ఈ సర్వజ్ఞతను దైవం యొక్క తత్త్వంగా వివరించే శాస్త్ర వచనం ఒకటి వున్నది।

ఉత్పత్తి ప్రళయంచైవ భూతానాం ఆగతింగతిం।
జ్ఞాన విజ్ఞాన యోస్తత్త్వం, యోవేత్తి స మహేశ్వరః॥

"సకల భూతముల యొక్క పుట్టుక, వినాశములనూ, వాటి యొక్క గతమును, భవితవ్యమును, జ్ఞాన విజ్ఞాన తత్త్వములను తెలిసినట్టి వాడు మహేశ్వరుడే" అంటుంది శాస్త్రం।

షిరిడీ సాయిబాబా చరిత్రలో యిలా వుంది. "బాబా వారు షిరిడీలో వున్నప్పటికీ, ఎంతెంతో దూరాల్లో కూడా ఏమి జరుగుచున్నదో తెలుసుకొనేవారు। భూత భవిష్యత్ వర్తమానములందేమి జరుగుచుండెనో వారికి తెలుసు" అంటారు సాయి చరిత్ర వ్రాసిన హేమాద్ పంత్.

---

### పొతూరి ప్రసన్నం

---

"ఈ శరీరంలో నేనిక్కడ వున్నప్పటికీ, సప్త సముద్రముల కవతల కూడా మీరు చేస్తున్న పనులు నాకు తెలుసు. ప్రపంచంలో మీరు ఎక్కడికైనా వెళ్ళండి నేను మీ చెంతనే వుంటాను. నా నివాసస్థలం మీ హృదయమే" అని షిరిడీ సాయినాధుడు అన్నారు. ఈ మాటల్లో వారి సర్వవ్యాపకత్వమే వారి సర్వజ్ఞత్వానికి మూలం అనే భావన కనబడుతుంది।

## అనుభవాల వెలుగులో బాబావారి సర్వజ్ఞత

సర్వజ్ఞత్వం అనేది కాలాతీతమైనట్టిదిగా ఈ ఉదాహరణ వల్ల తెలుస్తుంది. ఒకసారి ఒక జపాన్ ప్రముఖుడు బాబావారి వద్దకు పుట్టపర్తి వచ్చాడు. ఆయన కంటె బాబా వయస్సులో చిన్నవారే। అటువంటి బాబా యిలా అన్నారుట "నీ తల్లి దైవ భక్తురాలు. నిన్ను ప్రసవించే సమయంలో చాలా ప్రమాదం ఎదురొ్కంది. అప్పుడు బుద్ధదేవుణ్ని శరణువేడి ప్రార్థించింది। ఆ తరుణంలో నేనే ఆమెను కాపాడాను," అన్నారుట బాబా। తాను పుట్టిన సమయంలో యింకా బాబా పుట్టలేదు. అయినా బాబావారు యదార్థాన్నే చెప్పారు। బుద్ధదేవుడే బాబాగా అవతరించాడు అన్నారుట ఆ జపాన్ ప్రముఖుడు.

సత్య వాక్య పరిపాలన గొప్ప ధర్మం - శ్రీరామచంద్రుడు

షిరిడీలో కూడ సాయిబాబా చాలామంది భక్తులతో వారి గత జన్మల వృత్తాంతం చెప్పేవారు ! ఇదొక దైవానికి గల సర్వజ్ఞతకు చిహ్నం : భగవద్గీతలో శ్రీకృష్ణుడు అర్జునునితో చెప్పిన మాట కూడా యిదే ! " అర్జునా ! నీకు గల గత జన్మలన్నీ నాకు తెలుసు. నీకు మాత్రం ఆ జ్ఞానం లేదు" అంటాడు శ్రీకృష్ణప్రభువు! ఇదే రీతిగా గతించిన కాలంలో, సృష్ట్యాది నుంచీ జరిగిన ఘటనల ఎరుకను సర్వజ్ఞతకు గుర్తుగా అవతార పురుషుల విషయంలోనే చెల్లుతుంది !

## భవిష్యత్ విజ్ఞానం

" రానున్న సంవత్సరాలలో ఈ వైభవాన్ని నీ కళ్లారా చూడగలవు " అంటూ తమ 21 వ ఏట భగవాన్ బాబా 24-5-1947 న ఒక లేఖలో తమ సోదరునికి చెప్పారు ! తమ వైభవోపేతమైన దివ్య కార్యక్రమ ప్రణాళిక ఏ రీతిగా నాటి నుంచి నేటి వరకూ విస్తరించుతూ వచ్చిందో మనం గమనిస్తూనే వున్నాం కదా ! తమ యొక్క రాబోయే ప్రేమ సాయి అవతరణకు చెందిన వివరాలను కూడా భగవాన్ బాబా మనకు వివరించారు ! ఆర్నాల్డు షల్మన్ అనే రచయితతో భగవాన్ బాబా యిలా అన్నారు. " నాకు నీ భూత భవిష్యత్తులు తెలుసు ! నీ వెందుకు బాధ పడుతున్నదీ, బాధ నుంచి నీ కెప్పుడు విముక్తి కలిగేదీ నాకు తెలుసు ! " అన్నారు బాబా ! " అందరి కష్ట సుఖాలూ నాకు తెలుసు ! దానికి కారణం నేను అందరి యందూ వుండటమే ! ఈ సాయి అనే కరెంటు ప్రతి వ్యక్తి అనే బల్బులోనూ ప్రవహిస్తుంది. ప్రతి హృదయంలోనూ నేను ప్రకాశిస్తున్నాను. మీ అందరి హృదయాలలోనూ ఉన్న చైతన్య శక్తిని నేనే " అన్నారు బాబా !

## విజ్ఞాన శాస్త్ర విషయాలలో బాబావారి సర్వజ్ఞత

ఎంతోమంది సైంటిష్టులు భగవాన్ బాబావారి వద్దకు వస్తూ వుంటారు. పరిశీలిస్తారు. పరిశోధిస్తారు. బోరోనోస్కీ అనే ఒక ప్రఖ్యాత సైంటిష్టు బాబావారికిగల దివ్య తేజస్సును (AURA) గూర్చి పరిశోధించారు. (వివరాలకు అంగ్ల సంచిక, సనాతన సారథి, సెప్టెంబరు 1978 చూడ వచ్చు). భగవాన్ బాబావారు సర్వ శక్తి సమన్వితుడనీ, ప్రేమావతారుడనీ, జ్ఞాన స్వరూపి యనీ ఆ సైంటిష్టు తన ప్రసంగంలో బాబావారి సమక్షంలో, బాబావారిని చూడ వచ్చిన అనేకమంది ఉపాధ్యాయుల సమక్షంలో చెప్పారు!

" చంద్రమండలంలో గల శిల నమూనా యిదే " అంటూ ఒకసారి దానిని సృష్టించి విద్యార్థులకు చూపించటం, క్యాన్సరు రోగం ఎందుకు వస్తుందో వివరించటం పెద్ద పెద్ద డాక్టర్లకు అంతుపట్టని రోగాలను నయం చేయటం, ఒక్కొక్క సందర్భంలో విజ్ఞానశాస్త్ర సమస్యకు పరిష్కారం సూచించటం వంటివి బాబావారు చేస్తూ వుంటారు !

ఒక యాంత్రోపాలజిష్టు (Anthropologist) బాబా వారి వద్దకు వచ్చాడు. తోక వున్న కోతులే మీకు తెలుసు. తోక లేని కోతులు వుంటాయి తెలుసా ? అన్నారు భగవాన్ బాబా ! అప్పుడు ఆ సైంటిష్టు అవాక్కయి కూర్చున్నాడు ! "ఇదిగో తోకగానీ, బొచ్చు గానీ లేకుండా వుండే కోతి" అని దాని నమూనాను సృష్టించి ఆ సైంటిష్టు చేతుల్లో వుంచారట ! ఈ దివ్యలీల చేసినప్పుడు బాబావారి సమక్షంలో మా నాయనగారుకూడా వున్నారు. నాయనగారే ఈ ఉదంతం చెప్పారు ! అలాటి కోతులూ అమెజాన్ కీకారణ్యంలో చెదురు మదురుగా వున్నాయిట అమెరికా ఖండంలో !

సైన్సుకు కూడా స్వామి సర్వజ్ఞత అతీతమైనది అనే అంశాన్ని గూర్చి హేవర్డు మర్పెట్ రచనల్లో, శామ్యూల్ శాండ్విస్ రచనల్లోనూ చూడవచ్చు !

## సకల మతముల సారమే స్వామిసర్వజ్ఞతకు నిర్వచనం

వేదాలూ, ఉపనిషత్తులూ, పురాణ, శాస్త్ర, యితిహాసాలను గూర్చిన First hand knowledge భగవాన్

పుస్తకమును మస్తకములో చేర్చాలిగాని, మస్తకమునే

బాబావారిలో వుంది ! వారి దివ్య ప్రసంగాలూ, దివ్య వాహినులూ ( రచనలు ) యిందుకు నిదర్శనములు ! క్రైస్తవ, బౌద్ధ, పారశీక, జైన, యిస్లాం వంటి ప్రపంచ మతాల విషయంలో కూడా వారి వారి ధర్మాలలో బాబా ఎంతో స్ఫూర్తిని, వెలుగునూ ఆ యా మతస్థులకు అనుగ్రహిస్తున్నారు ! ఇదంతా సకల మతములకూ సార భూతమైన వారి సర్వజ్ఞత యొక్క ఫలితమే !

1969 లో నేపాలు సంబంధించిన కొండజాతివారి బృందం బాబావారిని సందర్శించింది. వారొక కొండ దేవత ఆలయాన్ని నిర్మించాలని అనుకుంటున్నారు "ఇదిగో మీ కొండ దేవత విగ్రహం" అంటూ వారి సంప్రదాయానికి సంబంధించిన వారి దేవత విగ్రహాన్ని, పంచ లోహాలతో నిర్మించినదానిని, వారికి అనుగ్రహించారు బాబా ! వారంతా ఎంతో ఆశ్చర్యం చెందారు, ఆనందించారు! వెంటనే ఆ దేవాలయం యొక్క ప్లాను కూడా తమ స్వహస్తతో గీసి ఇచ్చారు. అందులో దేవత విగ్రహం ఎక్కడ ప్రతిష్ఠించేదీ దేవత ఎదురుగా అర్థ చంద్రాకార రేఖపై కొండజాతి భక్తులు ఎక్కడ నృత్యం చేయవలసి నదీ అంతా విశదీకరించి చెప్పారు ! ఆదివాసుల బృందంలోగల శిల్పి తమ సంప్రదాయానికి చెందిన వివరాలన్నీ స్వామికి తమకంటె బాగా తెలుసునని చెప్పారుట !

బాబావారికి మన మతాలే కాదు, ఆదివాసుల సంప్రదాయములకు సంబంధించిన ప్రజ్ఞ కూడా పూర్తిగా వుంది !

## భాషా విషయిక సర్వజ్ఞత్వం

" నా భాష హృదయ భాష " అంటారు బాబా ! కనుకనే భిన్న భిన్న భాషల, జాతుల వ్యక్తులందరూ లక్షలాదిగా బాబావారి వద్దకు వస్తూనే వున్నారు. తమకు కావలసిన జీవన సందేశం పొందుతూనే వున్నారు

# సత్యగీతి

"సాయి" అనుచు పిలువ ఓయీ ! అనుచు వచ్చి
చెంత జేరి జనుల చింత తీర్చు
స్వామి కరుణ పొందువారలే ధన్యులు
సాధు సముచితోక్తి సత్యగీతి ॥

మన సనాతనయుగ మహనీయ గణనీయ
మహిమలన్ని నేడు మనకు జూప
స్వామి అవతరించె సత్యస్వరూపుడై
సాధు సముచితోక్తి సత్యగీతి ॥

వివిధ మతసుమములు వింతగా ఒకచోట
కలిసి పలువిధాల కాంతు లీన
స్వామి భావమందు పరిమళించుచునుండె
సాధు సముచితోక్తి సత్యగీతి ॥

అరటిపండు నొలిచి అందించు విధముగ
అవని జనులకెల్ల హర్షమలర
విప్పి చెప్పుచుండె వేదాంత విషయాలు
సాధు సముచితోక్తి సత్యగీతి ॥

"సాయి" అనుచు తలచ హాయి మదికి కల్గు
"సాయి" అనుచు పలుక శాంతి కలుగు
"సాయి" అనుచు నడువ సౌఖ్య గమ్యము వచ్చు
సాధు సముచితోక్తి సత్యగీతి॥

- వేదాటి రఘుపతి

సంస్కృతంలో, తెలుగులో మహా పండితులు బ్ర॥శ్రీ॥ వేలూరి శివరామశాస్త్రిగారు. మొట్టమొదటిసారిగా భగవాన్ బాబావారి దగ్గరకు వెళ్ళారు. "నవరత్నమాలిక" పేరుతో తొమ్మిది శ్లోకాలు అభువుగా ఒక కాగితంపైన వ్రాసుకున్నారు. రెండు రోజులు ఎదురుచూచినా బాబావారి పిలుపు, ఇంటర్వ్యూ దొరకలేదు. విసిగిపోయి

ఆ 'నవరత్నమాలిక' కాగితం చించిపారేశారు! మరుక్షణమే బాబావారినుంచి పిలుపు!

"ఏదీ ఆ నవరత్నమాలిక?" చేయిచాపి ప్రేమతో పలకరించారు బాబా!

"స్వామీ! ఆ కాగితం చించివేశాను. మరల అళువుగా వేరే మరొక తొమ్మిది శ్లోకాలతో మిమ్మల్ని గూర్చి స్తుతించగలను" అన్నారుట శాస్త్రిగారు.... శతావధాని కదా!

"అక్కర్లేదు వ్రాసుకో....నీవు మొదటగా కాగితం మీద వ్రాసి చించిపారవేసిన నవరత్నమాలికలోని శ్లోకాలు" అంటూ భగవాన్ బాబావారు ఆ తొమ్మిది శ్లోకాలనూ అక్షరం పొల్లుపోకుండా చదివి వినిపించారు! Dictate చేశారు.

ఈ దివ్య చమత్కారానికి శాస్త్రిగారు ఆశ్చర్యచకితులైనారు! జగన్మాత ఉపాసకులైన శ్రీ శాస్త్రిగారికి భగవాన్ బాబావారిలో వేయి తల్లుల ప్రేమమూర్తి అయిన సాయిమాత దర్శనం యిచ్చింది!

ఇలాటివే ఎన్నో ఉదాహరణలున్నాయి! భాషాపరంగా భగవాన్ బాబావారి సర్వజ్ఞతకు ఇది ఒక చిన్న ఉదాహరణ మాత్రమే!

## మన కేమిటి ప్రయోజనం?

"భగవాన్ బాబా సర్వజ్ఞులే! మన కేమిటీ ప్రయోజనం?" అంటారు కొందరు!

"బాబావారు సర్వజ్ఞులు కాదు"—అన్నప్పటికీ, "వారు సర్వజ్ఞులే" అని పొగడినప్పటికీ బాబావారికి నిర్లిప్త భావమే వుంటుంది! అయితే బాబావారు మనకు అందించే ఈ విజ్ఞాన సర్వస్వాన్ని శ్రద్ధగా చదువుతూ, మననం చేసుకుంటూ, సాధనగా మలచుకుంటూ, దాని ప్రభావాన్ని మన వ్యక్తిత్వంపై ప్రసరింపజేసుకోవటం మనం కనుక సాధిస్తే—అది మనకు పూర్ణమైన అధ్యాత్మిక అనుభూతిని తప్పక అందించగలదు!

భగవాన్ బాబా అవతరణ యిందుకే!

"Varieties of Religious Experience" అనే మహా గ్రంథంలో విలియంజేమ్స్ అనే తత్వవేత్త చెప్పినట్లు మనం చదివేదీ, వినేదీ, సంప్రదాయబద్ధంగా అనుసరించేదీ, చేసేదీ, ఆలోచించేదీ అంతా "సెకండ్ హేండ్ నాలెడ్జి" (Second hand knowledge), అంటే రెండో రకం విజ్ఞానం! మనిషికీ, మనిషిని సృజించిన దైవానికీ నడుమ గల అనుబంధాన్ని అనుభవించటమే నిజమైన మతానుభూతి, అధ్యాత్మిక అనుభవమూ!

ఈ దృష్టిలో "నేను దైవాన్నే! నీవూ దైవ స్వరూపుడవే" అని చెప్పే భగవాన్ మాటలు Second Hand Statements (రెండో రకం మాటలు) కావు! అవి First Hand ప్రజ్ఞానానికి ఉదాహరణలు!

ఈనాడు మన భాగ్యం యిదే! 'నా జీవితమే నా సందేశం' అనే మాటలో భగవాన్ బాబావారి సర్వజ్ఞత్వం, సర్వవ్యాపకత్వం, సర్వశక్తిసమన్వితత్వం వున్నాయి!

ఈ సందేశాన్ని శిరసావహించిననాడు, జీవించిననాడు భగవాన్ బాబా ఒక విజ్ఞాన సముద్రం అయితే, ఆత్మజ్ఞాన మహాంబుధి అయితే అందులో కలిసిపోయే నదులవంటి వారమే మనం! అందుకే వారి సర్వజ్ఞత—మన సాధన!

"ఈశ్వర శక్తిని ప్రకటించక దేనికీ అస్తిత్వము లేదు. వ్యక్తి వేరు, ఈశ్వరుడు వేరు; ఇది వేరు, అది వేరు అనే భేద భావమును తొలిగించి, అంతా ఆ దివ్యశక్తియొక్క అంశమే అని విశ్వసించి మెలగటమే జ్ఞానియొక్క కర్తవ్యం" అన్నారు భగవాన్ బాబా!

తెలుసుకొనేవాడు, తెలుసుకొనబడేదీ, తెలివీ ఈ మూడు వేర్వేరుగా తోచటమే మన అజ్ఞానంయొక్క లక్షణం అయితే, ఈ త్రిపుటియొక్క ఏకత్వమే సర్వజ్ఞత యొక్క స్వరూపం! అదే మన ప్రియమైన బాబావారి స్వరూపం!

విద్యను దాచుకోవద్దు, పదిమందికీ పంచు - శ్రీ మహాత్మాగాంధీ

# గీ అమృతవర్షిణి

సాయి గంగామహదేవ్

శ్లో॥ తస్మాదసక్త స్సతతం
కార్యం కర్మ సమాచర।
అసక్తో హ్యాచరన్
కర్మ పరమాప్నోతి పూరుషః॥

— కర్మ ఫలమునందలి ఆశ, ఆసక్తి మానవుని కర్మ యందు ప్రోత్సహించుచున్నవి. ఇట్టి కర్మ యందు అహంకారము, ఫలమునందు మమకారము జనించుచున్నవి. అహంకారముతో ఆత్మ విస్మృతి, మమకారముతో అనాత్మ బాంధవ్యము కలుగుచున్నవి. ఇవే జనన, మరణ ములకు హేతువులగుచున్నవి. ఒక్క ఫలాసక్తి ఇంతటి దుర్దశకు హేతుభూతమగుచున్నది. కావుననే భగవాను డిచ్చట ఆసక్తి రహితముగా, ఫలాపేక్ష లేకుండా కర్తవ్య కర్మను నిర్వర్తించమని ప్రబోధించుచున్నాడు. కర్మ ఫలమందాసక్తి లేకుండా దైవప్రీత్యర్థంగా, యజ్ఞ రూపంగా కర్మానుష్ఠాన మొనరించిన కర్మాచరణలో అహంకారము, ఫల విషయమున మమకారము జనించ నేరవు. ఫలాసక్తి లేని ఈ కర్మ పరమాత్మ ప్రాప్తిని పొందింపజేయును.

అందువలననే భగవానుడు ద్వితీయాధ్యాయపు 47వ శ్లోకమున "కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన" అని ప్రబోధించినాడు. మానవుడు కర్తవ్య కర్మాచరణ యందు తన శక్తుల నుపయోగించవలెను. కానీ ఫల విషయమున తానేరీతిగానూ ప్రవేశించరాదు. కొందరు ఈ శ్లోకమునుద్దేశించి వ్యాఖ్యానములు వ్రాస్తూ "నీకు కర్మ యందే అధికారమున్నది కానీ కర్మ ఫలమందెన్న డునూ లేదు" అని ప్రకటించారు. ఇది అసంబద్ధార్థము. కర్మ చేయుటయందధికార మున్నప్పుడు, ఆ కర్మ యందు మాత్రము అధికారమెందుకుండదు? కర్మ యందధికార మెవరిదో, కర్మఫలమందునూ అధికారము వానిదే.

పరమాత్మ "మాఫలేషు" అనినాడు కానీ "న ఫలేషు" అనలేదు. 'మా' అనగా వద్దు అని అర్థము. అనగా కర్మఫలము, కర్మ ఫలముపై అధికారము మానవులకున్నది కానీ ఆ ఫలాసక్తి వలదు–అని దాని భావము. ఫలముపై అధికారము లేదని చెప్పదలచుకొన్నచో పరమాత్మ "న ఫలేషు" అని అనియుండి యుండవలెను. ఈ రహస్యమును మనము గుర్తించవలెను. కర్మఫలమును దృష్టియందుంచుకొనక కర్మాచరణ మొనరించిన మొదట మమకారము రహితమౌతుంది. మమకారము లేకుండా అహంకారము జీవించలేదు. ఇట్లు ఫలమునందలి అనాసక్తి అహంకార, మమకార రాహిత్యమునకు దారితీయును. అప్పుడు పురుషుడు పరమాత్మ పదమునందును. పురుషుడు అనగా జీవుడు పురము (దేహము) నందు గలవాడు పురుషుడు. పురుషస్థితి నుండి పురుషోత్తమ స్థితికి ఎదగ వలెను. ఆ స్థితి ప్రాప్తికొరకే భగవానుడు ఆసక్తిరహిత కర్తవ్య కర్మానుష్ఠానము అను సాధనను అందించు చున్నాడు

సాధన చేయక వేదన తొలుగదు, వేదన తొలుగక మోదము కలుగదు. కనుక మోదము, ప్రమోదము కావలెనన్న; ఖేదము ఖేదము తొలుగవలెనన్న, వేదన తీరవలెనన్న సాధనలో ప్రవేశించవలెను. సాధన కర్మ నుండే ప్రారంభమౌతుంది. అది భక్తితో వికసి స్తుంది, జ్ఞానంతో ఫలిస్తుంది, మోక్షంతో సఫలీకృత మౌతుంది అట్టి దివ్యసాధనలో ఎల్లరు ప్రవేశించి హర్ష వర్షము నందెదరు గాక! శుభం భవతు!

—o0o—

ప్రేమలేని శరీరం స్మశానంలోని శవంతో సమానం - శ్రీ కబీర్

# సంబరాల సంక్రాంతి

**కాలచక్ర** భ్రమణంలో ఆరునెలలకొకటి చొప్పున ఒక సంవత్సరములో రెండు 'అయనములు' మనకు వస్తుంటవి. ఆషాఢమాసంలో-సూర్యుడు "కటక (కర్కాటక) రాశి"లో ప్రవేశించుటచే 'దక్షిణాయన' మేర్పడును, అట్లే, సూర్యుడు మార్గశిర (పుష్య) మాసములో 'మకర రాశి'లో ప్రవేశించుటచే— 'ఉత్తరాయణము' ఏర్పడును. (కర్కాటక, మకర రేఖలు సూర్యునకు దగ్గరగు చుండుట). దక్షిణాయనము దేవతలకు రాత్రిగను, ఉత్తరాయణము పగలుగను భావింపబడుచున్నది. ఈ రెండయనములు కలసి మనకొక సంవత్సరము కాగా, దేవతలకొక రోజగుచున్నది. ఈ మకర సంక్రమణమే-మనకు 'మకర సంక్రాంతి' పర్వదినమగుచున్నది.

ఆర్. వి. ఎస్. సుబ్బారావు

దేవతలకు రాత్రిగా భావింపబడే దక్షిణాయన ప్రారంభంలో ఆషాఢమాసంలో వచ్చే శుద్ధ ఏకాదశిని 'శయనైకాదశి' అని, 'తొలి ఏకాదశి' అని అంటారు సంక్రాంతికి ముందుగా వచ్చే (కార్తీక శుద్ధ) ఏకాదశిని 'ఉత్థానైకాదశి' అని, 'ప్రబోధిన్యేకాదశి' అని అంటారు. దేవతలు మేల్కొనే పగలు-ఉత్తరాయణ పుణ్యకాలం ఆసన్నమైనదని ప్రబోధించుటచే-ఈ ఏకాదశికి 'ప్రబోధిని' అని పేరు వచ్చింది. సంక్రాంతికి ముందుగా వచ్చే (మార్గశిర, పుష్య) ఏకాదశిని 'వైకుంఠ ఏకాదశి' అని, "మోక్ష ఏకాదశి" అని అంటారు. ఆ వైకుంఠ ఏకాదశి నాడు విష్ణులోకమైన వైకుంఠ ద్వారాలు తెరచుకొనునట. దానికి సూచనగా ఆరోజు తెల్లవారుఝామున విష్ణ్వాలయాలలో ఉత్తర ద్వారమున దైవదర్శనం చేయిస్తారు. ఆరోజు చనిపోయినవారికి విష్ణులోక ప్రాప్తి కలుగునని భారతీయుల నమ్మకము-అంతేకాదు ఉత్తరాయణ పుణ్యకాలంలో కూడ చనిపోయినా సద్గతులు కలుగ గలవు.

స్వచ్ఛంద మరణము గల భీష్ముడు భారత యుద్ధంలో అంపశయ్యపై పడిపోయి కూడ, ఉత్తరాయణము వచ్చు వరకు తన ప్రాణాలను నిలుపుకొనెను. శ్రీకృష్ణాను గ్రహమువలన వానికి అమ్ముల బాధ కూడ తొలగినది. మకర సంక్రమణమైన పిదప, ఏకాదశినాడు శ్రీకృష్ణ సాన్నిధ్యంలో ప్రాణాలు వదలి వసులోకమున కేగెనన్న భారత గాథ దీనిని బలపరచుచున్నది. అందుకే ఆ ఏకాదశి "భీష్మ ఏకాదశి"గా ప్రఖ్యాతి వహించినది.

పండ్రెండు నెలలలో "మార్గశిర" మాసము విశేషమైనది. భగవద్గీతలో శ్రీకృష్ణుడు "మాసానామ్ మార్గశీర్షోఽహమ్", అది తనకు ప్రీతికరమైనదిగా పేర్కొన్నాడు. చంద్రుడు ఈ నెలలో మృగశిరా నక్షత్రముతో వుండుటచే దీనికి "మార్గశిర, మృగ శీర్ష", మాసమని పేర వచ్చినది—మరియు, ఈ నెలలోనే సూర్యుడు "ధనూరాశి"లో ప్రవేశించుటచే-ఇది 'ధనుర్మాస' ముగ కూడ పరిగణింపబడుచున్నది. ఈ నెల పుణ్యప్రదమైనదగుటచే, ఈ నెలారంభంనుండి ప్రాతఃకాలముననే లేచి, భగవదారాధన చేసెదరు. స్త్రీలు కూడ ఇళ్ళముందు పరిశుభ్రముచేసి రంగు రంగుల ముగ్గులతో రంగవల్లులు తీర్చిదిద్ది—(ఆవు) పేడతో గొబ్బిళ్ళుచేసి వాటిపై పెట్టి, 'గొబ్బి గౌరి'గా వాటిని పూజించెదరు. పొంగలిని నైవేద్యం పెట్టెదరు. ఈ పొంగలిని "ముద్గాన్నము" అని కూడ అంటారు. మిరియాలు, అల్లము, పెసరపప్పు, నెయ్యి మొదలగు వాటితో కలసిన ఈ ముద్గాన్నము

శీలం లేని శక్తి మనిషిని కేవలం పశువుగా మారుస్తుంది - శ్రీ గురూజీ

చలికాలంలో ఆరోగ్యప్రదమైనదని, వైద్య ప్రతిపాదనము. ఈ ముగ్గులనే "సంక్రాంతి-ముగ్గు"లని కూడ అంటారు.

ఈ చలికాలంలో ఉదయమే హరి కీర్తనలు చేస్తూ, హరిదాసులు వీధులవెంట తిరుగుతారు. శ్రీహరి గుణగానంతో మనల్ని మేలుకొలిపే హరిదాసులకు తప్పక విజ్ఞులు భిక్షం పెట్టెదరు. దైనందిన కార్యక్రమాన్ని ధర్మకార్యంతో ప్రారంభిస్తుంటారు.

సూర్యుడు మకరరాశిలో ప్రవేశించు దినమే— 'సంక్రాంతి' పండుగరోజు. దీనికి ఒకరోజు ముందు "భోగి" అని, తర్వాతి రోజును "కనుము" అని అంటూ దీనిని మూడు రోజుల ముచ్చటైన పండుగ గా చేసికొంటారు. భోగినాడు ఉదయమే "చలిమంటలు" వేసుకొని, చలికి స్వస్తిచెప్పి, ఉత్తేజితులౌతారు. ఈ "భోగిమంటల"నే ఉత్తరాదిన "లోధి" అని అంటారు. భోగినాడు సాయంత్రం స్త్రీలు పేరంటాళ్ళను పిలిచి, వారి పిల్లలకు "భోగిపళ్ళు" పోస్తారు. కొందరు బొమ్మలకొలువని పిల్లలచేత దేవతల బొమ్మలు పెట్టించి వారిలో భక్తి బీజాలను నాటెదరు. ఈ బొమ్మల కొలువును పదిరోజులపాటు కూడ చేస్తుంటారు. కృషి ప్రధానమైన భారతదేశంలో పంటలు చేతికందగానే వచ్చే మొదటి పండుగ-పర్వదినం-"సంక్రాంతి".

ఈ భోగిరోజు నుండి కొందరు స్త్రీలు "గొబ్బిగౌరీ వ్రతము" ను ప్రారంభిస్తారు. దీనిని నాలుగు రోజులు చేస్తారు. భోగిరోజుతో ప్రారంభించి, సంక్రాంతి, కనుము రోజులు కూడ వ్రతమాచరించి ఆ మరునాడు - బంకమట్టితో చేసిన గౌరీదేవికి పూజ నైవేద్యానంతరం ఉద్వాసన చెప్పి, జలాలలో నిమజ్జనం చేస్తారు - గొబ్బి గౌరిని పెట్టిన మంటపానికి కూరలను తోరణాలుగ కట్తారు. ఆఖరు రోజున, గొబ్బిగౌరికి ఉద్వాసన చెప్పిన పిదప, ఆ మండపానికి కట్టిన కూరలను వండుకొని తినెదరు.

## గాంధీయ సూత్రాలు

* శిక్షించే ఆయుధమే ఉన్నా
క్షమించే గుణమే ఔదార్యం!

* నిశ్వాసం వీసెడు ఉంటేమాత్రం
ఏం లాభం ఆచరణం సే?

* దుర్మార్గుల అధికారాలకు
సన్మానాలెందుకు? దండుగ!

* ఆయుధ సృష్టికి వేసే పందెం
ఆత్మహత్యకై చేసే యత్నం!

* కత్తులు పట్టిన చేతుల కన్నా
పిడికిలి బిగించు జనమే మిన్న!

* సురభిళసుందర జీవితమే
విరిసిన విలువలు గల కళ!

* కనిపించే రూపానికి వెనుక
ఏముందో చూసేవాడే కవి!

(గాంధీ సూక్తులకు సూత్రీకరణం)

డా|| మిరియాల రామకృష్ణ

దీనినే "గొబ్బి" ప్రసాదమంటారు. కొందరు స్త్రీలు, పుట్టింటివారి క్షేమానికై "కాకి పిడచలు" అని పెట్టెదరు.

రెండవరోజు "సంక్రాంతి"-పండుగరోజు సూర్యుడు మకర సంక్రమణము చేసేవేళ నుండి సాగర, నదీ జలాలలో స్నానమొనరించెదరు ఇది పవిత్రమైన రోజగుటచే పితృదేవతలకు తర్పణాదికములు ఇచ్చెదరు. గుమ్మడికాయల పైన, వారి శక్త్యానుసారంగా సువర్ణము (బంగారము) ఉంచి, దానిని పితృదేవతల ప్రీతికై, బ్రాహ్మణులకు దానమిచ్చెదరు - బీద, సాదలకు దాన

త్యాగం చేయటం చేతనే తేజం ఆవిర్భవిస్తుంది - స్వామి రామతీర్థ

ధర్మాలుచేసి, పెద్దలకు నమస్కరించి వారి ఆశీర్వాదాలందుకొంటారు అందుచే దీనిని "మొక్కుల పండుగ" అని కూడా అంటారు – పెద్దలు పిల్లలకు తగిన కానుకలిచ్చి సంతృప్తి చేస్తారు.

మూడవరోజు "కనుము" పండుగ. ఇది కర్షకులకు, పని-పాటలు చేసేవారికీ ముఖ్యమైన వేడుకరోజు. పశువుల కొట్టాలలో పొంగలి వండి, నైవేద్యము పెట్టి, వాటిపై పసుపు – కుంకుమలు చల్లి, పొలాలలో విరజిమ్మెదరు. దీనినే "పొలి చల్లుట," అని అంటారు. ఇది "రక్తసిక్తాన్న బలి" కి ప్రత్యామ్నాయముగ భావింపబడెను. తర్వాత గుమ్మడికాయను దిష్టితీసి, పగులగొట్టారు – ఇది "పశు బలికి" మారు సేత.

ఆ రోజు పశువులను అలంకరించెదరు. ఊరేగింపులు కోళ్ల, పొట్టేళ్ళ పందేలు కూడ జరిపిస్తారు. గంగిరెద్దుల విన్యాసాలు ప్రత్యేకాకర్షణను కలిగిస్తాయి.

నాలుగవ రోజును "ముక్కనుము" అంటారు. పండుగకు వచ్చిన ఆడపడుచులను, అల్లుళ్ళకు, మనుమలకు కానుకలిచ్చి సాగనంపెదరు. మూడు రోజులు కూడా పిల్లలకు పెద్దలకు సంబరాలను కలిగిస్తుందీ సంక్రాంతి పండుగ.

సాయి చెప్పిన కథలు :

# అజ్ఞాని ఎవరు ?

ముఖమును చూచుకొను పెద్ద అద్దములతో అన్నివైపులా బిగించబడిన ఒక మండపంలోనికి ఒక మనిషి వచ్చి ఆ అద్దములలో తన ప్రతిబింబములు చూచుకొని ఆనందించెను.

వాడు వెడలిన పిదప ఒక కుక్క వచ్చెను. ఎటు చూచినను లెక్కలేనన్ని కుక్కలు దానికి కనిపించెను. అవి అన్నియు తనపై జగడమునకు వచ్చిన కుక్కలని భావించెను, అది మొఱిగిన అవి మొఱిగెను. అది ఎగిరిన అవి ఎగిరెను. ఒకదానిమీదకి అది దూకగా పెక్కు కుక్కలు దానిమీదకు దూకినట్లు అయ్యెను. దాంతో దానికి భయభ్రాంతులెక్కువయి ఆ అద్దమును పగులగొట్టెను. ఇప్పుడింక ముక్కకో కుక్క చొప్పున ప్రత్యక్షమయ్యెను.

దాంతో దానికి పట్టరాని భీతితో ఆ అద్దమును పూర్తిగా పగులగొట్టెను. అప్పుడు దోవ కన్పించెను, అది ఆ సందులోనుండి బయటకు దూకినది. అంత దానికి భయము పోయి హాయిగా ఉండినది

* అద్దాల గది వంటిదే ప్రకృతి. అందులోని మానవుడు తానాత్మస్వరూపుడనని ప్రకృతిలోని ప్రతీ వస్తువు పరమాత్మ స్వరూపమేననియు న ప్రతిబింబమేయున్నదనియు గ్రహించి అట్లు వీక్షింపగలిగనచో కామ క్రోధములు పుట్టవు అంతయూ ఆనందమయముగనే తోచును అట్లు గాక –

దేహాత్మ భావముతో తాను వేరని ఎదటివారు వేరని తలంచిన తత్క్షణమే కామక్రోధ భయోద్వేగాలు కుప్పతిప్పలుగా నుప్పతిల్లి మన జీవితమును దుఃఖమయము చేయును. అద్వైతమానందమూలము. ద్వైతమే భీతి శోక హేతువు. ఈ రెండు మార్గాలను తప్పి ప్రకృతిలో నున్న అద్దాల హాలులోని కుక్కవలె యగుదుము.

(శ్రీ సత్యసాయి కథాసుధనుండి)

వట్టి ప్రసంగాల వల్ల ప్రజలకు విముక్తి కలుగదు – శ్రీ లాలా లజపతిరాయ్

శ్రీవాణి అందించినది

# యాగ సమాప్తి

కావిలిపాటి విజయలక్ష్మి

నేను సంధ్యావందనాది తర్పణము లాచరింపక మున్నే దినకరు డస్తమించునా ? ఏల ఇంత మూఢమతి వయితివి ?

నేను తపోవనములకు బోదు. నీవు నీ అన్నలకడ కరుగుము అన్నాడు జరాయువు.

అతని మాట విని వడకుచు అదే నామధేయముగల జరాయువు, తాపసోత్తమా ? మన్నింపుము. అలమంద లిండ్లకు పోవుచున్నవి. పక్షులు గూటికి చేరుచున్నవి రవి పశ్చిమదిశ వ్రాలినాడు. మీరు ఘాడ నిద్రనుంటిరి. నియమ భంగమా ! నిద్రాభంగమా ! ఏది ఉచితమని యోచించి. నిద్రాభంగమైననూ నియమ భంగము కారాదని తెలివిమాలి మీ మహా మహిమాన్వితమైన శక్తి నెరుగక నిద్రాభంగ మొనర్చితిని మన్నింపుడు. నా అన్నల అభీష్ట మింకనూ తీరనే లేదు. మా సర్ప సంతతికి ఆయు వొసంగు తనయు నిచ్చెద నంటిరి. వారి అభీష్టము మీ వాగ్దానము సఫలము కాకముందే ! ఇటుల నీ అన్నల దరికేగుమనుట సర్వజ్ఞులైన మీరు అబలనగు నన్ను అని బొట బొట కన్నీరు కార్చినది జరాయువు.

అతని ముఖమున చిరునగవు మొలకెత్త సుదతీ నా పితరులు నీ సోదరుల సంతసింపజేయ నేటికి ఆరవ మాసమున పుత్రు డుదయింపగలడు, వగవ పనిలేదు.

నీవు నీ సోదరుల దరి కరుగుము. వార్త వీనుల సోక సర్పజాతి సంతసించెదరు. నేను తపోవనములకు బోయెద అని జరాయువు లేచినాడు.

స్వామీ, మునివర్యా. ఏమో అర్థించబోయినది. జరాయువు.

అతడు ఆశీర్వదించి తపోవనముల కరిగినాడు.

జనమే జయ యాగమున తమ తల్లి కద్రువ శాపగ్రస్తులైన నానా జాతుల సర్పరాజములు హోమ గుండమునబడి చిటపట ధ్వనుల నలుదెసలా దుర్గంధ వాయువు ప్రసరింప దగ్ధమగుచున్నవి.

అనంతాది మహా నాగములు, తమ చెల్లెలు ప్రసవించు టెప్పుడు ? ఆ అర్భకుడీ యాగ మాపు టెపుడు ? తమపై ఆ రాజు కరుణ కలుగు టెప్పుడు ? తమ జాతికి క్షేమ మెప్పుడు ? ఈ యాగాగ్ని ఘోర జ్వాలలాగున దెప్పుడు ? అని విగత మనస్కులై విచారించుచున్నారు.

ఈ యాగ మాగవలెనన్న తమ చెల్లెలు జరాయువును అదే నామము గలవానికిచ్చి వివాహము జరిపింపవలె. ఆమె గర్భమున జనించు పుత్రుడు స్వాంతన వచనముల జనమేజయుని మెప్పించి సర్పజాతి ముప్పు నాపి వారి నానందవారధి తేలియాడించగలడు. అదెట్లు సాధ్యం ?

వరునికై ముల్లోకములు గాలించి, నాగులు చివరకు తపోధనుడు జరాయువు విధించిన అనల కంగీకరించి సోదరినిచ్చి వివాహము జరిపినారు.

నాగుల కనుల పండువుగా వచ్చి, ముసిముసి నగవుల సిగ్గున మెల్లన వారి వీనుల చల్లని వార్త చెప్పినది జరాయువు.

జరాయువు శుభలగ్నమున పండంటి పుత్రుని కన్నది. ఆ బాలునకు అస్తీకుడు అను నామకరణ మొంచారు. అస్తీకుడు దిన దిన ప్రవర్థమానుడై వేద విద్యా విశారదుడై, జనమేజయుని యాగ వాటికకు వెళ్ళి స్వస్తి వచనముల రాజుని సంతుష్టుని చేసినాడు.

రా జా వటువును ధనమో, గోవులో, మణి కనక రాసులో అగ్రహారములో ఏమి కావలెనో కోరుకొమ్మనిన అస్తీకుడు—

రాజా, ఈ ముహూర్తముననే ఈ యాగ మాపివేయు మని కోరిన రాజటులనే యని ఋత్విక్కులు స్వస్తి పలుక దక్షిణలిచ్చి యాగ సమాప్తి చేసినాడు. 0₀0

---

తక్కువ మాట్లాడండి, ఎక్కువ సాధించండి - శ్రీ వల్లభాయి పటేల్

---

# రామ కథ - దాక్షిణాత్య కవులు

**రామకథ** అనగానే సంస్కృతంలో వాల్మీకి వ్రాసిన రామాయణం స్ఫురణకు రావడం సహజం. ఆ తర్వాత సంస్కృతంలో రామాయణాలు, రామకథా సంబంధి రచనలు ఎన్నో వెలువడినా, వాల్మీకి కృతి పరమ ప్రామాణికమైన రచన అనే ప్రశస్తిని గడించింది. వాల్మీకి రామాయణం ఆదికావ్యం. రససత్కావ్యం. అయినా దేశ భాషా రామాయణాలు రామకథా వ్యాప్తికి తోడ్పడినంతగా వాల్మీకి కృతి తోడ్పడలేదని చెప్పవచ్చు.

డా॥ చల్లా రాధాకృష్ణశర్మ

వివిధ దేశ భాషలలో రామాయణం రచించిన కవులకు వాల్మీకి రామాయణమే మాతృక. అయినప్పటికీ వాల్మీకి చెప్పని విశేషాలూ, కథలూ ఎన్నో వారి రామాయణాలలో చోటుచేసుకున్న విషయం పండితులకు తెలిసిందే. బహుశః ఆ రామాయణ కవులు ఒక్క వాల్మీకి రామాయణాన్నేకాక ఇతర రామాయణాలను సంప్రదించి వుండవచ్చు. అంతేకాదు, జానపదుల వ్యవహారంలోవున్న చక్కని చిక్కని కథలను గ్రంథస్థం చేయాలనే అభిలాషతో వాటిని అభిమానించి వుండవచ్చు. కొన్ని అవాల్మీక విషయాలు వారి కల్పనలై వుండవచ్చు. రామకథ వివిధ సాహిత్య రూపాలలో వివిధ దేశ భాషలలో వెలసిన కారణంగా ఆ కథకు ఎక్కడలేని ప్రచారం లభించింది. సంగ్రహంగా చెప్పాలంటే, సంస్కృత రామాయణాన్ని చదవనివారికి కూడా వాటివల్ల రామకథలోని రహస్యాలు అవగతమైనాయి. అందువల్లనే రామకథా ప్రచారానికి వివిధ దేశ భాషా కవుల రచనలు, జానపదుల గేయాలు బహుధా తోడ్పడినవని చెప్పడం సత్య సన్నిహితం.

వాల్మీకి రామాయణం తర్వాత వెలసిన ప్రాచీన సమగ్ర రామాయణాలలో కంబ రామాయణం పేర్కొనదగింది. కవి చక్రవర్తిగా పేరు పెంపులు గడించిన కంబ మహాకవి క్రీ. శ. 9 వ శతాబ్దిలో జీవించినట్లు తమిళ పండితుల అభిప్రాయం. ఆ మహాకవి 12 వ శతాబ్దివాడని కొందరి అభిప్రాయం. భారత ప్రభుత్వం వారు ప్రకటించిన కంబకవి తపాలా బిళ్ళమీద ఆయన 9 వ శతాబ్దివాడని సూచించబడింది. ఏది ఏమైనప్పటికీ కంబకవి ప్రాచీనుడనడం నిర్వివాదాంశం. తన రామాయణానికి ఆయన పెట్టిన పేరు 'రామావతారం'.

కంబకవి ముందే దక్షిణాపథంలో రామకథ ప్రచుర ప్రచారంలో వుండేది. ఇందుకు సాక్ష్యం తమిళ లో అతి ప్రాచీనమైన యుగంగా చెప్పబడుతున్న సంగ యుగపు సాహిత్యం. తమిళ సాహిత్యానికి శ్రీకారం చుట్టింది సంగ యుగమే. ఆ కాలంలో వెలువడిన కృతులలో రామకథా ప్రశంస కనిపించడం గమనించదగింది. కొందరు తమిళ పండితుల అభిప్రాయం అనుసరించి, సంగ యుగంలోనే ఒక రామాయణం వెలసినట్లు భావించవచ్చు. కాని, ఆ రామాయణం నేటిదాకా లభ్యంకాలేదు. దాని పేరు రామకథై (రామకథ) అని పండితులు భావిస్తున్నారు. పైగా తమిళనాడులోని పెక్కు స్థల పురాణాలను పరిశీలిస్తే చాలా స్థలాలు రామకథలోని ప్రధాన పాత్రలతో ముడివడినట్లుగా కనిపిస్తాయి.

సంగ యుగంలో వెలసిన అగనానూరు సంకలన కావ్యంలో రామ కథా సంబంధియైన ఒక చక్కని సన్నివేశం చిత్రించబడింది. ధనుష్కోటిలో ఒక రావి చెట్టు నీడను కూర్చొని రావణుని మీదికి ఎలా దండెత్తి వెళ్లాలా అని రాముడు తన సహచరులతో సమాలోచన

అభిమన్యునిలా పోరాటం మానుకోవాలి. ఆ...నలోని

సాగిస్తూ ఉండగా, రావిచెట్టు మీద పులుగులు, పిట్టలు చెవులు చిల్లులు పడేలా గోల చేశాయట : అప్పుడు రాముడు తల పైకెత్తి చూడగా, అ పక్షులన్నీ మౌనం వహించాయి. అనగా పక్షిజాలం సహితం రాముడితో సహకరించిందని కవి ఈ సన్నివేశం ద్వారా తెలియజేశాడు. పురనానూరు సంకలనంలోని ఒక పద్యంలో వివిధ ఆభరణాలను ఎలా ధరించాలో తెలియక తికమక చెందిన వానరుల కథ సంగ్రహంగా చెప్పబడింది. రావణాసురుడు సీతాపహరణం చేసిన సందర్భంగా, సీత తన ఆభరణాలను పై నుంచి కిందికి జారవిడిచింది. అవి వానరుల కంట బడ్డాయి. వాటిని ఏదో ఒక విధంగా ధరించి వానరులు తృప్తిపడ్డారు. ఈ సన్నివేశాలు అవాల్మీకములని చెప్పడంలో సందేహం లేదు. మరో కావ్యంలో హిమవన్నగం పైకెత్తబోయి పరాభవం చెందిన దశకంఠుని దీనావస్థ వర్ణించబడింది. ఇంకొక కృతిలో అహల్య కథ సంగ్రహంగా చెప్పబడింది.

ఈ వివిధ విషయాలను అవలోకగా పరిశీలించినా రామకథ దక్షిణాపథంలో అతి ప్రాచీన కాలం నుంచి ప్రచారంలో ఉండినట్లు వ్యక్తమౌతుంది. తమిళ పంచ కావ్యాలైన సిలప్పదిగారం, మణిమేకలై మొదలైన వాటిలో కూడ రామకథా ప్రశంస కన్పిస్తుంది. ఒక జైన కవి రామాయణం వెలయించినట్లుగా కూడ భావింపబడుతున్నది. అనగా రామకథా సంబంధి రచనలు అవిచ్ఛిన్నంగా వెలువడినట్లు భావించవచ్చు.

ఇక విష్ణు భక్తులుగా ప్రసిద్ధికెక్కిన పన్నిద్దరాళ్వారులను గురించి వేరుగా చెప్పనవసరం లేదు. ఆళ్వారుల కాలం నాటికే వాల్మీకి వర్ణించిన పురుషోత్తముడైన రాముడు అవతార పురుషుడయ్యాడు: రాముణ్ణి ఆళ్వారులు విష్ణుమూర్తిగానే భావించారు. అందువల్ల అప్పటికే రామాయణం పవిత్ర గ్రంథంగా ప్రసిద్ధికెక్కింది. శరణాగతి కావ్యంగా కూడ వాడుకలోకి వచ్చింది. భక్త కవులైన ఆళ్వారులు రామకథా సంబంధి సన్నివేశాలను తమ పాశురాలలో అభివర్ణించారు. ఆళ్వారులచే ప్రభావితుడై కంబ మహాకవి రామాయణం వ్రాసినట్లు కొందరు పండితులు పేర్కొన్నారు. ఆళ్వారుల ప్రభావం కంబని మీద ఉండడం సహజమే. కాని ఆయన మాత్రం తన రామాయణంలో వాల్మీకి మహర్షిని సభక్తికంగా స్మరించాడు. వాల్మీకి మహర్షి రామాయణం వాడుకలో ఉండగా తన వంటివాడు రామాయణ రచనకు ఉపక్రమించడం పాల సముద్రాన్ని తాగాలని ఆశించిన పిల్లి ఆశ వంటిదని ఆ మహాకవి పేర్కొనడం గమనించదగిన అంశం.

ప్రాచీనతను బట్టి కంబ రామాయణం తర్వాత పేర్కొనదగిన రచన కన్నడంలో నాగచంద్రుడు రచించిన రామచంద్ర చరిత్ర పురాణం. ఆయన 12వ శతాబ్దికి ( 13వ శతాబ్ది అని కొందరు ) చెందినవాడు. జైనుడు. అభినవ పంప బిరుదాంకితుడు. కాగా అయన రామాయణం జైన రామాయణంగా ప్రసిద్ధికెక్కడంలో ఆశ్చర్యం లేదు. ప్రాకృతంలో విమల సూరి రచించిన పద్మ చరితను అనుసరించి ఆయన వ్రాశాడు. కనుకనే ఈ జైన రామాయణానికి వాల్మీకి రామాయణానికి పోలికల కంటె భేదాలే ఎక్కువగా కన్పిస్తాయి. కన్నడంలో కూడా రామాయణ రచనలు చాలా వెలువడినట్లు చెప్పవచ్చు. కుమార వ్యాసుడైన నారణప్ప (15వ శతాబ్దం) " తిణకిదను ఫణిరాయ రామాయణద కవిగళ భారదలి " అని తన భారతావతారికలో చెప్పడం గమనించ దగిన అంశం. రామాయణ కవులను మోయలేక ఆదిశేషుడు క్రుంగిపోతున్నాడని ఈ మాటల్లోని భావం. 16వ శతాబ్ది వాడైన నరహరి రచించిన "తొరవె రామాయణం" కన్నడంలో ప్రసిద్ధమైనది. ఆయన కుమార వాల్మీకి బిరుదాంకితుడు. ఈ రామాయణం వాల్మీకిని అనుసరించి వ్రాయబడింది. 5,000 లకు పైగా షట్పదులలో ఈ రామాయణం సంతరించబడింది.

తెలుగులో కూడా ప్రాచీనకాలం నుంచే రామాయణ రచన జరిగినట్లు చెప్పవచ్చు. రంగనాథ రామాయణం, భాస్కర రామాయణం, మొల్ల రామాయణం, కట్టా వరదరాజు రామాయణం మొదలగునవి తెలుగులో వెలసిన

ధైర్యసాహసాలను అలవరచుకోవాలి - శ్రీ హరి సర్వోత్తమరావు

సమగ్ర రామాయణాలు. వీటికి పూర్వమే కవిత్రయానికి చెందిన ఎఱ్ఱన సంతరించిన రామాయణం వెలుగు చూచింది. ఆ తర్వాత కూడ వివిధ సాహిత్య ప్రక్రియలలో రామకథ అందాలు దిద్దుకొన్నది. ఒక్క మాటలో చెప్పాలంటే, తెలుగులో వెలసిన రామాయణ సాహిత్యం ఇంతా అంతా కాదు నూర్ల కొలది రామకథా సంబంధి రచనలు వెలువడ్డాయి. ఇక గాయక బ్రహ్మయైన త్యాగరాజుని గురించి చెప్పనవసరమే లేదు. రామకథా సంబంధి కీర్తనలు వ్రాసిన వాగ్గేయకారులందరిలోనూ ఆ రామభక్తుడే అగ్రగణ్యుడనడం అతిశయోక్తి కాదు. రామాయణమంటూ ప్రత్యేకంగా రచన చేయకపోయినా, ఆయన వెలయించిన కృతులలో అవాల్మీకములైన రామ కథాంశాలు ఎన్నెన్నో చోటు చేసుకున్నాయి. ఇటీవలి కాలంలో తమిళనాడులో సహృదయులు కొందరు త్యాగరాజ రామాయణమన్న పేరుతో సంగీతోపన్యాసాలు చేయడం ముఖ్యంగా పేర్కొనదగిన అంశం.

మలయాళంలో కూడ రామకథా రచన విస్తృతంగానే జరిగింది. రామ చరితం (13వ శతాబ్దం), కణ్ణశ్శన్ రామాయణం (15 వ శతాబ్దం) మొదలగునవి వెలిసినా, మలయాళ సాహిత్యంలో మణిదీపికగా ప్రతిభాసిస్తున్న కావ్యం ఎళుత్తచ్చన్ వెలయించిన అధ్యాత్మరామాయణం. 16 వ శతాబ్దిలో వెలసిన ఈ రామాయణానికి కర్త అధునిక మలయాళ భాషా జనకుడని కీర్తించబడుతున్న తుంజత్తు రామానుజన్ ఎళుత్తచ్చన్.

ఈ రామాయణ కవులందరూ విద్వాంసులు, మహాకవులని ప్రత్యేకంగా చెప్పడం అనవసరం. పైపెచ్చు రామాయణ మర్మజ్ఞులు. అందువల్ల వారి రచనలు పఠనయోగ్యములై, రమణీయ కావ్యములై వాడుకలో ఉన్నాయి. అంతేకాక ఆ యా భాషలలో అవి అనర్ఘ రత్నములై వెలుగొందుతున్నవి. ఉదాహరణానికి తమిళంలో కంబ రామాయణం, మలయాళంలో అధ్యాత్మ రామాయణం, కన్నడంలో తొరవె రామాయణం, తెలుగులో రంగనాథ రామాయణం మొదలైనవి కమనీయ కావ్యాలుగానే కాక ఆ యా భాషలకు ప్రశస్తి సమకూర్చిన రచనలుగా కూడా ప్రసిద్ధికెక్కాయి. ఈ రామాయణ కవులలో చాలామంది బ్రాహ్మణేతరులుగా కన్పిస్తున్నారు. గోన బుద్ధారెడ్డి, మొల్ల, కంబకవి, ఎళుత్తచ్చన్ మొదలైన వారిని ఈ సందర్భంగా పేర్కొనవచ్చు.

ఆ రోజుల్లోనే కాక ఈ రోజుల్లో కూడ రామకథ దాక్షిణాత్యులైన రచయితలు పలువురిని విశేషంగా ఆకర్షిస్తున్నది. రామకథలోని వివిధ అంశాలను సమర్థించేవారు, విమర్శించేవారు ఈ రచయితల్లో ఉన్నారు. అందువల్లనే నేటికీ దక్షిణాది భాషలలో రామాయణాలతో పాటు, తత్కావ్యంలోని పాత్రలకు సంబంధించిన రచనలు ఎన్నెన్నో వెలువడుతున్నాయి. ముఖ్యంగా అనాదృత పాత్రలుగా భావించబడుతున్న శబరి, ఊర్మిళ మొదలైనవారిని గురించి రచనలు వస్తున్నాయి. తమిళంలో పులవర్ కుళందై అనే కవి 'రావణ కావ్యం' అనే ప్రశస్త రచన చేశారు. విశ్వనాథ సత్యనారాయణ గారి రామాయణ కల్పవృక్షానికి, కన్నడ మహాకవి కె వి. పుట్టప్పగారి రామాయణ దర్శనానికి, అత్యంత ప్రతిష్ఠాకరమైన భారతీయ జ్ఞానపీఠం బహుమతులు లభించడం ఈసందర్భంగా పేర్కొనదగిన ప్రముఖ అంశం.

ఈ సందర్భంగా మరొక విషయం కూడ చెప్పడం అవసరం. రామకథ తొలుత సంస్కృతంలో కావ్యంగా వెలసినా, ఆ కథకు బహుళ ప్రచారం దక్షిణ భారతంలోనే లభించిందనవచ్చు. అస్సామీ, హిందీ, మరాఠీ, బెంగాలీ మొదలైన భాషలలో రామకథ కొంచెం ఆలస్యంగానే వెలసింది. అనగా 14 వ శతాబ్దినుంచీ ఆ భాషలలో రామాయణ రచన ప్రారంభమైనట్లు చెప్పవచ్చు.

ఉపసంహారంగా ఒక మాట. రామకథ దక్షిణాపథంలో బహు ప్రాచీన కాలంనుంచీ ప్రచారంలో వున్నదనీ, దక్షిణాది భాషలలో రామాయణ రచన ప్రాచీన కాలంలోనే ప్రారంభమైనదనీ, రామకథా సంబంధి రచనలు అవిచ్ఛిన్నంగా వెలువడుతున్నవనీ నిస్సంశయంగా చెప్పవచ్చు.

వినమ్రతయే స్త్రీలకు భూషణం - శ్రీ శారదామాత

# వృద్ధాప్యం

చింతపల్లి అన్నపూర్ణ

ప్రసిద్ధ అమెరికా రచయిత మార్క్‌ట్వైన్ "ది ఫైవ్ బూన్స్" అనే కథలో చెప్తాడు " వృద్ధాప్యం అవమానకరం, అయింది, బాధాకరం అయింది". అటువంటి వృద్ధాప్యంలో గొప్ప పనులు సాధించినవాళ్ళు ఎంత మందో !

రాజకీయ నాయకులలో ఎంతోమంది వృద్ధులే. శ్రీ మొరార్జీ దేశాయ్ 85 వ ఏట భారత ప్రధానిగా ఎన్నికయ్యి 2 సంవత్సరాలు నిరాటంకంగా పాలించేరు. శ్రీ రొనాల్డ్ రీగన్ 70 సంవత్సరాల వయస్సులో అమెరికా అధ్యక్షుడిగా ఎన్నికయ్యి 8 సంవత్సరాలు నిరాటంకంగా పరిపాలించేరు, శ్రీ బెంజమిన్ ఫ్రాంక్లిన్ తన 81 వ ఏట అమెరికా రాజ్యాంగ విధానాన్ని అంగీకరింప చేయటానికి రాజీ కుదిర్చేరు. అమెరికా చరిత్రలో అది ఒక గొప్ప మలుపు.

పశ్చిమ జర్మనీలో వృద్ధులు కొందరు రాజకీయ పార్టీ ఒకదాన్ని స్థాపించేరు. ఇప్పటికీ అందులో 30 వేల మంది సభ్యులు వున్నారు. ఆ పార్టీ సభ్యత్వం యింకా పెరుగుతున్నది. ఆ పార్టీ పేరు "గ్రేస్". దాని నాయకురాలు ట్రేడ్ అన్రిష్. ఆమె వయస్సు 84 సంవత్సరాలు. ప్రస్తుతం పశ్చిమ జర్మనీలో 20 శాతం మంది వయస్సు 60 ఏళ్ళు పైబడినవారే.

ఇక కళాకారులలో వృద్ధులు ఎంతమందో. ప్రఖ్యాత హాలీవుడ్ నటుడు ఛార్లెస్ లాఫ్టన్ చాలా వయస్సు వచ్చేవరకూ చిత్రాలలో నటించేడు. " స్పార్టకస్ " చిత్రంలో నటించే నాటికి ఛార్లెస్ లాఫటన్ వయస్సు 84 సంవత్సరాలు. ప్రఖ్యాత హాలీవుడ్ దర్శకుడు డేవిడ్ లీన్ తన 77 వ ఏట "ఎ పాసేజ్ టు ఇండియా" అనే కళాఖండం ఒకదాన్ని నిర్మించేడు. ఆ చిత్రం "చాలా బాగున్నది"ని అందరూ మెచ్చుకున్నారు. 80 వ పడిలో డేవిడ్ లీన్ యిప్పుడు స్వర్గీయ భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీమీద ఒక చిత్రం తీయటానికి సన్నాహాలు చేస్తున్నాడు. అడాల్ఫ జుకోర్ తన 91 వ ఏట "పారమౌంటు పిక్చర్స్"కి ఛైర్‌మన్‌గా ఎన్నిక అయ్యి ఎంతో సమర్థవంతంగా పనిచేసేడు. చర్చికి ప్రణాళికలు వేయటం ఎంతో కష్టం. అటువంటిది ప్రఖ్యాత ఇటాలియన్ శిల్పి మైకెలాంజిలో తన 88 వ ఏట "శాంతా మేరియా డెగ్లి అంగెలి" చర్చికి ప్రణాళికలు వేసేడు. ప్రఖ్యాత ఐరిష్ నాటక రచయిత, నోబెల్ బహుమాన గ్రహీత అయిన బెర్నార్డ్ షా వృద్ధాప్యంలో సహితం రాస్తూనే వుండేవాడు. బెర్నార్డ్ షా తన 93 వ ఏట "ఫార్ ఫెచ్డ్ ఫేటిల్స్" అనే నాటకం ఒకదాన్ని రాసేడు. వృద్ధాప్యంలో చదువుకోవటం ఎంతో కష్టం. అటువంటిది ప్రఖ్యాత ఆఫ్రికన్ నాయకుడు నెల్సన్ మండెలా తన 70 వ ఏట "లా" పరీక్ష పాస్ అయినాడు.

ఇక వృద్ధాప్యంలో క్రీడలలో రాణించినవారు ఎంత మందో ! ప్రఖ్యాత ఆస్ట్రేలియన్ క్రికెట్ ఆటగాడు "క్లారీ గ్రిమ్మెట్" తన 46 వ ఏట ఆస్ట్రేలియా తరఫున ఇంగ్లండుమీద టెస్ట్ మేచ్‌లో ఆడేడు. ప్రఖ్యాత ఇంగ్లండ్ క్రికెట్ ఆటగాడు విల్‌ఫ్రెడ్ రోడ్స్ తన 51 వ ఏట ఇంగ్లండు తరపున ఆస్ట్రేలియామీద టెస్ట్ మేచ్‌లో ఆడేడు. ఫుట్‌బాల్ చాలా చలాకీ అయిన ఆట. అటువంటిది ప్రఖ్యాత ఇంగ్లండ్ ఫుట్‌బాల్ ఆటగాడు స్టాన్‌లీ మెథ్యూస్ 40 ఏళ్ళు పైబడిన తరువాత కూడా ఇంగ్లండ్ తరపున ఫుట్‌బాల్ ఆడేడు. ఆస్ట్రేలియాకు చెందిన ప్రఖ్యాత టెన్నిస్ ఆటగాడు కెన్ రోజ్‌వాల్

మమత, సమత, మనుగడతో కూడిన మానవతావాదమే నేటి యుగధర్మం - శ్రీ వాక్‌సాయి

తన 41 వ ఏట సహితం వింబుల్డన్ టెన్నిస్ పోటీల్లో పాల్గొన్నాడు. గెలవలేదు అనుకోండి. పర్వత ఆరోహణ ఎంతో క్లిష్టమైన క్రీడ అటువంటిది హుల్డా క్రూక్స్ అనే అమెరికా మహిళ తన 91 వ ఏట చేతికర్ర సాయంతో జపాన్‌లో 3,776 మీటర్ల ఎత్తువున్న మౌంట్ ఫుజీ శిఖరం మీదకు అధిరోహించింది. ఆమెకు యీ పర్వత శిఖరంమీదకు ఎక్కటానికి రెండురోజులు పట్టింది. 1984 లో అమెరికాలో జరిగిన స్త్రీ పురుషుల మారథోన్ పందెంలో ఒక 70 సంవత్సరాలపైన వయస్సు గల ఒక మహిళ పాల్గొని పరుగు పూర్తిచేసింది

న్యూయార్కులోని హైడ్ పార్కులో ఒక యీత కొలను ( స్విమ్మింగ్ పూల్ ) వున్నది. అక్కడ మధ్యాహ్నం 3 గంటల దాకా ఎవరూ యీత కొట్టటానికి వీలులేదు. మధ్యాహ్నం 3-00 కాగానే ముందు శ్రీమతి ఎలియనార్ రూజ్‌వెల్టు (అమెరికా అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్టు భార్య), ఆమె వెనక చాలామంది పిల్లలూ యీత కొట్టటానికి వచ్చేవారు. అప్పటికి ఎలియనార్ రూజ్‌వెల్టు వయస్సు 70 సంవత్సరాల పైనే వుంటుంది ఆమె ఎత్తైన డైవింగ్ బోర్డు మీద నుండి స్విమ్మింగ్ పూల్ లోకి దూకేది (డైవ్ కొట్టేది). ఒకసారి ఎవరో ఆమెతో అన్నారు “ మీకు ఎంత ధైర్యం. మీకు డైవ్ కొట్టడం అంటే ఇష్టమా ? ” ఎలియనార్ రూజ్‌వెల్టు లేదండీ నాకు అసహ్యమే. కాని పిల్లలకు ఉత్సాహం రావాలి అనుకుంటున్నాను ” అని బదులు ఇచ్చింది

అర్జెంటీనాలో థెరియా ఎల్గానో అనే మహిళ వుండేది ఆమె మనుమడు ఆమెకు ఆమె పుట్టినరోజునాడు మోటార్ సైకిలు ఒకదాన్ని బహూకరించేడు. ఆమె ఆ మోటారు సైకిలు మీద అమిత వేగంగా (ఓవర్ స్పీడ్) పోతుండగా పోలీసులు పట్టుకున్నారు,

ఇక వృద్ధాప్యంలో జరిగే వింతలూ, విశేషాలూ ఎన్నెన్నో

సౌదీ అరేబియాలోని దమ్మామ్ నగరానికి చెందిన అబ్దుల్లా అత్మాజా అనే 100 సంవత్సరాల వయస్సు గల పెద్దమనిషి భార్య 3 సంవత్సరాల క్రితం మరణించింది అప్పటినుండి అతను ఒంటరితనంతో బాధపడిపోయినాడు. చివరకు 80 సంవత్సరాల మహిళ ఒకదాన్ని యిటీవలే పెళ్ళిచేసుకున్నాడు.

ఇంగ్లండులోని డ్యూరిట్‌కు చెందిన లెన్ అడ్డకార్, బెన్ అడ్డకార్ అనే పైలెట్లు ( Pilots ) ప్రపంచం మొత్తానికి వృద్ధులైన పైలట్లు. అన్న అయిన లెన్ వయస్సు 84 సంవత్సరాలు అయితే తమ్ముడు బెన్(Ben) వయస్సు 81 సంవత్సరాలు. ఇద్దరూ నడవలేక చక్రాల కుర్చీ మీదనే వున్నారు, అయితేనేం విమానం ఎక్కితే యిద్దరూ బ్రహ్మాండంగా నడపగలరు. చనిపోయేలోగా ' హిమాలయాల మీదుగా విమానం నడపాలి ' అని వీరి జీవిత ఆశయం.

ఇరాన్‌లో నెజ్మాలీ వన్మజ్యార్ అనే 133 సంవత్స రాల వృద్ధుడు వున్నాడు. ఇతనికి ఇప్పటిదాకా 4 పెళ్ళిళ్లు అయినాయి. బిడ్డలూ, మనుమలూ, మనుమరాళ్ళూ కూడా వున్నారు. అయినా ' 5 వ పెళ్ళి చేసుకోవాలి ' అని తగిన కన్యకోసం అన్వేషణలో వున్నాడు.

గ్రేట్ అంకుల్ జార్జి వయస్సు అప్పటికి 80 దాటింది ఒకసారి Morning walk (మార్నింగ్ వాక్) కి వెళ్ళి చాలా ఆలస్యంగా భోజనానికి వచ్చేడు. “షెర్‌వుడ్‌గారితో మాట్లాడుతున్నాను. ఆయన ఎంతసేపటికీ వినటం ఆపడు ” అన్నాడు.

ఈజిప్టు లోని కెయిరోలో నివసించే డోరీసాబా వయస్సు 119 సంవత్సరాలు. ఆమె 120 వ పుట్టిన రోజునాడు కెయిరో మేయరుగారు స్వయంగా హాజరై ' ఐదువేల డాలర్ల చెక్కు బహూకరించాలి ' అనుకు న్నారు - యిన్ని సంవత్సరాలు బతికినందుకు. ఈ వార్త విన్న డోరీ సాబా ఆనందంతో వుబ్బితబ్బిబ్బు అయింది ఆ సంతోషంతో గుండె ఆగి మరణించింది.

విద్యార్థి జీవితం విలాసయుతముగా నుండుటకంటే

కొలంబియా (దక్షిణ అమెరికా) లోని రెడ్ ఇండియన్ తెగకు చెందిన జేవియర్ పెరైరా బహుకాలం బతికేడు. అతను 1789 లో (జార్జి వాషింగ్టన్ అమెరికా అధ్యక్షుడు అయిన సంవత్సరం) జన్మించేడు. అతని అయిదుగురి భార్యలూ, వారి సంతానం అతను బతికి వుండగానే పోయినారు. అతన్ని 'కార్నెల్ మెడికల్ సెంటర్' (న్యూయార్కు) వారు భౌతికంగా, మానసికంగా పరీక్షించి 'చాలా చాలా వృద్ధుడు' అని తీర్మానించేరు. జేవియర్ వరి అన్నం, కూరగాయలూ, పళ్ళూ తప్ప ఏమీ తినేవాడు కాదు. చివరకు జేవియర్ 166 సంవత్సరాల వృద్ధుడు అయిన తరువాత మరణించేడు.

ఇంగ్లండ్ మొత్తానికి వృద్ధురాలు అయిన అన్నా విలియమ్ తన 114 వ ఏట వృద్ధగృహం ( Home for the Aged ) లో మరణించింది. ఆమె "నేను యిన్ని రోజులు బ్రతకటానికి కారణం పొగ త్రాగకపోవటమూ, ఎక్కువగా కాయగూరలు తినటమూ" అన్నది ఒకసారి.

ఆగష్టు 23 వ తారీఖునాడు ఇంగ్లండ్‌లోని జాన్ ఇవాన్స్ తన 112 వ పుట్టినరోజు జరుపుకున్నాడు. ఇన్నాళ్ళు బ్రతకటానికి కారణం "మద్యపానం చేయను, పొగ కాల్చను, ఎప్పుడూ ఎవరిమీదా కోపం తెచ్చుకోను. జూదం జోలికి పోను" అంటాడు జాన్ ఇవాన్స్.

పశ్చిమ జర్మనీలో వృద్ధుల సంఖ్య రోజు రోజుకీ పెరుగుతున్నది. 1987 లో పశ్చిమ జర్మనీ జనాభాలో 100 సంవత్సరాలకు వయస్సు పైబడ్డవారు 2,197 మంది వున్నారు. 1970 వ సంవత్సరపు లెక్కలతో పోల్చి చూస్తే యిది 7 రెట్లు ఎక్కువగా వున్నది.

100 సంవత్సరాలు వయస్సు బడ్డవాళ్ళు ప్రపంచంలోని మిగతా దేశాలకంటే వియత్నాంలోనే ఎక్కువగా వున్నారు. 100 సంవత్సరాలు నిండినవారు వియత్నాంలో 2,432 మంది వున్నారు. అందులో ఒక మహిళ వయస్సు 142 సంవత్సరాలు.

డెన్మార్క్‌లో ఒక 5 ఏళ్ళ బాలిక బడికి పోవటంలేదు అని అధికారులకు తెలిసింది. ఆ దేశంలో నిర్బంధ విద్యా విధానము అమలులో వున్నది. అధికారులు ఆ యింటికి వెళ్ళి వాకబుచేయగా తెలిసింది—ఆ యింటిలో 105 సంవత్సరాల వృద్ధురాలు వున్నది. కంప్యూటర్ ఆమె వయస్సు 105 కి బదులు '5' అని చూపించింది. అధికారులు నాలిక కరుచుకుని వెళ్ళిపోయినారు.

వృద్ధాప్యంలో యింకా ఎన్ని వింతలో. వృద్ధాప్యం మనుమలతో, మనుమరాళ్ళతో సరదాగా గడపవలసిన జీవన సంధ్య. వృద్ధాప్యం గూడా ఆనందించదగిన ప్రకరణమే.

## మంజువాణి

చీకటి తొలగించి చేయూత నందించు
నడత చక్కదిద్ది నడత నేర్పు
గురుని పాదములకు గురుపథంబని యెంతు
మన్నుమ్మ బ్రోవుమమ్మ మంజువాణి !

నీతులెన్నియైన నీటుగా చెప్పొచ్చు
చేసి చూపుమన్న చేతగాదు
ఆచరించి చెప్పునాతడే ఘనుడౌను
మన్నుమ్మ బ్రోవుమమ్మ మంజువాణి !

ఆశతోనె నడచు యావత్ప్రపంచంబు
ఆశ లేనినాడు ఆగిపోవు
ఆశ లెక్కువైన ఆపద పాలౌను
మన్నుమ్మ బ్రోవుమమ్మ మంజువాణి !

— భైరవభట్ల దేవీప్రకాష్

సామాన్యముగ నుండుట మంచిది - శ్రీ బాబూ రాజేంద్రప్రసాద్

# తెలుగు భారతీయత

'భారతీయత' అంటే ఏమిటో నిర్వచించడం సులువైన విషయం కాదు. ప్రాదేశికమైన సరిహద్దులతో, దేశంలో మాట్లాడే భాషలతో స్థూలంగా భారతదేశాన్నీ, భారత జాతీయతనూ గుర్తించే ప్రయత్నము కాల గమనంలో వైఫల్యాన్ని పొందిన దాఖలాలున్నాయి. "జనగణమన" జాతీయ గీతంతో పేర్కొనబడిన "సింధు" రాష్ట్రం నేడు పాకిస్తాన్‌లో వున్నది ! వంగదేశ విభజన రేకెత్తించిన జాతీయ చైతన్యము, "సోనార్ బంగ్లా" అంటూ "వందేమాతరం" అంటూ ఈ శతాబ్ది తొలి దశకంలో పెల్లుబికిన "వంగీయత" నేడేమైంది ? ముస్లిములు అధిక సంఖ్యాకులైన "బంగ్లాదేశ్" గానూ,

---

ఆర్. ఎస్. సుదర్శనం

---

భారతదేశ రాజ్య వ్యవస్థలో రాష్ట్రంగా మిగిలిన "పశ్చిమ బెంగల్" గానూ రెండు ముక్కలైంది ! అందువల్ల ప్రాదేశిక సరిహద్దులు మాట వదిలిపెట్టి, పోనీ సంస్కృతి దాని విశిష్టతను గూర్చి ఆలోచిస్తేనూ, విషయం ఒక కొలిక్కి వచ్చే దారి కనిపించదు ! వైదిక సంస్కృతిలోనే చారిత్రకమైన పరిణామాలూ, అంతరాలూ ఏర్పడ్డాయి, బౌద్ధం, జైనం వంటివి పుట్టాయి ఇస్లాము, క్రైస్తవం వంటి మతాలూ, వాటికి సంబంధించిన సంస్కృతీ వచ్చి యిక్కడి సంస్కృతిని ప్రభావితం చేశాయి. ఇవన్నీ ఆకళించుకుంటూ, భారత సంస్కృతి సమ్యగ్ స్వరూపాన్నే "భారతీయత"గా దర్శించే ప్రయత్నమే జవహర్లాల్ నెహ్రూ "భారత దర్శనం" (The Discovery of India) అనే గ్రంథంగా రూపొందింది. కాని, చరిత్ర గమనంలో భారతీయ జీవనం, దాని అభివ్యక్తి అయిన భారతీయ సంస్కృతీ యింకా భవిష్యత్తులో ఎలా మారుతుందో ఎవరూ జోస్యం చెప్పలేరు ! ఈనాడు భారతీయ సంస్కృతి ఎలా వున్నది ? దీన్ని పరిశీలించ డానికి ఆధారాలేమిటి ? ఈనాటి కవిత్వం, సాహిత్యం, కళలూ రాజకీయాలూ, సమాజంలో వ్యాపార ధోరణులూ ఏవి చూచినా మనస్సుకు సంతోషాన్నీ తృప్తినీ కలిగించే విగా కనిపించవు ! ఇది "సమకాలీనత" యొక్క దౌర్భాగ్యం కావచ్చు—అంటే మన దృష్టి లోపం ! అందువల్ల భారతీయ సంస్కృతి అంటే వెనక్కి తిరిగి చూచినప్పుడు గతంలో మనకు కనిపించే మంచి లక్షణాలే అని నిర్వచించుకోవాలి ! ఈనాడు రూపొందుతున్న కొత్త పరిణామాలూ వాటి మంచి లక్షణాలూ ఏమైనా వుంటే, అవి కొంతకాలం తర్వాత గాని రూపురేఖలు దిద్దుకొని స్పష్టంగా దృష్టికి అనవు ! అప్పుడే అవి అనుస్యూతంగా వచ్చే మౌలికమైన "భారతీయత"కు సమన్వయించేవా, కావా, అనే విషయం కూడా తేల్చుకోవ డానికి వీలవుతుంది. నేటి సంస్కృతిని "భారతీయత"గా ముద్రవేసే స్థితిలో లేము !

ఇంతకూ వేదకాలం నాటినుంచీ, 1947 లో రాజకీయ స్వాతంత్ర్యం పొంది భారత రాజ్య వ్యవస్థ ఏర్పడేదాకా జరిగిన చరిత్రలో, సంస్కృతి రూపొందిన వైవిధ్యంలో "భారతీయత"గా చెప్పుకోదగినది ఒక్క సామాన్య లక్షణమేమైనా వున్నదా అని ప్రశ్న ! ఒక పాశ్చాత్య రచయిత ప్రాచ్యదేశాల మతాలను అభివర్ణించే గ్రంథం వ్రాస్తూ ఒక్కమాట అన్నాడు : "భారతదేశం మనీష (genius) మతపరంగా, ఆధ్యాత్మికంగా అభివ్యక్తి పొందింది ; ఇంగ్లండు దేశం మనీష రాజకీయంగా అభివ్యక్తి పొందింది". వివేకానందస్వామి శిష్యురాలైన నివేదిత ఒకచోట ఈ దేశంలో అద్వైత వ్యాప్తిని గూ

మనం రక్షించవలసింది సత్యాన్నేగాని రాజ్యాన్ని కాదు - ధర్మరాజు

చెబుతూ అంటుంది—"ఆదిశంకరాచార్యులు అతి తక్కువ కాలంలో దేశం నలుమూలలా అద్వైతమతాన్ని ప్రతిష్ఠించ గలిగారు అన్నా, ఆటు తర్వాత వివేకానందస్వామి అదే రీతిగా అద్వైత వేదాంతానికి ఆధునికమూ, విశ్వజనీనమూ అయిన రూపాన్ని తీర్చిదిద్దగలిగారన్నా, అది ఆ యిద్దరి మహాపురుషుల గొప్పతనమే కాదు, వారి సందేశాన్నీ, బోధనలనూ స్వీకరించి, స్పందించడానికి సంసిద్ధమైన "జనత" యొక్క గొప్పతనం కూడా అని మనం గుర్తించాలి! " జనతయొక్క సంసిద్ధత వల్లనే అల్ప కాల్పంలో అటువంటి మహత్కార్యం సాధ్యం అయింది. ఈ మాట గాంధీగారి ఉద్యమానికి కూడా వర్తిస్తుంది కదా! శంకరాచార్యులు, వివేకానందుడు, గాంధీ ఏ ఆఫ్రికాలోనో అరబ్ దేశాల్లోనో పుట్టలేదు. వారి తాత్త్విక దృక్పథాలు ఆ దేశాల్లో ఆమోదింపబడి విజయం సాధించే అవకాశాలూ మృగ్యమే! ఈ దృష్టితో ఆలోచిస్తే, "భారతీయత" నిర్వచనానికి మౌలికమైన ఒక్క లక్షణం ఏదైనా వుంటే అది " ఆధ్యాత్మికమైన అన్వేషణ " అనే చెప్పుకోవాలి. ఇది విశేష లక్షణమే తప్ప సర్వ సామాన్యమైన లక్షణం మాత్రం కాదు. అంటే ధర్మార్థకామాలనే మూడు పురుషార్థాలూ ( motivations of man ) అన్ని దేశాల ప్రజలకూ, మన ప్రజలకూ సామాన్య లక్షణమే, బాహ్యాభివ్యక్తిలో భేదాలు వున్నప్పటికీ! చివరి పురుషార్థమైన మోక్షం యొక్క అన్వేషణ విషయంలో, ఈ దేశంలో ఉత్పన్నమై అనుసరింపబడిన విధానాలూ, మార్గాలూ, సంఖ్యలోగాని వైవిధ్యంలోగాని మరెక్కడా కలుగలేదని మాత్రం చెప్పవచ్చును.

ఆధ్యాత్మికమైన వ్యక్తి అన్వేషణ, సామూహికమైన ఆచార వ్యవహారాలుగా, సంస్కృతిపరంగా, రూపుదాల్చినప్పుడు దానినే "మతం"గా పేర్కొంటున్నాము. అట్లా పరిశీలించినా ఇతర మతాలకూ, "హిందూమత"మని పేర్కొంటున్న భారతీయ ఆధ్యాత్మిక సంస్కృతికీ

# ప్రశ్నలు-సమాధానాలు

1) మన దేశంలో పార్లమెంట్ సభ్యుడుగా ఎన్నుకొనబడటానికి కావలసిన కనీస వయస్సు ఎంత?
2) P T I అంటే ఏమిటి?
3) "సిటీ ఆఫ్ పాలెసెస్"గా ప్రసిద్ధిపొందిన నగరమేది?
4) ప్రపంచంలో కెల్లా పెద్ద లైబ్రరీ ఏది? ఎక్కడ ఉంది?
5) ప్రపంచంలోకెల్లా ఎత్తైన డాం ఏది? ఎక్కడఉంది?
6) ఎలక్ట్రానిక్ కంప్యూటర్‌ను ఎవరు, ఎప్పుడు కనుగొన్నారు?
7) "లయన్ ఆఫ్ ది పంజాబ్"గా పేర్గాంచిన వ్యక్తి ఎవరు?
8) "స్టాక్‌హోమ్" ఏ దేశపు రాజధాని?
9) వందేమాతరగీతం ఎవరిచే రచించబడింది? ఏ నవలలోనిది?
10. "సీజ్‌ఫ్రీడ్‌లైన్" ఎక్కడ ఉంది?
11) వేగంగా పరుగెత్తగల జంతువేది?
12. పాలయొక్క సాపేక్ష సాంద్రతను కొలవడానికి ఉపయోగించే పరికరం పేరేమి?

1) 25 సంవత్సరములు 2) ప్రెస్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా 3) కలకత్తా 4) యునైటెడ్ స్టేట్స్ లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్, వాషింగ్టన్ 5) గ్రాండ్ డిక్సెన్స్ డాం, స్విట్జర్లాండ్‌లో ఉంది 6) ఎక్రెట్‌మాంబ్లీ (బ్రిటన్ దేశస్థుడు) 1946 లో 7) లాలా లజపతిరాయ్ 8) స్వీడన్ 9) బంకించంద్ర ఛటర్జి, ఆనందమఠ్ 10) ఫ్రాన్స్‌తో తనకున్న సరిహద్దు పొడవునా జర్మనీ నిర్మించుకున్న రక్షణ ప్రాకారము 11) చిఱుతపులి 12) లాక్టోమీటర్

ఉద్రేకంలో ఉన్నప్పుడు ఏ సమస్యకూ పరిష్కారమార్గం కనిపించదు - మెకాలే

చాలా భేదం వున్నది "హిందూమతం" మతం కాదు, అది ఒక జీవన విధానము ; చాలా వైవిధ్యంతో, వ్యక్తుల, వర్గాల, స్వతంత్ర్య మార్గాలనీ, భిన్నత్వాన్నీ గౌరవించే దృష్టితో ఏర్పడిన విధానము అనే వివరణ యిదివరకే ఎన్నోసార్లు యివ్వబడింది అందువల్ల "భారతీయత" యొక్క సూక్ష్మరూపం మనిషియొక్క ఆధ్యాత్మికాన్వేషణ దాని స్థూలరూపం అనంత వైవిధ్యంతో, కాలానుగుణంగా మత, రాజకీయ, సాంఘిక, ఆర్థిక వ్యవస్థలతో, వ్యవహారాలతో మారుతూ వస్తోంది కాని భారతీయుల చరిత్ర "భారతీయత" కాదు ; ప్రాచీన భారత వ్యవస్థలు శిల్పాలు, కళలు వగైరా భారతీయ సంస్కృతియొక్క అభివ్యక్తి తప్ప "భారతీయత" కాదు ; కారణం అవి ఈనాడు ఆచరణలో లేకపోవచ్చు. ఈవేళ వున్నా రేపు లేకపోవచ్చు. "భారతీయత" సజీవమైనది ; అది నిత్య నూతనమైనది ;

నవలలో సమాజ జీవనం ప్రతిఫలిస్తుంది, అది వ్యక్తుల జీవితాల్నీ సమస్యల్నీ చిత్రించడం ద్వారా జరుగుతుంది. సామాజిక శాస్త్రానికి అందుబాటులో లేని విషయాల్ని నవల ద్వారా తెలుసుకోవడానికి వీలున్నది " We must study society by studying men, and men by studying society. " అన్న సూక్తి ఒక్క నవలలోనే ఆచరణ సాధ్యం. సమాజంలో వ్యక్తి ప్రవర్తనకు సామాజిక శక్తులే కారణం, వ్యక్తి కేవలం సమాజంయొక్క సృష్టి అన్నది పాక్షిక సత్యం. వ్యక్తి సమాజంవల్ల ప్రభావితుడు కావడమే కాదు, సమాజాన్ని ప్రభావితం చేస్తాడు. సామాజిక శాస్త్రం, రాజకీయ పరిణామాలూ గుర్తించేటప్పటికి ఆ ప్రభావం సామూహికం అవుతుంది అట్లా సామూహికంగా గుర్తింపుకురాని వ్యక్తి పోరాటం నవలలో గుర్తింపుకు వస్తుంది. " At the heart of the novel form lies men's ***praxis***, his never ending, restless quest to realize his humanity and purposes, the affirmation of his ultimate freedom. " (***The Novel and Revolution*** by Alan Swingewood-Macmillan ). 'ప్రాక్సిస్" సిద్ధాంతం, మనిషి-ప్రకృతి పరస్పరం ప్రభావితం కావడాన్ని గూర్చి. మార్క్స్ ప్రవచించినదే ; కాని స్టాలిన్ అనుయాయులైన కమ్యూనిస్టులు దీన్ని విస్మరించారు గొర్బాచెవ్ వల్ల పునరుత్థానమై, నేడు రష్యన్ సమాజంలో నూతన చైతన్యానికి కారణమౌతున్నది. ఫ్రెంచి విప్లవం (సరిగ్గా 200 ఏళ్ళ క్రితం జరిగింది) ప్రతిపాదించిన "స్వేచ్ఛ"-రొమాంటిసిజమ్, హ్యూమనిజమ్, మార్క్సిజమ్‌ల ద్వారా పునరావృత్తమౌతూనే వస్తున్నది. మానవుని అన్వేషణ : " ముక్తి ", " స్వేచ్ఛ " — బంధనాలనుంచి ముక్తి; వ్యక్తివికాసానికి, తన్ను తాను తెలుసుకోవడానికి స్వేచ్ఛ ఈ అన్వేషణ వ్యక్తి పరిస్థితినిబట్టి, అతను పుట్టిపెరిగిన సంస్కృతినిబట్టి వివిధ రూపాలలో సాగుతూనే ఉంటుంది తెలుగు నవలల్లో దీన్నిగూర్చిన స్పృహ ఎక్కడ వ్యక్తమౌతున్నదో, దాన్నే నేను "భారతీయత"గా పరిగణిస్తాను. కాలానుబద్ధమైన మార్పులు సంప్రదాయంలో, సంస్కృతిలో తత్త్వవివేచనలో, సామాజిక, రాజకీయ వ్యవస్థలలో ఎంతగా ఎన్ని వచ్చినప్పటికీ మానవుని మౌలికమైన అన్వేషణే "భారతీయత"; అది లేకుండా వర్ణింపబడిన దేశ కాల పరిస్థితులు ప్రాణంలేని శిల్పాలవంటివి.

" మాలపల్లి " నవలలో ( 1921 ) మారుతున్న భారతీయసంస్కృతి నేపథ్యంగా, విస్తృతమైన సామాజిక చిత్రణ ప్రాధాన్యం వహించినప్పటికీ అందులోని కీలకమైన పాత్ర కథానాయకుడు రామదాసు. కథా ప్రారంభంలోనే అతని అంతర్యం ఏమిటో వివరించే ప్రయత్నం చేశాడు రచయిత. రామదాసుకు తాను సంపాదించిన పొలం మీద, కొడుకు సంగదాసు మీద, తన కుటుంబం మీద మమకారం; భక్తి ద్వారా లభించిన ఏకాగ్రత, శాంతము అతణ్ణి జ్ఞానోన్ముఖుణ్ణి చేస్తున్నవి ఈషణా

విశాలమైన హృదయం, వ్యక్తిత్వం కలిగిన మనుష్యుల మధ్యనే

త్రయం (ధనేషణ, దారేషణ, పుత్రేషణ) స్థానమేమిటి? అని ప్రశ్నించుకుంటాడు. "ఐహికం ఆముష్మికానికి మెట్టులాగా కనబడుతుంది. ఈ మెట్టును ఉపయోగించు కోవడంలో ఉంది. నిచ్చెన స్వర్గానికి వేయవచ్చు, నరకానికి వేయవచ్చు. వీటిని పూర్తిగా ఈషణము లనడం కంటె మోక్షసాధనము లనడమే బాగుంది" అనుకుంటాడు రామదాసు. తర్వాత సంగదాసు హత్య, ఆస్తిపాస్తులు పోవడం, కుటుంబం నుంచీ ఎడబాటు, రామదాసుకు ఈషణత్రయం నుంచీ విమోచనమూ, వైరాగ్య సంపూర్తీ కలిగించాయి. జైల్లో వార్డరు రామదాసుని దిగంబరుడుగా నిలుచోమంటాడు. "సద్గురూ! ఈ అభిమానం కూడా యింతటితో వదలిపోయింది. ద్రౌపదినీ, గోపికలనూ యిట్టి స్థితికి తెచ్చే రక్షించావు. నన్నిప్పటి స్థితిలోకి తెచ్చావు. బాలల కుండే నిష్కపట హృదయము కూడా దయచెయ్యి" అంటూ ప్రపత్తిలో పరిపూర్ణతను, తద్వారా అహంకార విముక్తినీ సాధించాడు రామదాసు ఇది వైష్ణవ సంప్రదాయాన్ననుసరించి సాగిన వ్యక్తి సాధన.

విశ్వనాథ సత్యనారాయణ "వేయి పడగలు" నవల (1934) హైందవ సంస్కృతినీ, వ్యవస్థలనూ వల్లిస్తూ వాటి పూర్వప్రాశస్త్యాన్ని గూర్చి, పాశ్చాత్య నాగరికత ప్రభావం వల్ల వాటిలో వచ్చిన శైథిల్యాన్ని గూర్చి విస్తృతంగా చర్చించే పెద్ద చిత్రణ. ఇందులోని కథానాయకుడు ధర్మారావులో మారిన పరిస్థితులపట్ల వైమనస్యమూ, నిస్సహాయతా, నిర్వేదమూ వ్యక్తమౌతాయే తప్ప, ఆత్మాన్వేషణ, విముక్తి కోసం సంఘర్షణ కనిపించవు. ఈ నవలలో భారతీయ సంస్కృతికి, దాని గత వైభవానికి యిచ్చిన ప్రాధాన్యం, సజీవమైన "భారతీయత"ను యివ్వలేదనే చెప్పాలి విశ్వనాథవారిదే "ఏకవీర" నవల (1925) యిందుకు భిన్నమైనది. తెలుగు సాహిత్యంలో ప్రవేశించిన "రొమాంటిక్ లవ్"- భావనాత్మక ప్రేమకు విశ్వనాథవారు "భారతీయత" ను

స్నేహం ఏర్పడుతుంది - ఛార్లెస్ కింగ్స్లే

# జయ గీతిక

శ్రీవాణీ గిరిజాత్రియ మధుర
శ్రీకర నిర్మల రూప విహారిణి!
బ్రహ్మ విష్ణు శివాది దేవగణ
ప్రణుతి ప్రశస్త జగదాధారిణి!

తుహినగిరి శిఖర సౌధ నివాసిత
మహనీయోజ్జ్వల మంగళదాయిని!
సలలిత కదంబ వన సంచారిత
సమస్త కామిత ఫలప్రదాయిని!

సుందర మనోహర భక్త శివంకర
రూప విభాస త్రిజగన్మోహిని!
శౌర్య ప్రభాసుర శత్రు భయంకర
శక్తి ప్రభాస మృగేంద్ర వాహిని!

స్తనయుగ దీపిత మంజులతర ర
త్నాంకిత సువర్ణహార మనోహరి!
అఖిల జగన్నుతి నిస్తుల శుభ శో
భానిత సుందర త్రిపుర సుందరి!

శుంభ, నిశుంభ, రక్త బీజ ముఖ్య
శూరాగ్రేసర దైత్య విమర్దిని!
వినుత వీర పరాక్రమ విజృంభణ
ఘన భీకర మహిషాసుర మర్దిని!

జయజయ! జయజయ! కాంచన దుర్గా!
జయజయ! జయజయ శ్రీభ్రమరాంబా!
జయజయ! జయజయ! జ్ఞానప్రసూనా!
జయజయ! జయజయ! మాణిక్యాంబా!

- ప్రొఫెసర్ భారతి

జోడించి, ఏకవీరలో అంతరిక సంఘర్షణను, అన్వేషణను, ఆమె పొందిన విముక్తినీ చిత్రించారు. ఏకవీరలో ధర్మానికీ వలపునకూ ఏర్పడిన సంఘర్షణ, కూచిపూడి వారి గొల్ల కలాపమూ వీరభూపతి హఠాద్దర్శనమూ కారణంగా, రసజగత్తులోనికి పర్యవసించి, ఏకవీరకు సమాధ్యవస్థ, తత్త్వదర్శనం లభించినవి. ఇక్కడ విశ్వనాథవారు తంత్రశాస్త్ర సంప్రదాయాన్ని, కుండలీ యోగాన్ని చిత్రించారు. ఏకవీర క్రైస్తవ మత ప్రచారకునితో అంటుంది — "నేనొక వందమంది నీ మతస్థులైరి రేపు నీ తలదన్నినవాని మాటచే వారు వాని మత మవలంబింతురు. ఇది వృథా ప్రయాస. మహా విజ్ఞాని తన మోక్షము తాను సాధించుకొనును, సనాతన ధర్మము యుగములు తరబడి నిలిచినది" ఆ సనాతన ధర్మమే, వ్యక్తి ఆధ్యాత్మిక అన్వేషణ, అదే నిత్యనూతనమైన "భారతీయత".

భారతీయ సాహిత్యంలో కాల్పనికవాదం (రొమాంటిసిజమ్) ప్రవేశించడం, మన సంస్కృతిలోనే ఒక మార్పుని తీసుకువచ్చింది. సంప్రదాయాన్ని అభిమానించిన విశ్వనాథ రొమాంటిక్ ప్రేమను 'ఏకవీర' లో వ్యక్తి అన్వేషణగా చిత్రించిన సమయంలోనే, చలం 'శశిరేఖ', "దైవమిచ్చిన భార్య" (1923) నవలల ద్వారా రొమాంటిక్ ప్రేమకూ, వ్యక్తి స్వేచ్ఛకూ గల సంబంధాన్ని అన్వేషించాడు. శశిరేఖ శృంగారం, సౌందర్యానుభూతి తన "స్వధర్మ" మని వాదిస్తుంది. సామాజికమైన "నీతి" కంటె తన "స్వధర్మం" మిన్న అని విశ్వసించిన శశిరేఖ, తన అన్వేషణలో మృత్యువునే ఆహ్వానిస్తుంది. "దైవమిచ్చిన భార్య" లో పద్మావతి కూడా అంతే. భర్త – ప్రియుడు – "ఇద్దరిలో ఎవరినో ఏరుకోవడం ఏమిటి? ఎందుకు ఏరుకోవాలి? ఎవరో ఒకరు వుండి తీరాలా ఏమిటి నాకు మొగనాధుడు? మీ యిద్దరూ అక్ఖర్లేదు .... నా కోపం ఎందుకిలా, బొమిక ముక్క కోసం కుక్కల్లాగ పోట్లాడుతారు?" అంటుంది పద్మావతి. ఈ రెండు నవలల్లోనూ, చలం వ్యక్తి స్వేచ్ఛను, స్వధర్మాన్వేషణను యితివృత్తం చేశాడు. భారతీయ వివాహ వ్యవస్థకు భిన్నంగా కనిపించినా, యిది "భారతీయత" నే వ్యక్తం చేస్తున్నది! 'శశిరేఖ' నవలకు 'ప్రవేశిక' వ్రాసిన శ్రీ శివశంకర శాస్త్రి అనాడే (1926) యిలా అన్నాడు: "సాంఘిక ధర్మముల కంటె మానవ ధర్మములు ఉత్తమమైనవి. సంఘము తన స్థితి కోసమై, తాత్కాలికముగా ఏదో నియమవాగురను అల్లుకొంటుంది. సంఘము హెచ్చా, వ్యక్తులు హెచ్చా అనే ప్రశ్న బాధిస్తూనే ఉంటుంది. సాంఘిక నియమాలను నిజౌన్నత్యము కోసము అతిక్రమించే వ్యక్తులను ధర్మేతరులని కాని, విప్లవకారులని కాని అనడము సమంజసం కాదు. .... ఈ కథానాయిక సామాన్య స్త్రీ కాదు. ఈమె ప్రేమైక జీవిని. తనకు యోగ్యుడైన ప్రియుని కోసం ఎట్టి త్యాగమైనా చేసింది. స్వాతంత్ర్యము లేని సామాన్య స్త్రీల వంటి పతివ్రత ఈమె కాదు. స్వధర్మ ప్రకారము ఈమె నిస్సంశయముగా పతివ్రత." రొమాంటిసిజమ్‌కు పితృస్థానం వహిస్తున్న రూసో "ది న్యూ హెలాయిస్" అనే నవలలో యిద్దరు ప్రేమికులు ఒక స్త్రీని ప్రేమించే సన్నివేశాన్ని కల్పించి నూత్న మానవ సంబంధాలకు అంకురార్పణ చేశాడు సాహిత్యంలో. చలం అటువంటి సన్నివేశాల్నే తన నవలల్లో పదే పదే చిత్రిస్తూ, వ్యక్తి స్వేచ్ఛకు, ఆత్మాన్వేషణకు ప్రాధాన్యం యిచ్చాడు. అదే చలం నవలల్లో 'భారతీయత'. సమాజాన్ని ఎదురు దెబ్బ తీయడానికి చలం వ్రాసిన కొన్ని నవలలు – మైదానం, వివాహం, బ్రాహ్మణీకం – తెలుగు దేశంలో వివాహ సంస్కృతిని చిత్రించి, విమర్శిస్తాయే తప్ప, పైజెప్పిన "భారతీయత" ను వ్యక్తం చెయ్యవు. "జీవితాదర్శం" నవలలో (1948) అన్వేషణ, సంఘర్షణ కంటె చలం తాను వ్యక్తిగతంగా చేరుకున్న గమ్యాన్ని నిర్దేశించి చూపడం కనిపిస్తుంది. ఆ నవలలో దేశికాచారి అంటాడు – "జీవితాదర్శం శాంతి ఆ శాంతిని

ఆదరిస్తే ఆనందమూ, అనాదరిస్తే ఆగ్రహమూ పొందకూడదు – విదురనీతి

భగ్నం చేసే ఏ సుఖమూ, ఏ గొప్పతనమూ, ఏ శృంగారమూ, నా జీవితానికి చాల విరోధం. " దేశికాచారికి కోర్కెలూ, భయాలూ లేవు. బాధని తప్పించుకోవడంలో నేర్పరి. కాని బాధనుచూస్తే భయంలేదు. ఆయన హృదయంలో శాంతి, ఆకాశంలోమల్లే. దేశికాచారి విముక్తినీ, స్వేచ్ఛనూ సాధించినట్లు చలం చెబుతాడు. ఇది ఈ నవలలో 'భారతీయత'.

తెలుగు సాహిత్యంలో 1945 తర్వాత రొమాంటిసిజమ్ ప్రభావం క్షీణించి, హేతువాదం, మానవతావాదం ప్రాబల్యం వహించాయి. ఆ నేపథ్యంలో సమాజాన్ని విశ్లేషించిన, చిత్రించిన నవలలెన్నో వచ్చాయి. అందులో "భారతీయత"ను, వ్యక్తి అన్వేషణను చిత్రించిన నవలల్లో ఎన్నదగినవి గోపీచంద్ " అసమర్థుని జీవయాత్ర " (1946) బుచ్చిబాబు " చివరకు మిగిలేది " (1952). గోపీచంద్ నవలలో హేతువాదాన్ని అలంబనం చేసుకుని, ప్రతి విషయాన్నీ ఎందుకు ? అనే ప్రశ్నతో పరిశీలించి నిరాకరిస్తూ జీవితాన్ని దుర్భరం చేసుకున్న సీతారామరావు కథానాయకుడు. సీతారామరావు అన్వేషణ వ్యక్తిగతమైనది-దానికి సాంఘికమైన, చారిత్రకమైన, సంస్కృతి పరమైన సమాధానాలు గమ్యం కాలేకపోయాయి. జీవితం జీవించటానికే, జీవితాన్ని అంగీకరించాలి, జీవితాన్ని ప్రేమించాలి, దాన్ని విశ్వసించాలి అనే గమ్యం చేరుకునేదాకా, సీతారామరావులోని నిత్యశంకితుడు 'ఆత్మహత్య' చేసుకుని మరణించేదాకా, పరిష్కారం లభించలేదు ! బుచ్చిబాబు నవల యితివృత్తం "ఆర్థిక, సాంఘిక, చారిత్రక వ్యత్యాసాల కతీతమై, మనిషినీ మనిషినీ స్నేహపాశంలో బంధించే మానవత్వంయొక్క శక్తుల్ని తరచి చూడడం"గా రచయితే చెప్పుకున్నాడు. అందుకే రొమాంటిక్ ప్రేమకు, వ్యవస్థకు, నీతికి అతీతులుగా కనిపించే అమృతం, కోమలివంటి పాత్రలను చిత్రించాడు. వీరు ఊహా జనితాలు కారు, సజీవ చిత్రణలు. కథానాయకుడు దయానిధి సంఘ వ్యవస్థతో, తనలో వేరూనిన మానసిక అవరోధాలతో సంఘర్షించి, వాటిని అధిగమించి విముక్తుడవుతాడు. దయానిధి భారతీయ సమాజంలో విద్యావంతులకు, మేధావులకు ప్రతినిధి. అతని సంస్కృతి నేపథ్యంలో ఫ్రాయిడ్, రస్సెల్, మార్క్స్ వున్నారు. సంప్రదాయం తాలూకు చిహ్నాలైన స్వామీజీలూ, వేదాంతశాస్త్ర ఘోషలూ వున్నాయి. కాని స్వానుభవమే దయానిధిని దరిజేరుస్తుంది. " తన ప్రవర్తనని సరియైనదని రుజువుచేసుకుని సమాధానపడటం కోసం మానవుడుచేసే యత్నమే తన నిజస్వరూపం" అనే నిర్ణయానికి వస్తాడు. " తనలో తను సమాధానపడాలి....ఒక ప్రశాంతత, పవిత్రమైన మహత్తర ఆనందం....అది బాహ్య ప్రపంచంలో లేదు....పిచ్చి ప్రపంచాన్ని దయతో దూరంగా వుంచి....సంతృప్తిచెందే ఆధ్యాత్మిక దృష్టి, తనలో కడసారి యదార్థం." అంటాడు దయానిధి. దయానిధిపై భారతీయ సంప్రదాయం, సంస్కృతి ఎంతవరకు ప్రభావం చూపింది ? నేపథ్యం, పరిస్థితులూ, చదువూ అన్నీ గతంలో వలె లేవు ! కాని దయానిధిలో 'భారతీయత', ఆత్మాన్వేషణ ప్రస్ఫుటంగా వున్నది. !

1960 ప్రాంతాల అస్తిత్వవాద ప్రభావం తెలుగు నవలా రచయితల మీద ప్రసరించింది. జీవితం - విలువలు - వ్యక్తి మూడూ వేరు వేరు విషయాలు కావు. జీవించడం నుంచీ విలువలూ, వ్యక్తిత్వమూ సిద్ధిస్తాయి అనే దృక్పథంతో, వచ్చిన నవలలు : శీలా వీర్రాజు ' మైనా ', వి. నాగరాజు ' తాగుబోతు ', ఆర్. ఎస్. సుదర్శనం " మళ్ళీ వసంతం". ఈ మూడు నవలల్లోకి " మళ్ళీ వసంతం " లో వ్యక్తి అన్వేషణను గూర్చిన స్పృహ స్పష్టంగా గోచరిస్తుంది. " సంఘంలో జీవిత దృక్పథాలు, ఆదర్శాలు, విలువలు పాతవి మారి, క్రొత్తవి రూపొందే సంధి యుగంలో, ఆ పరిణామ వేగంలో, ఉన్న ప్రమాదం " వ్యక్తి " వినాశం. అందుకని సంఘ వ్యవస్థలో క్రొత్త పరిణామాలను నిర

దోష దృష్టియే దుఃఖానికి కారణం - మహోదాత కర్ణ

# మీకు తెలుసా?

1802 లో గెర్నిరిన్ అనే వ్యక్తి మొట్టమొదటి సారిగా ప్యారాచూట్‌లో 8000 అడుగుల ఎత్తు ఎగిరి లండన్‌లోని సెయింటు పాన్ క్రాస్ చర్చివద్ద గల విశాల మైదానంలో సురక్షితంగా దిగాడు.

టెక్సాస్‌కి చెందిన "డిక ఎల్లర్" పుట్టుకతోనే చెవులు లేకుండా పుట్టాడు. అయితే వింత ఏమిటంటే నోటి ద్వారా వినగలిగే ఇతడు గొప్ప సంగీత కారుడయ్యాడు.

ఆస్ట్రేలియాలోని క్వీన్స్‌లాండ్‌లో గొర్రెలు మేయు స్థలం చుట్టూ కింది నుంచి ఆరడుగుల ఎత్తు వరకు 3437 మైళ్ళ పొడవు తీగె కంచెను కట్టారు. ఇంత పెద్ద కంచె ప్రపంచంలో ఎక్కడా లేదు.

మనుష్య సంతతి పూర్వీకులు 70 000,000 ఏళ్ళ క్రితం పుట్టారు.

: ఐస్‌క్రీమ్ భారతదేశంలో 1828 నాటికే తయారులో ఉన్నట్లు ఆధారాలున్నాయట. ఢిల్లీ గేట్, ఉర్క్ షేడ్ గేట్ల మధ్య ప్రజలు మంచులో నీటికుండల్ని వుంచేవారు. కొన్ని గంటల తర్వాత దాన్ని ఐస్ క్రీమ్ తయారీకి ఉపయోగించేవారని "ఫాస్‌వర్క్" అనే రచయిత్రి చెప్తున్నది

: ఆగ్నేయ ఆసియా థాయిలాండ్ బాంగ్‌కాక్‌లో బంగారు బుద్ధ విగ్రహం ఉంది.

: మనం చేసే ప్రతి పనికి కొంత శక్తిని వెచ్చిస్తుంటాం అంటె కూర్చోవటం కోసం ఒక గంటలో 15 నుండి 20 వరకు క్యాలరీల శక్తి వుంది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| నిల్చోవటం | కోసం | 20 | నుండి | 25 | క్యాలరీలు |
| టి.వి. చూడటం | ,, | 75 | నుండి | 125 | ,, ,, |
| వంట చేయడం | ,, | 125 | నుండి | 200 | ,, ,, |
| సైకిలు త్రొక్కటం | ,, | 150 | నుండి | 250 | ,, ,, |

సించటం, నిరోధించటం వలనుపడదు. ఒక రైలు పట్టాలు తప్పిందని రైలు ప్రయాణాలు ముగిసిపోవు. ఒక్కొక్క మనిషి, పట్టుతప్పిపోకుండా తనలో వ్యక్తిధర్మాన్ని రక్షించుకోవాలి!" అని ఆత్మ ప్రబోధం చేసుకొని అన్వేషణ సాగిస్తుంది ఈ నవలలోని కథానాయిక ఊర్మిళ. ఆమె చేరుకున్న గమ్యం - "నాలో నిర్వేదం అదృశ్యమై పోవడమే కాదు, మనస్సుకి శాంతి లభించడమే కాదు, జీవితాన్ని సింహావలోకనం చేసుకొని, సమాధానాలు వెదుక్కొని ఒక తత్త్వ దృక్పథం ఏర్పరచుకోవడమే కాదు. అన్నిటికంటె ముఖ్యమైన, ప్రశస్తమైన అనుభూతి కొన్ని క్షణాల్లో నా కళ్ళకు బాహ్య ప్రపంచ దృశ్యం కాంతి సముజ్జ్వలంగా, ఆనంద స్నాపితంగా కనిపించటం! ఉదయకిరణాలు చెట్ల ఆకుల మీద, నీటి మీద ప్రతిఫలించి మిరుమిట్లు గొలిపే దృశ్యం, నాలో ఏదో అవ్యాజమైన ఆనందానికి కారణమౌతుంది. గదిలోని కుర్చీలు, బల్లలు ఈ ఆనందాన్ని పులుముకున్నట్లే వుంటుంది .... ఈ అనుభూతి పొందినరోజు ఆస్పత్రి పనిలో ఎక్కడా విసుగు, జుగుప్స తోచవు. కుష్ఠురోగుల్ని, అంగవైకల్యం కలిగిన వాళ్ళనీ, దుర్భరరోగ పీడితుల్ని, చిత్త విభ్రమం లేకుండా పరీక్షించి, విధి నిర్వహణ చేయగలిగిన మన స్థయిర్యమేదో నాలో వుంటుంది ...." ఎన్నో ఒడుదుడుకుల్ని, వంచనల్ని ఎదుర్కొన్న ఊర్మిళ జీవితంలో పొందిన శాంతి, ఆనందం యిది. ఈ నవలలో వ్యవస్థలూ, సంబంధాలు తలక్రిందులై కనిపిస్తాయి, కాని వ్యక్తి ధర్మం స్థిరంగా నిలిచి విజయం సాధిస్తుంది.

1961 లో గోపీచంద్ 'మెరుపుల మరకలు' నవలలో ఉషారాణి పాత్ర ద్వారా అస్తిత్వ వాదానికి అభివ్యక్తి కల్పించారు. ఉషారాణి పోయిన పోకడలో ఆత్మవిశ్వాసం, స్వచ్ఛంద ప్రవృత్తి, స్నేహం, ఆప్యాయత ద్యోతకమౌతాయి. ఉషారాణి స్వధర్మం సెక్స్ ప్రవృత్తితో ప్రారంభమై, తన అస్తిత్వానికి అర్థం ఏమిటి? తనెందుకు భిన్నంగా ప్రవర్తిస్తున్నది? అనే ప్రశ్నలతో ఒక

ఎక్కడ భోగమో అక్కడ రోగము; ఎక్కడ రోగమో

శ్రీవాణి ఆరవ జన్మదిన

కొలిక్కి వచ్చి, అస్తిత్వపు ఏకాంతం నుంచి భగవత్తత్వము వైపు పయనిస్తుంది. మారుతున్న యుగంలో సామాజిక విలువలకూ, వ్యవస్థలకూ వ్యక్తి ధర్మాన్ని అన్వేషించి ముక్తినీ, స్వేచ్ఛనూ. ఆనందాన్నీ సాధించవలసిన పరిస్థితి ఏర్పడుతున్నది. దీనికి మార్గం గత సంస్కృతిలో, సిద్ధాంతాలలో లభించడం లేదు. మార్క్సిజమ్ వంటి సామాజిక సిద్ధాంతం వ్యక్తి సమస్యను మరీ జటిలం చేస్తున్నది.

సామాజిక చిత్రణలో అంతర్భాగంగా ప్రధాన పాత్రలో ఆధ్యాత్మిక లేక అస్తిత్వ అన్వేషణను చిత్రించడం యింతవరకు చర్చించిన నవలల లక్షణం. కేవలం ఈ అన్వేషణకే యితివృత్తంగా ప్రాధాన్యమిచ్చి జీవితాన్ని వ్యక్తి దృష్టినుంచీ విశ్లేషించి వ్యక్తి అనుభూతి వైశిష్ట్యాన్ని ప్రతిపాదించే నవలా సాహిత్యం, దర్శనం ( Philosophy ) స్థాయిని అందుకుంటుంది. ఈ కోవకు చెందిన నవలలు : "హిమజ్వాల" (1974), "సంసారవృక్షం" (1976). వీటిని గూర్చిన ప్రత్యేక వివరణ యిక్కడ అనవసరం. అస్తిత్వవాదం ఒక సిద్ధాంతం కాదు ; సిద్ధాంతాలూ వ్యవస్థలూ కాకుండా వ్యక్తి అనుభూతిని ప్రధాన భూమికగా సూచించే పద్ధతి. అలా అని వ్యక్తికి నేపథ్యంగా సంస్కృతి, సమాజం వుండవనీ కాదు, వాటితో అతనికి సంఘర్షణా, సమన్వయమూ సంభవించవనీ కాదు. వాటికి వ్యక్తి లొంగిపోవడమంటూ వుండదు : "The Writer who refuses to allow a faith, a hope, or a theory to interfere with his work, who has the courage to confront existence itself, is also a metaphysician because Existence is Reality and not merely its outward form." ( E. W. Knight : ***Literature Considered as Philosophy.*** )

" ఏకమ్ సత్ విప్రా బహుధా వదన్తి" అనుభూతి ఒక్కటే, వ్యక్తులు దాన్ని పొందే మార్గాలు వేరు.

# విదుర నీతి

" యస్మిన్ యథా వర్తతే యో మనుష్య
స్తస్మింస్తథా వర్తితవ్యం సధర్మః
మాయాచారో మాయయా వర్తితవ్యః
సాధ్వాచారః సాధునా ప్రత్యుపేయః "

మనిషి ఇతరుల ఎడల ఎట్టి ప్రవర్తన గలిగియుండునో, ఇతరులున్ను అతడి యెడల అటువంటి వర్తనమునే కలిగియుండవలెను. ఇదే ధర్మము. మోసగానితో మోసముగా వ్యవహరించవలెను. మంచివానికి మంచితనముతో బదులు చెప్పవలెను.

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్; స్వభావనియతమ్ కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్." ఇది "భారతీయత" మూలకందము. వేదాంతపరమైన సంప్రదాయ సాధనకూ, అస్తిత్వపరమైన అన్వేషణకూ ముడిపెట్టడం ఛాందసులు అంగీకరించకపోవచ్చు. మేధాపరమైన శుష్క సిద్ధాంత చర్చను వదలి అనుభూతిని చేపట్టినవారు తప్పక అంగీకరింతురు. అభ్రగంగవంటి అద్వైతాన్ని భూమికి తెచ్చి, అనుష్ఠాన వేదాంతంగా ప్రబోధించిన అపర భగీరథుడు వివేకానందుడు. ఆయన అంటాడు— "నే నొక క్షుద్ర బుద్బుదమును కావచ్చును, నీ వొక పర్వతోన్నత కల్లోలము కావచ్చును. అయిన నేమి ? మన యిరువురకును సామాన్య మూలమై ఆ అనంత సాగరము నిలిచియున్నది గదా. ఆ అనంత సాగరము—జీవనమునకును, శక్తికిని, పారమార్థికతకును మూలనిధియైనది—నీ వెట్లగునో, అట్లే నాదియు అగును" ( హిందూ మతము : సర్వ సమ్మత మూల భావములు—శ్రీ రామకృష్ణమఠము, మద్రాసు ప్రచురణ, 1965 )

౦౦౦

అక్కడ ఐక్యమూ సంభవించును - శ్రీ దయానంద సరస్వతి

# విజ్ఞానవాణి

జి. ఎస్. సాయినాథ్

### సుశ్రుత

క్రీ. పూ. 6వ శతాబ్దంలో సుశ్రుతుడు జన్మించాడు. వైద్యశాస్త్రాన్ని వారణాసిలో తిలోదశ ధన్వంతరి వద్ద అతని ఆశ్రమంలో అభ్యసించాడు. శస్త్రచికిత్సలో కాక మిగిలిన వైద్యరంగంలో కూడా సుశ్రుతుడు దిట్ట. మూత్రపిండములో రాళ్ళు, ఎముకలు విరిగిన వాటికి చికిత్స, కంటిలో శుక్లాలను తీయుట మొదలగు ఎన్నో రకాల వైద్య ప్రక్రియలు ప్రపంచానికి తెలియజేసాడు. ఇతను వ్రాసిన వైద్యగ్రంథం సుశ్రుతసంహిత అరబ్బీ, హిందీ భాషలలోకి అనువదించబడినది. నేడు ప్లాస్టిక్ సర్జరీ బహుళ ప్రచారం పొందినప్పటికీ దీనిని కొన్ని వందల సంవత్సరముల క్రితమే సుశ్రుతుడు భారతదేశంలో అతి తేలికగా చేసి వైద్యరంగానికే పితామహుడైనాడు.

### పతంజలి

ఉపనిషత్తులు, అధర్వణ వేదంలో యోగాను గూర్చిన వివరణలను క్రీ.పూ. 2వ శతాబ్దంలోనే యోగ సారాన్ని తెలిపాడు. "పతంజలి యోగ సూత్రాల"ను రచించాడు. కాని ప్రపంచానికి యోగాసనాల ఆవశ్యకతను గత కొద్ది దశాబ్దాల క్రితం మాత్రం మన సైంటిస్టులు కనుగొన్నారు. ఏనాడో పతంజలి చెప్పిన శారీరక వ్యాయామం ఈనాడు శాస్త్రజ్ఞులు ప్రజలకు తెలియజేస్తున్నారు.

### భాస్కర

గణితశాస్త్రంలో సిద్ధహస్తుడైన భాస్కర, నేడు ఆల్జీబ్రాలాంటి అతి కష్టమైన గణితాన్ని కూడా సరళ శైలిలో భాస్కర గణితంలో పొందుపరిచాడు. భాస్కర కర్నాటక బిజ్జాడబీడలో 1114 వ॥లో జన్మించాడు. బ్రహ్మగుప్తుని గురువుగా అతనినుంచి గణితశాస్త్ర సారాన్ని భారతీయులకు అందజేసాడు.

### కె. యస్. కృష్ణన్

1955 లో అమెరికా నేషనల్ అకాడమి ఆఫ్ సైన్స్ కె. యస్. కృష్ణన్‌ను అతిథిగా ఆహ్వానించింది. అక్కడ అతని పరిజ్ఞానం, పరిశోధనల ఫలితాలు విని విదేశీ సైంటిస్టులు ఆశ్చర్యపోయారు. కె. యస్. కృష్ణన్ 1898 డిశంబరు 4 న తమిళనాడులో జన్మించాడు. 1920 లో పరిశోధనలకై కలకత్తాకు వెళ్ళాడు. భౌతిక శాస్త్రంలో కృష్ణన్ పరిశోధనలు చేశారు.

## నరులందుకే ఘనులా ?

అబద్ధాలు చెప్పడం
అభాండాలు వేయడం
అసహ్యంగా మాట్లాడ్డం
అనవసరంగా పోట్లాడ్డం
అవహేళన చేయడం—
ఇవి నోరున్నందుకు మనుషులు చేసే
అదనపు పనులా ?
నరేతరులకంటె నరులందుకే ఘనులా ?
కేవలం నోరేనా ?
కంటిచూపు—
కాళ్ళూ చేతులు—
కర్ణేంద్రియాల్ని ....
మనిషి దుర్వినియోగించుకున్నంత 'గొప్పగా'
మరే జీవికీ చేతకాదు పాపం !

- మహబూబ్ కమల్

మార్పు లేనిది ఏదైనా చచ్చినదాని క్రిందనే జమ - శ్రీ రాయప్రోలు

# అన్నమయ్య జీవితం "శ్రీ పదార్చన"

[ 1989 అత్యుత్తమ నవలగా బహుమతినందిన డాక్టర్ ముదిగొండ శివప్రసాద్‌గారి "శ్రీపదార్చన కథ"ను ఇల్లిందల సరస్వతీదేవిగారు ఈ పెద్ద వ్యాసంలో పరిచయం చేస్తున్నారు. సం॥ ]

"**దేవుడిని** వేదంతోనే పూజించాలా ?"

"జంతు బలితో యజ్ఞయాగాదులు చేయటం స్వర్గ ప్రాప్తికా ?"

"ఇంత కష్టపడి వేదాధ్యయనం చేయటం జంతు బలికా ?"

"స్వర్గ ప్రాప్తి అంటే రంభాది అప్సరసలతో సరసాలాడటమా ?"

"కటికవాడు జంతువులను చంపి మాంసం అమ్ముతాడు. పాలేరు పొలం పనులు చేసి తిండిగింజలు పండిస్తాడు. వాళ్ళను తాకరాదంటుందేమి ఈ సమాజం ?"

"జంతువులుగా పుట్టి యజ్ఞ యాగాదులలో బలై పోవటం వాటి కర్మా ?"

"కర్మ సిద్ధాంతమంటే ఏమిటి ?"

"అమ్మ పాడే జోలపాటలూ తుమ్మెద పాటలూ రైతులు పాడే ఏరువాక పాటలూ ఎంత మధురంగా వుంటాయి ! ఇలాంటి తెలుగు పదాలు స్వామివారికి నచ్చవా ?"

ఇవే ఆలోచనలు-ఇదే జిజ్ఞాస బాలుడైన అన్నమయ్య మనసులో సుడులు సుడులుగా తిరిగి వేద పాఠశాలను విడనాడేటట్లు చేశాయి.

అన్నమయ్య పదిహేనవ శతాబ్దములో సిద్ధవటం మండలంలోని తాళ్ళపాకలో-నందవరీక స్మార్త కుటుంబములో—సద్వంశంలో పుణ్యమూర్తి అయిన నారాయణ సూరి కుమారుడుగా జన్మించాడు. నారాయణసూరి అశ్వలాయన సూత్రుడూ-భారద్వాజ మహర్షికి వారసుడూ ఋగ్వేదికు. ఆయన నిరతాగ్నిహోత్రుడు. తాళ్ళపాకలో చెన్నకేశవస్వామి దేవాలయానికి ధర్మాధికారి.

ఇల్లిందల సరస్వతీదేవి

అన్నమయ్య తల్లి లక్కమాంబ బాల్యంనుండీ తమ స్వగ్రామంలో మాధవస్వామి ఆలయంలో దేవతార్చనకు పూలుకోస్తూ-గీత గోవింద శ్లోకాలూ తుమ్మెద పాటలూ మధురంగా రాగాలుతీస్తూ ఆలయం ముంగిట ముగ్గులు పెడుతూ వుండేది.

అటువంటి కుటుంబములో పుట్టినవాడికి ఇటువంటి విప్లవ భావాలా ?

అన్నమయ్య తిరుపతి వేంకటేశ్వరుడి వరప్రసాదము. పుత్ర సంతానంకోసం దంపతులు మనసునిండా కోరికలతో కొండ ఎక్కి స్వామి దర్శనం చేసుకున్న తరువాత జన్మించాడు అన్నమయ్య. లక్కమాంబకు స్వామి శంఖ చక్రాలతోపాటు చిరుగజ్జల మువ్విడి కటారి నందకంతో ప్రత్యక్షమయి, చిరునవ్వుతో అభయ ప్రదానం చేశాడు. ఇంటికి వచ్చిన కొన్ని మాసాలకు 1424 క్రోధినామ సంవత్సరంలో — వసంత ఋతువులో వైశాఖ పూర్ణిమనాడు—విశాఖ నక్షత్రమందు మూడు శుభగ్రహాలు ఉచ్చదశలో వున్న శుభ ముహూర్తాన

విద్యయనగా అక్షరాస్యత కాదు, వివేకము, విజ్ఞానము కలిగి వర్తించుట - శ్రీ కట్టమంచి

## వేంకటేశ శతకము

తాను జేయు తపము తన భార్య యందము
తన సుతుని తెలివియు తన మగటిమి
పొగడికొనగ రాదు నగుదురు పదుగురు ;
వినుడు వేంకటేశ విభుని మాట.

ఎదుటి వాని భార్య ఎఱ్ఱగా కనుపించు
సొంత యింతిఁ జూడ సుంత రోత
పొరుగు నింటి పుల్ల కూర రుచియనరె
వినుడు వేంకటేశ విభుని మాట.

కాలినడక తోడ కాశిని చూచినన్
చేసినట్టి యఘము చెల్లిపోదు
పాప పుణ్యములకు ఫలములు వేర్వేరు
వినుడు వేంకటేశ విభుని మాట.

నలువ యిచ్చు సొమ్ము నాకము జేరినన్
సుంత మీరి రాదు; చింత వలదు ;
కడవ కడలి ముంచ కడివెడున్ మించునే ?
వినుడు వేంకటేశ విభుని మాట.

భర్త తప్పు గాదె భార్య గయ్యాళైన ?
తనయ చెడుది యైన తల్లి తప్పు ;
తండ్రి తప్పు గాదె తనయుడు శుంఠైన ?
వినుడు వేంకటేశ విభుని మాట.

కర్మచారి శ్రమను కనడెట్టి యధికారి
తనకు వచ్చు పేరు తలచు గాని
ఎద్దు పుండదెల్లు ముద్దౌనె కాకికి
వినుడు వేంకటేశ విభుని మాట.

- గోపిశెట్టి వేంకటేశ్వరరావు

లక్కమాంబ ప్రకృతి పరవశించేటట్లు మగ శిశువును ప్రసవించింది.

అల్లారు ముద్దుగా తాత తల్లిదండ్రుల మధ్య పెరిగిన అన్నమయ్యకు నారాయణసూరి వేద విహితంగా ఉపనయనం చేశాడు. ఆ తరువాత వేదాధ్యయనం మొదలైంది. అతడు ఏకసంతగ్రాహి. ఆచార్యుడికి వేదాపనస ఉదాత్త అనుదాత్త స్వరితములలో చక్కగా తడుముకోకుండా చెప్పేవాడు.

అన్నమయ్య పెరుగుతున్నకొద్దీ గురువు చెప్పే పాఠాలలో అనేక సందేహాలు కలుగుతూ వుండేవి జంతు బలి అంటే హృదయం చలించేది. పాలేరును కటికవాడిని ఎందుకు తాకరాదో అతడి సందేహాలను తీర్చేవారెవరూ లేరు. అతడికి కర్మ సిద్ధాంత బద్ధమైన వేద విద్యలో అభిరుచి కలగలేదు. తత్వమంటే బ్రహ్మమేనంటాడు వేదాచార్యుడు. ఆయనే-ఈ జగత్తు మిధ్య అంటాడు. జీవుడికి అజ్ఞానంవల్ల-అవిద్యవల్ల రజ్జుసర్ప భ్రాంతి కలిగిందంటాడు. జీవుడు దేవుడికంటె భిన్నమా అంటే-కాదు దేవుడే జీవుడంటాడు.

ఏమిటీ భావ వైరుధ్యం ?

ఒకదానితో ఒకటి పొత్తుకుదరని మాటలు ?

ఇది జగన్మిధ్యా వాదమంటాడు తాత నారాయణ తీర్థులు. " ద్వైతాద్వైత విశిష్టాద్వైత సారమురా. ముందు ఇదంతా తెలుసుకో " మంటాడు తాత.

వేదాంత రహస్యాలు తెలిసిన తల్లి లక్కమాంబ " ఆచార్యుడు చెప్పినదంతా చదువుకో. నీ అనుమానాలు బైట పెట్టకు " అంటుంది.

అన్నమయ్య హృదయంలో ఏదో మధన - ఆ పసి హృదయానికి గురువులు చెప్పింది సమంజసం కాదని పిస్తుంది. సరిగా అర్థంకా లేదని చికాకుపడతాడు. పాఠశాల మీద శ్రద్ధ తగ్గిపోనారంభించింది. వెళ్ళడం తగ్గించాడు.

పలువురు మూఢులైన నిరక్షర కుక్షులు చేయు హానికంటెను,

కాని తల్లి పాడే పదాలవైపు మనసు మళ్ళుతుంది. ఆమె దగ్గర కూర్చుని ఆ పదాలను పాడుతూ ఉంటాడు – మధురంగా తల్లి పాడినంత మధురంగా.

లేక లేక కలిగిన కుమారునిలో ఈ పరిణామము నారాయణ సూరి సహించరానిది. అన్నమయ్యది విప్లవ ధోరణిగా భావిస్తాడు. అన్నమయ్యను బాగా శిక్షించి, వేద విద్యను బోధించమని ఆచార్యులతో చెప్తాడు. వేదాచార్యుడు పాఠశాలకు సరిగా హాజరు కాని అన్నమయ్యను కోదండం వేయించి ముంతపొగ పెట్టిస్తాడు. ఆ శిక్షలకు ఆగలేని అన్నమయ్య ఇంటికి వచ్చి పదాలు పాడుతూ స్నేహితులతో తిరుగుతూ ఉంటాడు. తండ్రికి కోపం వచ్చి, పాలేరుతో కలిసి పొలంపనులు గొడ్లసావడి పనులూ చెయ్యమని శిక్ష వేస్తాడు.

అన్నమయ్య సంతోషంతో పాలేరుతో కలిసి గడ్డికోస్తూ " ఓ పదం పాడరా " అంటాడు.

" గంగ తీర్థం తీసుకొచ్చి
లింగ పూజ చేతమంటే
గంగలోని చేప, కప్ప
ఎంగిలంటున్నాయి లింగా
ఏమీ చేతురా "

ఈ పదం విన్న అన్నమయ్య "ఎవరిదిరా ఈ పాట?" అడుగుతాడు "తంబళ్ళ మహారుద్రయ్య పాడగా విన్నా" నంటాడు పాలేరు.

" కన్నడంలో తమిళంలో సంస్కృతంలో మంచి పాటలూ పదాలూ ఉన్నాయి. తెలుగులో లేవు " అనుకుని నిట్టూర్చాడు అన్నమయ్య.

" మీరు వ్రాయకూడదా ? " అంటాడు చనువుగా పాలేరు. అప్పటి నుంచి అతడిలోని పదకర్త, మనసులో సంచలనం రేకెత్తించటం మొదలుపెట్టాడు.

ఒకనాడతడు గడ్డి కోస్తుండగా కొడవలి మొన వేలికి తగిలి రక్తము కారుతున్నది. చెరువులో చేతులు కడుక్కుందామని దిగాడు. చెరువు గట్టుమీద నుంచి తంబురా మీటుతూ పాటలు పాడుతూ భజనబృందమొకటి నడిచి పోతున్నది.

– ఆ భజనలకు అన్నమయ్యలో ఉత్సాహం పొంగి పొరలింది తంబురా శృతి గజ్జల చప్పుడు ఆ పదాల మాధుర్యాన్ని ఇనుమడింపచేస్తున్నాయి. అన్నమయ్య కొడవలి అక్కడే విసిరి పడేసి, ఆ బృందంలో చేరి నడక సాగించాడు. మరునాటికి అహోబిలం... 

## శ్రీ సాయి వా

దేహం ప్రారబ్ధ ఫలం – గుణం సంచిత ఫలం
దేహభ్రాంతి శవం; ఆత్మభ్రాంతి శివం.
దేహాభిమానాన్ని త్యజించడమే త్యాగం
దైవదండన దయ కొరకే
దైవార్పిత భావమే సర్వసంగ పరిత్యాగం
ద్వైతం దేహలక్షణం; అద్వైతం
ఆత్మలక్షణం
ధర్మం పురుషలక్షణం; ధైర్యం సర్వసాధకం
ధర్మమయం కాని కర్మలన్నీ శోకమయం
ధర్మాచరణ లేనివాడు శిలా స్వరూపుడే
ధ్యానం మనస్సుకోసం; ధాన్యం
దేహం కోసం

ఒక చదువుకున్న దుష్టుడు చేయు హానియే అధికము – (శ్రీ) కందుకూరి

అన్నమయ్య ఆకలితో సోలిపోతూ నడిచి, ఒక చెట్టుక్రింద కూలబడ్డాడు కళ్లు మూసుకుని. ఒక పెద్ద ముత్తయిదువ చేతిలో బుట్ట మంచినీళ్ళు పట్టుకుని వచ్చి అతడి ముఖం మీద చల్లినట్లయ్యింది. కళ్లు తెరవగానే 'నాయనా ! ఆకలవుతున్నదా ?' అంటూ మంచినీళ్లు తాగించి, లడ్డూలు పాయసం అతడి నోటి కందించినట్టు అనుభవమైంది.

“నాయనా ! చెప్పులు విడిచి కొండ ఎక్కు” మని చెప్పి చెట్లచాటుకు వెళ్ళిపోయిందామె.

ఎవరీమె ? వేంకటేశ్వరుని పత్ని పద్మావతీదేవా ? దంపతులిద్దరూ మారువేషాలతో తిరుగుతూ ఉంటారని భజన బృంద మనుకోగా విన్నాడు. ఆ వేషంలో ఆమె వచ్చి తనకు సేదదీర్చినదని నమ్మిన అన్నమయ్యలో అపూర్వమైన స్పందన బయలుదేరింది.

“ఓ లలితాంగి యో కలికి
యో యలజవ్వని యో వధూటి యో
గోలమెరుంగు జూపు కనుగోనల
నో యలివేలు మంగ మ
మ్మేలిన తల్లి నీ విభున కించుక
మా దెస జూపు మంచు నీ
పాలికి చేరి మ్రొక్కెదరు
పద్మభవాదులు వేంకటేశ్వరా !”

అన్నమయ్య కీర్తన విన్న భక్తులు ఆశ్చర్యంతో అలా నిలబడిపోయి “నీవు పాడిన పదం ఎవరు వ్రాశారు బాబూ !” అని అడిగారు.

“అది నా నోట ఆశువుగా పలికింది. ఎవరో వ్రాసింది కాదు” అన్నాడు.

“ఎవరో దివ్యాంశ సంభూతుడు” విస్మయపడుతూ వాళ్ళు వెళ్ళిపోయారు.

అన్నమయ్య మనసులో ఆ పెద్ద ముత్తయిదువ మెదులుతున్నది.

'చల్లని తల్లికిన్
నవరసంబుల వెల్లికిన్
పుష్పవల్లికిన్'

మరొక పదము అన్నమయ్య నోటివెంట వెలువడింది. ఆ తరువాత ఆ తల్లిమీద అనేక పదాలు-పద్యాలు ఆశువుగా చెప్పుకుంటూ పోయాడు.

మధుర భావాలు-నూతన చైతన్యం అతడిని ముంచెత్తుతున్నాయి. ఏడు కొండలు దాటి, గరుడ స్తంభానికి నమస్కరించి, గర్భగుడిలోకి చొచ్చుకుపోతుంటే మళ్ళీ ఆ పెద్ద ముత్తయిదువ చిరునవ్వుతో కంటికి కనిపించినట్లయింది. గర్భగుడిలో ఆ జన సమ్మర్ధంలో స్వామిని చూడగానే భక్తిభావం పొంగి పొరలింది.

“అదివో అల్లదివో శ్రీహరివాసము
పది వేల శేషుల పడగల మయము
అదివో అల్లదివో శ్రీహతివాసము”

స్వామిని చూసిన సంభ్రమంతో ఈ పదము నోటివెంట ఆశువుగా వెలువడింది. అతడు గానంచేస్తూ లోపలికి వెళ్ళాడు. నవరత్నములతో వెలుగులు చిమ్ముతున్న విగ్రహం కళ్ళ ఎదుట కనబడుతున్నది. “అనాధ రక్షకుడు—ఆపద్బాంధవుడు—స్థితి లయ కారకుడు—జగన్నాధుడు-శ్రీనివాసుడు నాకు దర్శనమిచ్చాడు” అనుకుంటూ తన్మయుడైనాడు.

ఆ సందర్భములో ఘనవిష్ణువనే యతి ఆతడి సంకీర్తనం విని, “ఇతడే స్వామి తనకు కలలో కనబడి “ఆ నల్లటి పిల్లవాడిని ఆశ్రమంలో వుంచుకొని, కర్నాటక సంగీతము, సంస్కృతము, వేద విద్య చెప్పించమ”ని ఆనతిచ్చాడు. ఇతడు ఆ పిల్లవాడయి వుంటా”డ ఊహించి తన ఆశ్రమానికి తీసుకువెళ్ళాడు.

“తెలుగు భాషలో భజన సంప్రదాయం, కీర్తనా సంప్రదాయం ప్రత్యేక శాఖలుగా విస్తరించలేదు. కనుక నీవు వాటిలో కృషి చేయమ”ని ఆదేశించాడు. తదాదిగా

కలిసివుంటే నిలబడుతాం, చీలిపోతే కూలిపోతాం - శ్రీ సురేంద్రనాథ బెనర్జి

అన్నమయ్య సంస్కృతం అధ్యయనంచేస్తూ, స్వామిని తలుచుకుంటూ ఆశువుగా కీర్తనలు పాడుతున్నాడు. వేద విద్య నభ్యసిస్తున్నాడు.

" ఈ దేహము-ఈ అవయవాలు-ఈ జఠరాగ్ని ఆహారము మొదలైనవి భూమిమీద ప్రసాదించినది వెంకటేశ్వరుడే కనుక భోజనానికి ముందూ వెనుక సంకీర్తనం చేయటం ఇహ పర కారకమయిన క్రియ. " అని ఘనవిష్ణువనగానే అన్నమయ్య కన్నులు విస్ఫారితములయ్యాయి.

" చాలదా బ్రహ్మమిది సంకీర్తనం మీకు
జాలెల్ల నడగించు సంకీర్తనం
సంతోషకరమైన సంకీర్తనం
సంతాపమణగించు సంకీర్తనం
జంతువుల రక్షించు సంకీర్తనం
సంతతము గాచినది సంకీర్తనం
సామమున కెక్కుడీ సంకీర్తనం
సామీప్యమిందరికి సంకీర్తనం
సామాన్యమా విష్ణు సంకీర్తనం

సమబుద్ధి ఒడమించు సంకీర్తనం "

అన్నమయ్య తన్మయుడై పాడుతున్నాడు. "అతడి నోటిద్వారా అలౌకికమైన పద సాహిత్యాన్ని ఏదో దివ్యశక్తి పలికిస్తున్నది. ఇతడివల్ల ఏదో లోకోద్ధరణ జరగబోతున్నద"ని ఘనవిష్ణువు భావించాడు. వెంటనే శంఖ చక్రాంకితాలతో దీక్షనిచ్చి, పద్వైష్ణవుడిని చేశాడు అన్నమయ్య అన్నమాఛార్యుడయినాడు.

ఒకనాడు ఘనవిష్ణువు అన్నమాచార్యుని ఒక కీర్తన పాడమనగానే సంస్కృతములో శృంగార కీర్తన పాడాడు.

" నీకు అనుభవము లేని విషయాన్ని స్పృశించకు మరొక పదము తెలుగులో చెప్పు " అనగానే -

గురూజీ చెప్పిన కథలు :

# ఈ కీర్తి నాదేననుకోవడం హాస్యాస్పదం

ఒక ఎడారిలో ఒక ఒంటె పోతోంది. దాని ముక్కుకు కట్టిన తాడును రౌతు వదిలిపెట్టాడు. తాడు చివర నేలమీద పడి వుంది. కొంత దూరం పోయే టప్పటికి ఒక ఎలుక ఈ తాడును నోటితో పట్టుకుని ఒంటెతో పాటు పరుగెత్తసాగింది. కొంత దూరం ఆ విధంగా వెళ్ళేటప్పటికి దానికి గర్వం కలిగింది. "ఒంటె చాలా పెద్ద జంతువు, బలమైనది అంటారు అంతా. కాని నేను దాని ముక్కు పట్టుకొని నడిపిస్తున్నాను" అనుకున్నది.

* ఏదైనా మహత్కార్యంలో భాగం పంచుకొన్న వ్యక్తులు తామే ఈ కార్యాన్నంతా చేసామను కొంటే అది మన కథలోని "ఎలుక" స్థితిని జ్ఞప్తి తెస్తుంది.

( కథాకల్పతరువు నుండి )

" కొలనిదోపరికి గొబ్బిళ్ళో - యదు
కుల స్వామికిని గొబ్బిళ్ళో
కొండ గొడుగుగా గోవులు గాచిన
కొండుక శిశువుకు గొబ్బిళ్లో "

అంటూ స కీర్తన చేశాడు. ఇలా కీర్తనలు లెక్కలేకుండా ఆశువుగా చెప్పటం సామాన్యమైపోయింది అన్నమయ్యకు

అన్నమయ్య ఘనవిష్ణువు ఆనతిచ్చినట్లుగా తాళ్ళపాక వెళ్ళి తనను ప్రేమించిన ఆర్యప్రభను - తను ప్రేమించిన తిరుమలాంబను వివాహమాడి తిరిగి తిరుపతికి పయనమయి వచ్చాడు.

అని. టికంటె సత్యం గొప్పది. అంతకంటే గొప్పది సత్యమార్గంలో నడవడం - శ్రీ గురునానక్

A ploughman on his legs is higher than a gentleman on his knees"
— BENJAMIN FRANKLIN

ప్రభువునందు మోకరిల్లు
పెద్దమనిషి కన్న,
హలము పట్టి పొలము దున్ను
హాలికుడె మిన్న

- జంగా గోపాల్

" నేడు జగత్తు దుఃఖములతో పీడితులతో బాధపడు తున్నది. వర్ణ వర్గ ప్రాంతీయ భేదాలతో ఛిన్నాభిన్నమై భారతీయ ఆత్మ లుప్తమైపోయింది. రాజకీయ సమైక్యత -అదొక సమైక్యత కాదు. ప్రజలలో భావ సమైక్యత కావాలి. భావ సమైక్యత జాతిని కలిసికట్టుగా ఉంచుతుంది. నీవు నీ సంకీర్తనలతో జాతిని ఏకం చెయ్యాలి. ఇది వేంకటేశ్వరుని ఆజ్ఞ. జనం వేరు జనార్దనుడు వేరూ కాదు. శాస్త్ర విజయం కంటె ధర్మ విజయం గొప్పది " అని ఘనవిష్ణువు ఆ దంపతులను ఆశీర్వదించి - ప్రబోధించాడు.

వెంటనే అన్నమయ్య -

" కొండలలో నెలకొన్న కోనేటి రాయుడు వాడు
కొండలంత వరముల గుప్పెడు వాడు
కుమ్మర దాసుడైన కురువ నంబి
ఇమ్మన్న వరములెల్ల ఇచ్చిన వాడు
దొమ్ములు సేసినయట్టి తొండమాన్ చక్కురవర్తి
రమ్మన్న చోటికి వచ్చిన వాడు
అచ్చపు వేడుకతోడ ననంతాళ్వారికి
ముచ్చిలా మెట్టకి మన్ను మోచిన వాడు

" అన్నమయ్యా. ఈ పదమే కదా నిన్ను ఇంటికి పంపించేటప్పుడు, గానం చేసి, అందరికీ ఆనందాశ్రువులు కురిపించావు ? అల్లంత దూరంలో నిన్ను తీసుకపోవ టానికి వచ్చిన నీ తల్లిదండ్రులను నాకు పరిచయం చేశావు? నీవు వినవలసినదొక విషయము మిగిలిపోయింది. ఋగ్వేదములో సంకీర్తనా మాహాత్మ్యము బహు గొప్పగా చెప్పబడినది.

" ఈశ్వరునకు చేసే సేవలో సంకీర్తనం చాలా గొప్పదే కాక - ముఖ్యమైనది కూడా. వేంకటేశ్వరుని నామాన్ని కీర్తించటం వలన మనసా - వాచా - కర్మణా పవిత్రుడవటమే కాదు — ఇది ఒక విధమైన ధ్యాన యోగం. కంటి ఎదుట వేంకటేశ్వరుని దివ్యమంగళ విగ్రహ మున్నట్లు భావించుకోవాలి. ఆయన అనుగ్రహ హస్తము నుండి ఆశీర్వాదం మన శరీర మంతటా విద్యు త్తులా ప్రసారమవుతున్నట్లు భావించాలి. భావప్రవాహం ఓజస్సును తేజస్సుగా మారుస్తుంది "

" సంకీర్తనలో భజన విధానము రెండవది.

ధ్యాన విధానము వైయక్తికమైనది. భజన విధానం సామూహికమైనది. భక్తులు బృందాలుగా చేరి మధుర మైన సంకీర్తన చేస్తుంటే మనసు ఈశ్వరునితో తాదాత్మ్యం చెందుతుంది. జీవుడు అన్నమయ, ప్రాణ మయ, విజ్ఞానమయ కోశాలను దాటి, ఆనందమయ కోశంలో సంచరిస్తాడు. ఇది యోగశాస్త్రం. జీవ బ్రహ్మైక తత్వం. సంకీర్తనమే దీనికి సాధనం.

" పరల్వాగి గిర్మణో ఇమాం భవంతు విశ్వతః " అని వేదము చెబుతున్నది. ఈ వేద వాక్యానికి సాకారం అన్నమయ్య. ఈ మంత్రానికి ఆయనే భాష్యం. అన్నమాచార్యుడు ఈ సంకీర్తనా కార్యక్రమాన్ని మొట్ట మొదట ఆంధ్ర ద్రవిడ కర్నాటక సామ్రాజ్యాలలో వ్యాప్తి చేయవలసినదిగా శ్రీనివాసుని ఆజ్ఞ "

( సశేషం )

సర్వేశ్వరునికి తప్ప మరెవ్వరికీ దాసుడవు కావద్దు - శ్రీ అరవిందయోగి

# త్రికరణశుద్ధి —— సాయిప్రియ

" మాటలాడు టొకటి మనసులో నొక్కటి
ఒడలి గుణము వేరె యోజన వేరె
ఎట్లు గలుగు ముక్తి యీలాగు తానుండ
విశ్వదాభిరామ వినురవేమ ! "

అనగా మాట యొకటి, మనసొకటి, గుణమొకటి, యోచన ఇంకొకటిగ నుండువానికి ముక్తిమార్గ మెట్లు దొరుకును ? అని దీని తాత్పర్యము.

నడుస్తున్న చరిత్రలో శాంతి అనేది లేకపోవటానికి కారణం....త్రికరణశుద్ధి లేకపోవటమే. మనసులోని ఆలోచన ఒకటి, చెప్పేదొకటి, చేసేది మరొకటి. కాని ఫలితం మాత్రం మంచిగా రావాలంటే ఎలా వస్తుంది ? మనసులోని సంగతి ఎవరికి తెల్సులే అనుకుంటారు చాలామంది. మానవమాత్రులకు తెలియకపోవచ్చును గాని, సృష్టికర్త అయిన జగద్రక్షకుడికి తెలియకుండా వుండదు గదా !

మనసులో చెడు తలంపులు పెట్టుకొని పైకి మాత్రం చాలా మంచిగా, నేర్పుగా మాట్లాడటం కొందరికి పుట్టుకతో వచ్చిన Art (విద్య). అది నాలుక చివరి మాట. తేనె పూసిన కత్తిలాంటిది పోనీ ఏదో అన్నారు. కనీసం మాటైనా నిలబెట్టుకుంటారా అంటే, చేతలకు వచ్చేసరికి అదీ మారిపోతుంది. అటువంటప్పుడు మనం సత్ఫలితాలను ఎలా పొందగలుగుతాం ? ఎట్టి విత్తో అట్టి మొక్క ; ఎట్టి మొక్కో అట్టి కాయ ; ఎట్టి కాయో అట్టి పండు. వేపమొక్క నాటితే మామిడిపండు కాస్తుందా !

అలాగే తల్లిదండ్రులనుబట్టే పిల్లలు. ఇంటికి వచ్చిన వారితో మనం మాట్లాడే ప్రతి మాటా వారు శ్రద్ధతో ఆలకిస్తారు ఆ తరువాత మనల్ని అనుకరిస్తారు, తదుపరి ఆచరిస్తారు. " ఏ గూటి చిలుక ఆ పలుకు పలుకుతుంది " అని ఒక సామెత కూడా వుంది గదా ! ఇంటికివచ్చిన వారితో చాలా బాగా మాట్లాడి, వారు వెళ్ళిపోగానే వారిని విమర్శించడం ప్రారంభించామనుకోండి. పిల్లలు కూడా చిన్నప్పటినుంచే అలా నటించటం నేర్చుకుంటారు. పసిహృదయాలమీద పెద్దవారి ప్రవర్తన చెరగని ముద్ర వేస్తుంది. భగవాన్ శ్రీసత్యసాయిబాబా




ఒక ప్రసంగంలో " మనం చేసే సేవ ఎవరినీ ఆకర్షించడానికి చేసే Art కాదు. మన సేవ Heart నుండి వచ్చేది. Art is External, Heart is Internal. అప్పుడే Self Satisfaction ( ఆత్మ సంతృప్తి ) వుంటుంది. చెప్పేది చెయ్యాలి, చేసింది చెప్పాలి, చెయ్యందే చెప్పరాదు " అని అంటారు. కనుక మనం మాట్లాడే ప్రతి మాటలో ఆప్యాయత తొణికిసలాడుతూ వుండాలి. మానవత్వం ఉట్టిపడుతూ వుండాలి. హృదయంవిప్పి మాట్లాడాలి. హృదయంతో మాట్లాడాలి. నిర్మొగమాటంగా, మృదువుగా మాట్లాడటం నేర్చుకోవాలి. ప్రేమతో పలుకరించాలి. మనం మాట్లాడే ప్రతి మాట Lips (పెదిమలు) నుండి కాదు. Heart (హృదయం) నుండి రావాలి అందువలననే కాబోలు బాబాగారు ఒక పర్యాయం " హృదయంలేని మాటలకంటే, మాటలులేని హృదయమే

ద్వేషశక్తి కంటె ప్రేమశక్తి కోటి రెట్లు ఘనతరము — శ్రీ రామకృష్ణపరమహంస

# వింతలు – విడ్డూరాలు

* శ్రీలంక పోలీస్ ఆనంద ఉపాలీ 14 రోజుల 17 గంటలపాటు కంటిమీద కునుకు లేకుండా జాగారం చేసి రికార్డు స్థాపించాడు.

* పూర్వం మనదేశంలో ఏ గౌరవనీయ వ్యక్తి పేరు రాయాలన్నా అతని పేరుముందు 108 అంకె రాసే ఆచారముండేది. కాని గుజరాత్‌లో 1632 ప్రాంతం నాటి వాడైన ఓ రాజు 108 అంకె మాత్రం రాయించమనేవాడు కాదు. అయితే ప్రభుత్వానికి సంబంధించిన కాగితాలపై అతని పేరు 108 సార్లు రాసేవారు. అంతేకాదు సభలోని వారెవరైనా రాజును సంబోధించాలంటే రాజు పేరును 108 సార్లు ఉచ్చరించవలసి వుండేది. ఎవరి ఆనందం వారిది కదా!

* సోవియట్ రష్యాలో కొంతమంది వృక్ష శాస్త్రజ్ఞులు సూట్‌కేసులో ఇమిడే ఒక లేబొరేటరీని తయారు చేశారు. దీని సాయంతో వృక్షానికి సంబంధించిన పూర్తి సమాచారాన్ని సేకరించవచ్చునట. చెట్టు తాపక్రమం దానిలోవుండే తేమ, కార్బన్ డయాక్సైడ్ పీల్చే మోతాదు మొదలైనవాటిని కనిపెట్ట వచ్చునట. చెట్లకి పట్టే తెగుళ్ళను నివారించేందుకు ఈ లేబొరేటరీ ఎంతగానో ఉపయోగపడుతుంది. కాబట్టి లేబొరేటరీలు కట్టడానికి అంత పెద్ద కట్టడాలు అక్కరలేదు. సూట్ కేస్ వుంటే చాలు.

* మామూలుగా మనకు మన భాషమీదే సరిఅయిన పట్టు వుండదు. అలాంటిది 270 భాషలు నేర్చుకోవటమంటే మాటలా! జర్మనీకి చెందిన డాక్టర్ హెరాల్డ్ స్కుల్టజ్ ప్రపంచంలోని 270 భాషలను నేర్చుకున్నాడు.

0⁰0

మేలు '' అన్నారు. ఈ మాటలలోని అంతరార్థమును అర్థంచేసుకుంటే మనిషిలో మానసిక పరివర్తన తప్పకుండా వచ్చి తీరుతుంది.

కనుక మన బలహీనతలను పిల్లలముందు ప్రదర్శించ కూడదు. ఇదే ఒక గొప్ప సాధన. ఏ జపము, తపము, ధ్యానము చేయకపోయినా ఫరవాలేదు. మన మాటలకు చేతలకు ఆలోచనలే మూలం. ఆలోచనలకు కేంద్రబిందువు మనసు. దానిని సక్రమమైన మార్గంలో అదుపులో పెట్టుకోవటం కన్నా వేరే తపస్సే లేదు. ఆలోచనలు పవిత్రంగా స్వార్థరహితంగా, పదిమందికీ ప్రయోజనకరంగా విశ్వ శ్రేయో రూపంగా వుంటే; మాటలు చేతలూ వాటి ననుసరిస్తాయి. కనుక మంచిగా, సవ్యంగా ఆలోచించటం నేర్చుకోవాలి. త్రికరణ శుద్ధితో చేసిన పని సత్ఫలితాలనిస్తుంది. భగవాన్ బాబావారు ఒక పర్యాయం 'త్రికరణ శుద్ధి' అంటే చక్కటి నిర్వచనం చేశారు. '' మనసులోని యోచన, మాటలోని సూచన, క్రియలోని ఆచరణ – ఈ మూడూ ఏకం కావాలి. దీనినే త్రికరణ శుద్ధి '' అన్నారు. మనసులోని మంచి ఆలోచన, మాటలోని మంచి పలుకు, క్రియలోని మంచి ఆచరణే మానవుని రమింపజేస్తుందంటూ, రమింపజేసే తత్త్వమే రామతత్త్వమంటారు బాబా.

అలాగే ప్రజలు అభిమానంతో, గౌరవంతో, నమ్మకంతో తమ పవిత్రమైన ఓటును వేసి ఒక వ్యక్తిని ఎన్నుకున్నప్పుడు ఆ వ్యక్తి ఎన్నికల సమయంలో తాను చేసిన వాగ్దానాలను నిలబెట్టుకోవాలి. ప్రజల అవసరాలను గమనించి, గుర్తించి త్రికరణ శుద్ధితో కొన్ని వసతులను, సదుపాయాలను ఏర్పర్చడం ప్రజాప్రతినిధుల కనీస ధర్మం. సామాన్య గృహస్థు మొదలు దేశ నాయకుల వరకు ఈ '' త్రికరణ శుద్ధి '' అనేది అందరిలో వుండవలసిన, ఆచరించవలసిన ప్రధానమైన మూలసూత్రం.

—0⁰0—

కూరత్వం కంటే నిచత్వమే హీనమైనది – డా॥ అంబేద్కర్

# పురుషార్థ ప్రదాయిని' నుంచి "శ్రీవాణి" వరకు

మళ్లీ బందరు నుంచి ఒక సాహిత్య మాస పత్రిక శ్రీవాణి వస్తోంది. పత్రికారంగంలో మరోసారి బందరు తనకున్న విశిష్టస్థానాన్ని నిలబెట్టుకుంటోంది. ఇందుకు మిత్రులు శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావుగారిని మనసారా అభినందిస్తున్నాను.

కిందటి శతాబ్దం మధ్యభాగంలోనే బందరులో మిషనరీ షార్కీ సంస్థ ఒక మాసపత్రిక వెలువరించేది. రాజమండ్రి నుంచి బ్రహ్మశ్రీ కందుకూరి వీరేశలింగంగారు వివేక వర్ధని నడుపుతున్న రోజులలో బందరునుంచి 'పురుషార్థ ప్రదాయిని' అనే మాస పత్రిక వెలువడుతూ వుండేది. ఈ రెండు పత్రికలకు వాదోపవాదాలు చెలరేగుతూ వుండేవి.

## కృష్ణా పత్రిక

1902లో బందరులో కృష్ణా పత్రిక స్థాపనతో-తెలుగు పత్రికారంగంలోనే కొత్తశకం ప్రారంభమయింది. ప్రసిద్ధ దేశభక్తులు శ్రీ కొండా వెంకటప్పయ్యగారి సంపాద కత్వంలో కృష్ణాజిల్లా సంఘం ఆధ్వర్యాన కృష్ణాపత్రిక ప్రారంభమయినా దానికి స్ఫూర్తి కలిగించింది ముట్నూరి కృష్ణారావుగారే. ఆ రోజులలో ఆంధ్రపత్రిక ను న్యూస్ పత్రికగా, కృష్ణాపత్రిక ను వ్యూస్ పత్రికగా పేర్కొనే వారు. ఈ రెండు పత్రికలూ సమకాలీన ప్రజలను ప్రభావితం చేసినంతగా మరే పత్రిక ప్రభావితం చేయ లేదు అనడం అతిశయోక్తి కాదు. అందుకనే ఈ రెండు పత్రికల సంపాదకులైన కాశీనాధుని నాగేశ్వరరావుగారికి, ముట్నూరి కృష్ణారావుగారికి బ్రహ్మాండమైన పౌర సన్మానం విజయవాడలో 1929 సెప్టెంబరులో జరిగింది. కృష్ణా పత్రికను తెలుగు 'మాంచెస్టర్ గార్డియన్' గా పిలిచేవారు.

## ఆంధ్ర భారతి, శారద

శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారు బందరునుంచి ఈ శతాబ్దం తొలి రోజుల్లో ఆంధ్ర భారతి అనే అత్యుత్తమ సాహిత్య మాస పత్రికని నడిపారు. ఈనాటి భారతి సైజులో ఆనాడే 100 పేజీలతో ప్రతి నెలా ఆయన ఉన్నత ప్రమాణాలతో అత్యుత్తమ పద్ధతిలో పత్రికను నిర్వహించడమే కాక ఉత్తరాన్న బరంపురం నుంచి దక్షిణాన్న బళ్లారి వరకు వెళ్ళి తన పత్రికకు రచనలను సేకరించుకొని వచ్చేవారు. శ్రీ గురజాడ అప్పారావుగారి కనువిప్పు కథానిక, నీలగిరి పాటలు ఆ పత్రికలో ప్రచురింపబడ్డాయి.

**రంచి వాసుదేవరావు**

ఆంధ్ర భారతి అంతరించాక శ్రీ కోకా శ్రీరామ శాస్త్రిగారి సంపాదకత్వంలో శారద వెలువడేది. తెలుగు పత్రికలలో ఉత్తమ పత్రికలలో అప్పటికీ ఇప్పటికీ శారదది అద్వితీయస్థానం. శ్రీరామశాస్త్రిగారు బుద్ధ గయను సందర్శించి అక్కడ బోధి వృక్షం దగ్గర నిలబడి నప్పుడు మాడరన్‌రివ్యూ పద్ధతిలో ఉత్తమ సాహిత్య పత్రిక నిర్వహించాలన్న ప్రేరణ కలిగిందని ఆయన రాసుకున్నారు. మహాక వందమంది చందాదారులుంటే తన పత్రిక నిలబడుతుందని ఆయన ఆశపడ్డారు.

ప్రమోద్‌కుమార్ ఛటర్జీ చిత్రించిన శారద ముఖ చిత్రంతో కార్టూనతో, సాహిత్య, వైజ్ఞానిక రాజకీయ వ్యాసాలతో శారద విశిష్టస్థాయిలో నిర్వహింపబడుతూ వుండేది.

ఐతే ఆనాటి సంపాదకులు భావకులూ, ఆదర్శవాదులు మాత్రమే. వారికి వ్యాపార దృక్పథం లేదు. వ్యాపారం

నిస్పృహ చెందక సాధనచేసిన తప్పక భగవత్కృప కలుగును - శ్రీ రమణమహర్షి

# నేత్రరోగం

ఈ లోకం
ఉన్న వాణ్ణి ఉన్నట్లుగానే చూస్తుంది
లేని వాణ్ణి లేనట్లుగానే చూస్తుంది
ఉన్న వాడికి ఎన్ని అప్పులు ఉన్నా
వాడెంత ఊబిలో కూరుకుపోతున్నా
వాణ్ణి ఉన్నవాడుగానే చూస్తుంది
వాడి బ్రతుకుని
సుఖాల అలల మీద తేలిపోయే
పూల పడవలా చూస్తూ ఆనందిస్తుంది.
మరి
లేనివాడు కొత్త చొక్కా వేసుకొన్నా
అది నేరంగానే పరిగణిస్తుంది
వాడు హాయిగా నవ్వితే
'అహంకార' మని హూంకరిస్తుంది
ఈ గాజు కంటి రోగానికి
ఏ వైద్యమూ లేదు
పాలలో కలిసిన విషాన్ని
ఏ హంసా వేరుచేయలేదు
చంద్రుడిలో మచ్చని
ఏ రబ్బరూ చెరిపేయలేదు !

- ఆచార్య తిరుమల

అంతే ఏమిటోనూ తెలియదు. వారికి గల ఆర్థిక వనరులు పరిమితం. అందుకనే ఈ పత్రికలు ఉత్తమ స్థాయికి చెందినవని ప్రశంసలు పొందినా, ఆర్థికంగా నిలదొక్కుకో లేకపోయాయి.

ఈ శతాబ్దం తొలి రోజుల్లోనే బందరు నుంచి చిల్లరిగె శ్రీనివాసరావుగారు నవయుగ అనే పత్రికను నడిపారు. కాని దాని వాద ధోరణుల కారణంగా ఆ పత్రిక కొద్ది రోజులలోనే బ్రిటిష్‌వారి ఆగ్రహానికి గురయి అంతరించిపోయింది.

1935 ప్రాంతంలో బందరు నుంచి నవ్వుల తోట అనే హాస్య పత్రిక వచ్చేది. హరిజనోద్ధారకుడు శ్రీ వేమూరి రాంజీరావుగారు దీనబంధు అనే మాస పత్రికను కొన్నాళ్లు నడిపారు.

## ఆంధ్ర కేసరి

పెనుమర్తి లక్ష్మీపతి శాస్త్రిగారు అనేక సంవత్సరాలు ఆంధ్ర కేసరి అనే వార పత్రికను స్థానిక వార్తలకు ప్రాధాన్యత యిస్తూ - అనేక సంవత్సరాలు - తను జీవించి ఉన్నంతవరకు నడిపారు. ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారు స్వరాజ్య పత్రికను స్థాపించి తన ఆస్తినీ సర్వస్వాన్ని కోల్పోయిన విషయం మనకు తెలుసు. శ్రీ లక్ష్మీపతి శాస్త్రిగారు — స్వాతంత్ర్యోద్యమంలోనూ, పత్రికా నిర్వహణలోనూ తన ఆస్తినంతా ధారపోశారు.

1947-49 ప్రాంతాలలో కథాంజలి అనే కథల మాస పత్రిక ఒకటి వచ్చేది.

## తెలుగు విద్యార్థి

1952 లో కొల్లూరి కోటేశ్వరరావుగారు విద్యార్థిగా వుండగానే రాష్ట్రంలో ప్రప్రథమ విద్యార్థి పత్రిక 'తెలుగు విద్యార్థి'ని స్థాపించి ఈనాటి వరకు సమర్థవంతంగా నిర్వహిస్తున్నారు. అటు ఆర్థికంగా నష్టపడకుండా, ఇటు ఉత్తమ ప్రమాణాలకు భంగం కలుగకుండా "తెలుగు విద్యార్థి"ని విద్యార్థుల, ఉపాధ్యాయుల ఏకైక మాస పత్రికగా నడుపుతున్నారు. పత్రికతోపాటు తనూ, తనతోపాటు పత్రికనూ పెంచుతూ వస్తున్నారు. బందరు నుంచి వెలువడిన పత్రికలలో అత్యంత జయప్రదంగా నిర్వహింపబడిన, నిర్వహింపబడుతున్న పత్రిక తెలుగు విద్యార్థి అనడంలో ఎట్టి అతిశయోక్తి లేదు.

గురుభక్తి దైవభక్తి కన్నా గొప్పది - శ్రీ కంచికామకోటి

1956 నుండి గోవాడ నిరీక్షణరావుగారు భాగ్యనగర్ అనే పత్రికను నడుపుతున్నారు. ముట్నూరి కృష్ణారావుగారే ఆయనకు పెద్దలు పెట్టిన పేరు మార్చివేసి నిరీక్షణరావు అని పేరు పెట్టారుట. హరిజనుల సమస్యా వేదికగా ఆయన ఈ పత్రికను నిర్వహిస్తున్నారు. వృద్ధాప్యం వచ్చినా, ఆర్థిక వ న రు లు లోపించినా పత్రికను నెట్టుకొస్తున్నారు.

1959 లో ఈ రచయిత, బందరునుంచి కృష్ణాపత్రిక బందరునుంచి వెళ్ళిపోయాక, చుక్కాని అనే పక్షపత్రికను కృష్ణాపత్రిక సాంప్రదాయంతో దాని అడుగు జాడలలో నడిపారు. ఈనాటి ప్రసిద్ధ రచయితలలో కొందరి తొలి రచనలు ఈ పత్రికలో ప్రచురించబడ్డాయి. 1967 ఏప్రిలు వరకు అనేక ఇబ్బందులు ఎదురయినా పత్రికను నడిపి, వ్యాపార దృక్పథం, వ్యాపార దక్షతా, నిర్వహణా సామర్థ్యం లేకపోవడంతో దాన్ని శ్రీ కాశీనాధుని సుబ్రహ్మణ్యంగారికి యిచ్చివేశారు. అది యిప్పుడు హైదరాబాద్ నుంచి ప్రచురింపబడ్తోంది.

ప్రసిద్ధ ప్రచురణ కర్తలు యం. శేషాచలం అండ్ కో వారు, తమ ప్రచురణలకు అనుబంధంగా 'పుస్తక ప్రపంచం' అనే మాసపత్రికను నడుపుతున్నారు. వీరే మామిడిపూడి రంగయ్యగారి సంపాదకత్వంలో " ఎడ్యుకేషనల్ ఇండియా" అనే మాసపత్రికను ఉత్తమ విద్యా ప్రమాణాలతో నడిపారు.

శ్రీ పువ్వుల శ్రీకృష్ణ పూర్ణచంద్రరావు 'మార్గదర్శని' అనే పత్రికను నడుపుతున్నారు. వెనుకబడిన వర్గాలవారి పత్రికగా ఇది నిర్వహింపబడ్తోంది. దీన్ని స్థానిక దిన పత్రికగా కూడా నడుపుతున్నట్లు తెలుస్తోంది.

బందరు తెలుగు సాహితీ సంస్థలలో ప్రముఖమైనది స్పందన సాహితీ సమాఖ్య—ఉత్తమ ప్రచురణ కర్తలుగా పేరు తెచ్చుకుంది. వారి సంస్థ ఆధ్వర్యాన్ని "స్పందన వాణి" అనే మాసపత్రికను ఉన్నత ప్రమాణాలతో కొన్ని నెలలు నడుపగలిగారు.

# సంస్కృత నీతి సూక్తులు

1. ఉన్నతో న సహతే తిరస్క్రియామ్
   గొప్పవాడు అవమానాన్ని సహించడు
2. ఉపకార ఫలం మిత్రమపకారోஉరి
   లక్షణమ్

   ఉపకారం చేయడం మిత్రుని లక్షణం. అపకారం చేయడం శత్రువుల లక్షణం.
3. ఉపకారస్య ధర్మత్వేవివాదో
   నాస్తి కస్యచిత్

   ఉపకారం చేయడం ధర్మమనే విషయంలో ఎవరికీ వివాదం లేదు.
4. ఉపదేశో హి మూర్ఖాణాం
   ప్రకోపాయ న శాంతయే

   మూర్ఖునకు చేసే ఉపదేశం కోపాన్నే కలిగిస్తుంది కాని శాంతిని కలిగించదు.

శ్రీ విడియాల చంద్రశేఖరరావు కొంతకాలం బందరు నుంచి పత్రికను నడిపారు. కలువగుంట శ్రీరామచంద్ర మూర్తిగారు తుఫాన్ అనే పత్రికను కొన్నాళ్ళు నడిపారు.

1963 ఆ ప్రాంతంలో క్రైస్తవ మిషనరీలు బందరు ఫ్రెంచిపేటనుంచి సమాజ సువార్త ధ్వని అనే పత్రికను నడిపారు.

తెలుగు పత్రికల్లోనే కాదు-ఇంగ్లీషు పత్రికలలో సైతం బందరుకు గర్వించదగిన చరిత్ర వుంది.

## జన్మభూమి

డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు 1919 ఆ ప్రాంతంలో జన్మభూమి అనే ఇంగ్లీషు పత్రికను

కేవలం ఆవేశంవల్ల ఏమీ చేయజాలం, కార్యరంగంలో ప్రవేశించాలి - శ్రీ దరిశి చెంచయ్య

# ప్రయోజనంకన్నా ప్రమాదం

వినయం లేని విద్యార్థి, విజ్ఞానం లేని విద్య. వివేకం లేని విజ్ఞానం, విచక్షణ లేని కార్యం, విజ్ఞతలేని పాండిత్యం, విశ్వాసంలేని యజమాని, విద్యాబోధన చేయలేని ఉపాధ్యాయుడు, లౌకికం లేని మనిషి, సంతృప్తి లేని సేవకుడు, అర్హతలేని అధికారం, స్వేచ్ఛలేని స్వాతంత్ర్యం, సత్యము లేని వాక్కు, మాధుర్యం లేని సంగీతం, ప్రేమ లేని మనిషి, కృతజ్ఞత లేని సోదరులు, చేసిన మేలును మరచిన మిత్రులు, విశ్వాసఘాతకులైన బంధువులు, క్రమశిక్షణలేని సమాజం, దేశభక్తి లేని రాజకీయాలు, శీలంలేని మనిషి, భక్తి లేని పూజ, సభికులను మెప్పించలేని ఉపన్యాసకుడు, అసమర్థుడైన రాజు, అవినీతిపరుడైన ప్రభువు, గమ్యంలేని ప్రయాణంవల్ల ప్రయోజనం కన్నా ప్రమాదం ఎక్కువ. శ్రమ తప్ప ఫలితం శూన్యం.

నడిపారు. అయనకు చిట్టా సుందరరామయ్యగారు చేదోడు వాదోడుగా వుంటూ వుండేవారు. ఆ పత్రిక గురించి ప్రసిద్ధ పాత్రికేయుడు శ్రీ కుందుర్తి ఈశ్వర దత్తుగారు రాస్తూ—ఆ పత్రిక రెండవ సంచిక నుంచి డా॥ పట్టాభిగారు జైలుకు వెళ్ళి ఆ పత్రికను ఆపేవరకు, అతి శ్రద్ధతో, ఆ పత్రిక ప్రతి సంచికనూ చదివేవాడినని రాశారు.

## త్రివేణి

కోలవెన్ను రామకోటేశ్వరరావుగారి అత్యుత్తమ సాహిత్య పత్రిక "త్రివేణి" గురించి విననివారు ఎవరూ వుండరు అయన తన జీవితాన్ని తన సర్వస్వాన్ని త్రివేణి కే అంకితం చేశారు. అడవి బాపిరాజుగారికి శశికళలా శ్రీ కోటేశ్వరరావుగారికి త్రివేణి ఉపాసనా దేవత—ఎన్నో ఒడిదుడుకులు ఎదురయినా ఉన్నత ప్రమాణాలకు ఎంత మాత్రమూ భంగం కలుగని విధంగా ఎంతో దీక్షతో, సాధనతో నడిపేవారు. అయన జీవించి వుండగానే అంధ్రదేశ ఉత్తమ ప్రచురణ కర్తలయిన త్రివేణీ పబ్లిషర్సు వ్యవస్థాపకులు శ్రీ భావరాజు నరసింహారావుగారు త్రివేణి పత్రిక బాధ్యతను స్వీకరించి నడుపుతున్నారు. రామకోటేశ్వరరావుగారు మరణించిన తర్వాత సంపాదకత్వ బాధ్యతను కూడా స్వీకరించి రామకోటేశ్వరరావుగారు వెలిగించిన జ్యోతి ఆరిపోకుండా కాపాడుకుంటూ వస్తున్నారు శ్రీ నరసింహారావుగారు.

శ్రీ యస్. యస్. కృష్ణాజీ 'భారతరత్న' అనే పత్రికను బందరునుంచి కొన్నాళ్ళు నడిపారు.

ఈనాడు కృష్ణమోహనరావుగారు శ్రీవాణిని ప్రారంభించి-ఉత్తమ ఆశయాలతో ఉదాత్త లక్ష్యాలతో-అంధ్ర భారతి-శారద ఒరవడిలో నడుపుతున్నందుకు వారిని హృదయపూర్వంగా అభినందించవలసిన అవసరం ఎంతయినా వుంది.

శ్రీవాణి సంచికలు చూశాక బందరునుంచి వెలువడిన కొన్ని పత్రికల గురించి 'కన్నంత విన్నంత' రాయాలనిపించింది—నాకు. విన్నంతవరకు, గుర్తున్నంతవరకు చిన్నవయినా, పెద్దవయినా అన్ని పత్రికల గురించి రాశాను-నాకు తెలియని కొన్ని పత్రికలు వుండవచ్చు-కొన్నిటిని నేను మర్చిపోయానేమో ! అట్టి పొరపాట్లు

—0⁰0—

ఆత్మనిగ్రహం విజయానికి తొలి మెట్టు — రాబర్ట్ బర్న్స్

# పాతివ్రత్య మహిమ

"పితామహా ! స్త్రీలు సదాచార సంస్కృతి కలిగివుండటం ఎంతో ముఖ్యమని మీరు శలవిచ్చి ఉన్నారు. సాధ్వీమణులైన స్త్రీల వల్లనే ఈ పృథ్వి యిలా నిలచి వుందని కూడా వివరించారు. స్త్రీలు దుష్టురాండ్రయితే సమాజంలో సాంకర్యం ఏర్పడుతుంది అన్నారు. ఇంతకూ స్త్రీలలో సదాచారం ఉండటం అంటే ఏమిటి ? పతివ్రతల లక్షణం ఎలా ఉంటుంది ? అసలు పాతివ్రత్యం అంటే ఏమిటో కూడా కాస్త వినాలని ఉంది. మీరే చెప్పాలి" అని యుధిష్ఠిరుడు భీష్మ పితామహుని అడుగుతాడు.

అప్పుడు భీష్ముడు "ధర్మనందనా ! ఎంత సున్నితమైన ప్రశ్న వేశావయ్యా ? పాతివ్రత్యం అనే పదం ఉచ్చరించటం కూడా అనాగరికమయిపోయే రోజులు ముందు ముందు ఉన్నాయి కలియుగ ధర్మాలు క్రమంగా ప్రబలుతున్నాయి. సరే ! జిజ్ఞాసతో అడిగావు. ఇదే విషయంలో దేవలోకంలో సంభాషణ ఒకటి జరిగింది. శాండిలీదేవి అనే ఆమెను సుమన అనే స్త్రీ ! అడిగింది. ఇలా" అని చెప్పాడు.

"శాండిలీదేవీ ! నీ తేజస్సు చూస్తుంటే ఏదో మహా తపస్సు చేసి అత్యంత దుష్కరమైన సాధన ఏదో చేసి యీ లోకానికి వచ్చినట్లు కనిపిస్తున్నది. ఏమిటో ! అది? చెప్పు" అని సుమన అడుగగా అప్పుడు శాండిలీదేవి "సుమనాదేవి ! నేను ఏ తపస్సూ చేయలేదు వల్కలా జినములతో కాలం గడుపలేను శిరోముండనం చేయించుకొని కూర్చోలేను, అయితే ఏమిటని అడుగుతావుగదా ! నేను చేసిన పని ఒకటే. నేను నా భర్తతో త్రికరణ శుద్ధిగా కాపురం చేశాను అంతమాత్రమే"

సుమన ఆశ్చర్యచకితురాలయి అలాగే చూస్తూ ఉండి పోయింది. శాండిలీదేవి ఇంకా ఇలా వివరించింది

"ఒక స్త్రీ ఒక పురుషునితో సహజీవనం చేయటం, సహధర్మాన్ని నిర్వహించడం, సహధర్మచారిణిగా వ్యవరించటం – ఇది ఒక వ్రతం. ఆజన్మాంత వ్రతం ఇది"

"పాతివ్రత్యం అనగానే స్త్రీ పురుషునికి "బానిసగా" ఉండటం అనే భ్రమ కలుగవచ్చు. కాని "బానిస" అనే పదమే వాడదల్చుకుంటే స్త్రీ తన జీవితంలో ఒక్క వ్యక్తికే బానిస చిన్నప్పుడు తండ్రికి బానిస తరువాత భర్తకు బానిస. పిమ్మట కుమారునికి బానిస. కాని పురుషుడెందరికి బానిస ? పురుషుడు తండ్రికి బానిస, తల్లికి బానిస, గురువుకి బానిస, యజమానికి బానిస, రాజుకు బానిస, సమాజంలో ఎవరినుండి ఏ పని కావాలన్నా వారందరికీ బానిస. యావత్ప్రపంచానికి బానిస. ఇందరికీ ఒకేసారి బానిస కాని స్త్రీ తన జీవితంలో ఒక్క వ్యక్తికే ఎప్పుడైనా బానిస బానిసత్వం అనే మాటనే వాడాలనుకుంటే చెప్పవలసిన మాట యిది."

"పతివ్రత అయిన స్త్రీ ఏం చేయాలి ?" అని సుమన ప్రశ్నించింది అప్పుడు శాండిలీదేవి "ఏం చేయాలి, ఏం చేయకూడదు – అనే విషయంలో త్రికాలాబాధితమైన, శాశ్వతమైన బాహ్య సూత్రాలు ఏవీ లేవు. దేశ కాల పరిస్థితి నిరపేక్షకంగా ఉండేది మనస్సులోని భావన"

పతివ్రత అయిన స్త్రీ "వానతో సేగిలేదు, పెనిమిటితో పేదరికం లేదు." అనే సిద్ధాంతాన్ని విశ్వసిస్తుంది. స్త్రీకి ఆస్తి పెనిమిటే. భర్తే ఆస్తి అయినప్పుడు, ఆ భర్తకున్న యావత్తు సంపద కూడా ఆమె ఆస్తే. స్త్రీ అర్థాంగి. పురుషుడు సగం, స్త్రీ సగం. ఇరువురూ కలిసి ఒకటి—ఇదే వ్రతం"

కప్పి చెప్పేది కవిత్వం, విప్పి చెప్పేది విమర్శన — డా॥ సి. నారాయణరెడ్డి

## [illegible]ం సంతి

మురవైరి పరమేష్ఠి ముఖ్యులు నీ పదా
　　బ్జములందు మణికిరీటములు మోప
ఇరువైపు లందున సురరాజు దినరాజు
　　మునుముందు గోరాజు మోకరిల్ల
సురకోటి కోటీర పరివేషణమ్ముల
　　శ్రీవారి పద కాంతి చిందులాడ
దిగ్దేశ నాథులు దీర్ఘ పంక్తుల నిల్చి
　　భటుల బెత్తముల దెబ్బలు భరింప
నా యదృష్టమ్ము ఫలియించి నీ యపార
పరమ కారుణ్య దృష్టి నా పైన పడక
ముక్తిదము నైన నీ పదాంబుజము జూచు
భాగ్యమబ్బెగా ! సాయిబాబా మహేశ !

క్షీరాభిషేకమ్ము సేయుచు నీ సుధా
　　రూపమ్ము చూడ ' సారూప్య ముక్తి '
' శివ ! మహాదేవ ! తాండవ కళామూర్తి ! స్వా
　　మీ ! ' అనునంత ' సామీప్య ముక్తి '
నీ భక్త వరులతో నెయ్యమ్ము సాగించు
　　లోపల దేవ ? ' సాలోక్య ముక్తి '
నీ పైన స్వాంతమ్ము నిలిపి నిన్ ధ్యానించు
　　చున్నంత లోన " సాయుజ్య ముక్తి "
నాల్గు ముక్తులు సత్కరుణా సముద్ర !
ఇక్కడే ! ఇప్పుడే ! వేగ మిచ్చినావు
నిన్ను మించి దైవమ్ము నెన్న నెవరు ?
హే విభూతీశ ! సత్యసాయీ ! నమోస్తు !

(సాయీ శివానందలహరి నుండి)

" శాంతిశ్రీ "

**జంధ్యాల వేంకటేశ్వరశా**

సుమన శాండిలీదేవి మాటకు అడ్డువ[illegible] అయితే స్త్రీకి అన్నీ బాధ్యతలే ? హక్కులేవీ లేవా ? " అని ప్రశ్నించింది.

" హక్కులు, బాధ్యతల ప్రసక్తి తెచ్చావు గనుక చెప్పాల్సి వచ్చింది. ఈ వ్రతంలో స్త్రీకి హక్కులే ఎక్కువ. బాధ్యతలు తక్కువ. ఇందులో మర్కట కిశోర, మార్జాల కిశోర న్యాయాలు రెండూ వుంటాయి. ఒక చిన్న అంశం ఉదహరిస్తాను చూడు. పురుషుడు చేసే పుణ్యకార్యాలుంటాయి, పాపకార్యాలుంటాయి. పురుషుడి పుణ్యఫలంలో సగం భార్యది. కాని అతని పాప ఫలం మాత్రం ఆమెకు అంటదు. ఇక్కడ హక్కు వుంది, బాధ్యత పోయింది. ఇక భార్యచేసే సత్కార్యాలుంటాయి. తెలియకనో, ప్రమాదవశాత్తునో చేసిన దుష్కార్యాలు సయితం వుంటే వుండవచ్చు. చెప్పలేము. వాటిలో సత్కార్యాల ఫలితం అంతా భార్యదే. కాని దుష్కార్యాల ఫలితంలో మాత్రం సగం పురుషుడిది. అంటే ఇక్కడ కూడా హక్కులే ఎక్కువ, బాధ్యత తక్కువ. "

ఇది ఎలా సాధ్యం అనిపించవచ్చు. తన జీవితాన్ని ఒక్క వ్యక్తికి ముడిపేయటంవల్ల ఇది సాధ్యపడుతుంది. ఒక్క పురుషుని జీవితంలో తాదాత్మ్యం చెందటవల్ల వస్తుంది. ఈ తాదాత్మ్యతవల్ల స్త్రీ పురుషునికి బహిః ప్రాణంగా వుంటుంది, హృదయస్పందనగా వుంటుంది, మేధస్సుగా వుంటుంది, నీడగా వుంటుంది, వెన్నెముకగా వుంటుంది, మంత్రిగా వుంటుంది, దాసిగా వుంటుంది, సారధిగా వుంటుంది. అర్ధనారీశ్వర స్వరూపంతో కనిపిస్తుంది.

కాబట్టే ధర్మనందనా ! పతివ్రతలయిన స్త్రీలకి అద్భుతమైన శక్తులు లభించినట్లు మనం వింటుంటాం. ఎందువల్లనంటే ఇది అగ్నిపథం, అసిధారావ్రతం, అపరాజేయమయిన వ్రతం.

( భీష్మ యుధిష్ఠిర సంవాదము నుండి )

---

కవులూ, రచయితలూ బ్రతికినంతకాలం చచ్చినట్లు పడుండి

#  అంతరాత్మకు జై 

" ఎవ్వరని యెంతురో నన్ను - ఏ ననంత
శోక భీకర తిమిర లోకైక పతిని —

దిగి రాను దిగి రాను
దివి నుండి భువికి "

— అంటూ ధీమాగా చెప్పగల, చెప్పుకోగల సత్తా, సరుకు ఆ మహానుభావుడు కృష్ణశాస్త్రిగారికే ఉంది ! బ్రతికినంత కాలం అలా " దిగి రాను దిగి రాను మీ స్థాయికి " అన్నట్లుగానే కవితా కన్యను చేపట్టి ఆఖరికి ఈ భువి నుండి దివికి అంత గర్వంగానూ వెళ్ళిపోయాడాయన !

భూతాన్ని
యజ్ఞోపవీతాన్ని,
వైప్లవ్య గీతాన్ని

— అంటూ తన గురించి ప్రపంచానికి ప్రకటించుకొన్న ప్రజా కవి, విప్లవ కవి — శ్రీశ్రీ.

అలా జటిల పదాలతోగాని, యిలా మృదు మధుర వచనాలతో గాని, నా గురించి నేను చెప్పుకోలేను. కాని ఈ " నేను " అనేది ఏమిటి అనే ఆలోచనలో పడి కొట్టుకుంటున్నాను.

" అహం బ్రహ్మాస్మి " — అన్నది ఆర్యోక్తి అంటే నేనే బ్రహ్మను .... నేనే దైవాన్ని ....జీవుడే దేవుడు .... ఇలా ఎన్నన్నా చెప్పుకోవచ్చును .... ఇదొక రకం సిద్ధాంతం !

" నాయనలారా ! .... నేను, నాది అన్న భావాలు అహం భావ సూచకాలు. అహం మీద మమకారం పెరిగితే, అది అహంకారం అవుతుంది. ఆత్మవిశ్వాసం ఉండ వచ్చును. కాని అహంకారం ఉండకూడదు. అహంకారం అంటేనే అహంభావం ! ఆత్మవిశ్వాసం అంటే ఒక కార్యమును నేను కూడ చేయగలను అనే భావన కలగడం అహంభావం అంటే ఆ కార్యమును నేను దప్ప అన్యు లెవ్వరు చేయలేరు అని భావించడం ! కనుక అహం నశిస్తేనే కాని, ఇహంపై మోహం పోయి పరంపై వ్యామోహం కలగదు .... " అంటూ వేదాంతం చెప్తారు కొందరు !

## బాల సోమంచి రామం

అంటే క్షణభంగురమైన జీవిత భోగలాలలసను త్రోసి రాజంటేనే గాని, శాశ్వతమైన మోక్షం అనగా కైవల్యం సిద్ధించదు ! ఇలాంటి భావాలను ప్రజల్లో ప్రచారం చేయడం కొరకే పూర్వం తత్వాలు పాడేవారు.

"ఎన్నాళ్ళుండెద విహ సుఖములలో కొన్నాళ్ళేగదా మనసా!
పోయేనాడు వెంబడి రాదు పూచిక పుల్లైనా ! .... "

- మరి యీ తత్వం ఏనాటిదో అయినా యీ నాటి మన ప్రజానీకం దీన్ని ఒంట బట్టించుకోలేక పదవి చేజిక్కగానే ఆ చేతా యీ చేతా అందినంతమేరకు అన్ని రకాలైన ధన, కనక, వస్తు వాహనాదులను, నానా గడ్డీ కరచి కూడబెట్టి, ప్రజల దృష్టిలో పలచబడ్డా, చాక చక్యంతో చట్టం బారి నుండి తప్పించుకోగల్గుతున్నారు.

" మూన్నాళ్ళ ముచ్చటకే మురిసేవు, ముందు గతి కానవేమిర నరుడా ! ...." అని నెత్తీ నోరూ మొత్తుకుని ఎంత గొంతు చించుకుని పాడితే మాత్రం, అలాటి

చచ్చింతరువాత బ్రతకడ మారంభిస్తారు - శ్రీ మునిమాణిక్యం

## బాలవా

మా వూరు కిల్వాణి
మా కులదైవం శర్వాణి
మా తాత కోదండపాణి
మా నాన్న చక్రపాణి
మా అమ్మ శమంతకమణి
మా బావ మణి
మా అక్కయ్య రమణి
మా అన్నయ్య భరణి
వాడికి తగ్గ భార్యామణి
మా వదిన మంజువాణి
మా ఇంకో అన్నయ్య ఫణి
పతి మాట దాటని శిరోమణి
మా వదిన నాగమణి
మా తమ్ముడు తరణి
వీడి భార్య ఉషారాణి
ఈవిడ మాటల్లో మధురవాణి
మా చెల్లాయి రాణి
ధైర్యంలో ఝాన్సీరాణి
మా చిన్నారి చెల్లి వాణి
ఈ ప్రాణి విద్యావాణి
విద్యలో అదే ప్రథమశ్రేణి
అన్నట్టు నా పేరు కళ్యాణి
మా కందరి కిష్టం శ్రీవాణి
మాకది విజ్ఞానవాణి
మాకు మార్గదర్శిని వైద్యవాణి
మాకు ఆదర్శం మహిళావాణి
మాకు సందర్శనం సాయివాణి
సాయి మాటలే అమృతవాణి
మేం ముందు చదివేది బాలవాణి !

- మానస

అధికార బధిరాంధోన్మత్తుల చెవులకు సోకుతుందా ? ....
అంతా చెవిటివాని ముందు శంఖం ఊదినట్లే !

సరే ! వాళ్ళసంగతలా ఉంచండి ! పెద్దలు ప్రవచించినట్లు ఇహాన్ని వదిలేసి పరాన్ని గురించే పదే పదే స్మరిస్తూ, భజిస్తూ, కాలక్షేపం చేస్తూ కాలాన్ని దొర్లించేయాలనే తాపత్రయం నాకూ ఉంది ! ఏ రామదాసు కీర్తనలో – త్యాగరాయ కృతులో – తంబూరా చేత పుచ్చుకొని అలాపిస్తూ, ఆనంద పారవశ్యంలో మునిగి పోదామనే ఉంది ! కాని ఎలా సాధ్యం ? .... తెల్లారితే పొట్ట గడిచేదెట్లాగ? పెళ్ళాం బిడ్డలను పోషించేదెట్లాగ ?.... క్యూలలో నిలబడి కుస్తీలు పట్టి, దుస్తులన్నీ మలినపర్చుకొని, కాలు సేతులు గాయపర్చుకొని, చౌక డిపోలనుంచి నిత్యావసర వస్తువులను యిల్లు చేర్చేదెట్లాగ ? .... ఇన్ని యమయాతనలు పడి, ఆలు బిడ్డలకు అన్నం పెట్టకపోతే ఆముష్మికం మాటెలా ఉన్నా ఇహంలో మాత్రం యిల్లు నరకప్రాయమై నానా బీభత్సంగాను తయారు కాక తప్పదు ! అందుకే నేను, నాది, నాకు అన్న భావాలను పూర్తిగా కొట్టేయలేక, కొంతలో కొంత అహాన్ని తగ్గించుకొని యీ నాటి పరిస్థితుల్లో ఆత్మతృప్తితో యిలా పాడుకుంటున్నాను.

తళ తళ లాడే భవంతులే నా కక్కర లేదు
తల దాచుకోను చోటుంటే నాకు చాలు !

పిండివంటల విందులే నా కక్కర లేదు
తిండికి తిప్పలు లేకుండుంటే నాకు చాలు !

విలువైన సిల్కు వలువలే నా కక్కర లేదు
మానము నిలిపే మామూలు వస్త్రాలే నాకు చాలు !

పెద్ద పెద్ద బ్యాంకు బ్యాలెన్సులే నా కక్కర లేదు
పద్దులు, బాకీలు లేకుండుంటే నాకు చాలు !

ఆప్త మిత్రుల అధిక సంఖ్యే నా కక్కర లేదు
అవసరానికి అదుకునే వాడొక్కడే నాకు చాలు !

---

దారిద్ర్యం ద్వారంగుండా ప్రవేశించినప్పుడు, ప్రేమ కిటికీగుండా పారిపోతుంది - అబ్రహాం లింకన్

జగతి నుద్ధరించు శక్తే నా కక్కర లేదు
జనుల మోసగింపకుండుటయే నాకు చాలు

గతించినాక ఘన కీర్తులే నా కక్కర లేదు
బ్రతుకులో నపకీర్తి రాకుండుటే నాకు చాలు

పరలోకపు స్వర్గమే నా కక్కర లేదు
ఇహలోకము నరకము కాకుంటే నాకు చాలు

దేవళమందు దేవుడే నా కక్కర లేదు
మనుజులందుండు జీవుడే నాకు చాలు :

పరమాత్మను తెలిసికొన్నవానిని జ్ఞాని అని పిలుస్తారు. అలాంటి మహానుభావుడు జ్ఞాని అయితే, ఆత్మను గూర్చి అంటే తనను గురించి తాను తెలిసికొన్న వాడిని పరమ జ్ఞాని, ఆత్మ జ్ఞాని అని పిలవవచ్చును.

అందుకే పరమాత్మను గురించి పరిశోధించి తెలుసు కున్న ఆరుద్ర "త్వమే వాహం" అలపించారు. ఈ భావాన్నే సినీ కవులైతే ఎంచక్కా అక్షరాల మ్యాజిక్కు చేసి మ్యూజిక్కుతో యిలా ఓ సాంగుని ఏ కొండలోయ ల్లోనో హీరో, హీరోయిన్లను పరుగెత్తిస్తూ పాడించేస్తారు.

నీవే నేను - నేనే నీవు
నీవూ నేను - నేనూ నీవు .... అంటూ

ఆమాటల్నే తిరగేసి బోర్లేసి రకరకాల వాయిద్యాల ఘోషతో తిరగమోత పెట్టేస్తారు.

ఈ విధంగా ఆత్మను గూర్చి తెలుసుకోవడమే ఆత్మ జ్ఞానంబనబడు : ఆత్మజ్ఞానం కలగడం ఎంత అదృష్టమో అంత కష్టం కూడాను : అలాంటి కష్టతరమైన అదృష్టం పైన చెప్పినట్లుగా నాకు యింత లేత వయస్సులో - క్షమించాలి-లేటు వయస్సులో కలిగింది కదాని లోపల్లోపల సంతోషింపసాగాను : "అదిగో : .... అప్పుడే నీలో కొంచెం కొంచెం అహంభావం చోటుచేసుకొంటోంది జాగ్రత : నీ గురించి అసలు నీకు ఏమీ తెలియదు .... నీవంటే ఏమిటో నేను చెప్తాను విను" అంటూ నా ఆత్మను

## సందేశం

చల్లని వెన్నెల సోనల్లారా !
తెల్లని మల్లెల సొగసుల్లారా !
గుడిలో వెలిగే దివ్వెల్లారా !
బడిలో చదివే గువ్వల్లారా !
జాతి పునాదులు మీరే మీరే....!
నీతికి నేతలు మీరే మీరే....!!
సత్యాహింసల సమతను చాటి
నిత్యం శాంతి విపంచిని మీటి
కుల మత భేదం గోడలు కూల్చి
కూరిమి ఓరిమి చాటండి !
ఈర్ష్యా ద్వేషం ఇరులను తుడిచి
మైత్రి భావం విరులను ముడిచి
నింగీ నేలను ఏకం చేసే
ఇంద్ర ధనువులై విరియండి !
భారతదేశం ఒకటే యిల్లని
భారతీయులకు ఒకటే తల్లని
పర మత సహనం చాటండి
ప్రపంచ హృదినే గెలవండి !!

- సి. కామేశ్వరరావు

తలదన్నే అంతరాత్మ అనే ఒకానొక విచిత్ర జీవ పదార్థం యిటీవలి కాలంలో ఈ లౌకిక ప్రపంచంలో ఉదయించి యిలా గొంతెత్తి అరవసాగింది :

నీ వొక ప్రాణివి
ధూపాల సాంబ్రాణివి ॥

సంతృప్తి లేని జీవితానికి శాంతి లేదు. అసంతృప్తి లేని జీవితానికి వృద్ధిలేదు - శ్రీ నార్ల

# కాకి వచ్చిందమ్మ –
# కాకి వచ్చింది

కాకి వచ్చిందమ్మ – కాకి వచ్చింది
కావు కావనుకుంటు – కబురేదొ చెప్ప వచ్చింది.
అ, ఆ, లు బుక్కట్టుకు అన్న వస్తాడొ
లక్క పిడతలు పట్టుకు – అక్క వస్తుందొ
తాయిలం పట్టుకు తాత వస్తాడొ
కొత్త బట్టలు పట్టుకు – అత్త వస్తుందొ
ఎవరెవరు వచ్చేది – ఎగిరి గంతేసి
వే వేగ మరి నాకు – చెప్పుమనవమ్మ.
అ, ఆ, లు బుక్కైతె – పాటలు చెబుతా
లక్కపిడతలు అయితె – ఆడుకోనిస్తా
తాయిలం అయితేను – ముక్క పెడతాను
కొత్త బట్టలు అయితె – ముద్దు ఇస్తాను
మురిపించుకోకుండ – వేగ చెప్పుమనవమ్మ
గంతేసి చెబితేను – గజ్జలు కడతా
కాకి వచ్చిందమ్మ – కాకి వచ్చింది
కావు కావనుకుంటు – కబురేదొ చెప్ప వచ్చింది.

రాయప్రోలు వామనమూర్తి

నీ వొక అల్ప జీవివి
అధునిక పైరవీవి ॥
నీ వొక సాటి మనిషివి
మరిచే మహా మనీషివి ॥
నీ వొక తెలుగు కవివి
వెలుగు జూడని రవివి ॥
నీ వొక మహా మేధావివి
అయినా కాదు చిరంజీవివి ॥

# జేబులో ప్రపంచం

అమెరికాలో శాస్త్రజ్ఞులు జేబులో పెట్టుకోవడానికి వీలైనంత చిన్న టి.వి. ని తయారుచేశారు ఇది 4 అం. పొడవు, 2 అం. వెడల్పు, 1 1/2 అం. మందం కలిగివుంటుంది. టి. వి. పెట్టె అంత చిన్నదే అయినా ప్రపంచ వ్యాపితంగా అన్ని స్టేషన్ల కార్యక్రమాలు స్పష్టంగా ఈ సెట్‌లో కనిపిస్తాయి, వినిపిస్తాయి.

అధునికశాస్త్ర విజ్ఞానంలో ఇంకా ఒకడుగు ముందే వున్నామని నిరూపించారు జపానువారు. ఆ దేశంలో ఒక గడియారాల కంపెనీ చేతి గడియారంలో టెలివిజన్‌ను అమర్చారు. *

ఓ నాడు సిసలైన హాలికుడివి
ఈ నాడు అసలైన అల్కహాలికుడివి ॥
నీ వొక ప్రజానాయకుడివి
సర్వం మింగే స్వాహాగాడివి ॥
ఇలా యిలా యెన్నో యెన్నో
ఇలా తలంలో యెన్నెన్నో
నామ భేదాలు
నీదు రూపాలు ॥

— అయ్యా! అదీ సంగతి! ఆత్మజ్ఞానం అయిందను కుంటుంటే అంతరాత్మ సాక్షాత్కారం జరిగింది. ఈ ఆత్మ అంతరాత్మల సంవాదంలో ఎవరు గెలుస్తారో! ఎన్నన్నా చెప్పండి! మన ప్రజాధినేతలే మనకు మార్గదర్శకులు కదా! వారి ఉపదేశ ప్రకారం నా ఓటు అంతరాత్మకే! అందుకే అంతరాత్మకు జై.

—0—

బంగారం కాదు, మనుష్యులు మాత్రమే జాతిని

# మల్లన కవి శివభక్తి మాధుర్యము

అష్ట దిగ్గజ కవులలో నొకడుగ విశిష్ట యశో విరాజితమూర్తియై రసహృదయులను ప్రతుష్ట మనస్కులను జేసిన కవిచంద్రుడు మాదయగారి మల్లన. " రాజశేఖర చరిత్ర " కృతికర్తగా జగద్విదితుడు, ఏతత్కావ్య పాత్ర - హేమధన్వ నృపతి ద్వారమున తన శివభక్తి పారమ్యను ఎంతో మధురముగ, నిష్కర్షముగ ఆవిష్కరించినాడు. అతని శివభక్తి తత్పరత అపూర్వమైనది. శివభక్తి మరులీతనికపారము. శంకర పాదసేవనవ శంకర మానస పారిజాతుడు మల్లన కవి.

" రాజశేఖర చరిత్ర " ప్రబంధము ముచ్చటగ మూడాశ్వాసములు కలిగి, మూడు కన్నులతో శోభిల్లు ముక్కంటి ప్రతిరూపమా ! అనిపించును. శివ పాద పద్మ యుగమున చంచరీక మనస్కుడయిన మల్లన యీ శివ దృష్టి భావము తోడనే మూడాశ్వాస యుతముగ " రాజశేఖర చరిత్ర " ను దిద్ది తీర్చి యుండును. ఇందడుగడుగునను మల్లన శివభక్తి తాదాత్మ్యము గోచరించుచుండును.

మల్లన తన కృతిని తిమ్మరుసుకు మేనల్లుడు, అల్లుడునయిన ' నాదెండ్ల అప్పమంత్రి ' కి అంకితమిచ్చినాడు. కృతిభర్త కృతికర్త నాదరించిన తీరులో మల్లన శివ హృదయ మిటుల కానవగును.

ఉ॥ శంకర పాదసేవనవశంకర మానస పారిజాత ! వి
శ్శంక వచో విలాస రుచిసార వినిర్జిత పూర్ణపూర్ణిమా
శాంక ! దురక్షరానన భయంకర !
శౌనక గోత్ర ! పాత్రి య
య్యంకి పురాగ్రహార విభవాకర !
మాదయ మల్ల సత్కవీ ! 1_13

ఇచట శంకర పాదసేవకు దశ మొనర్చిన మానసమైన పారిజాతము కలవాడనుటతో మల్లన ఈశ్వరార్చన కళాశీలత్వము సుస్పష్టమగుచున్నది.

హేమధన్వుడను రాజు పుత్రకాముడై తన భార్యతో పలికిన తీరు శివభక్తి తత్పరతకు శిఖరాయమాణము. ఇట మల్లన అంతరంగము సూటిగ స్పష్టమగును.

---

## శనగవరపు రవిశంకర హృషీకేశశర్మ

---

గీ॥ తోయజానన ! యొక బుద్ధి తోచె నాకు
నాదికారణ మీశ్వరుండఖిలమునకు
గాన నద్దేవదేవుని కరుణ లేక
యీప్సితార్థంబు లేరికి నేల కలుగు ? 1_64

సమస్తమునకు ఆదికారణము శివుడే యనుచు ఆ మహాదేవుని కారుణ్యము లేక యెవరికిని యే కోరికలును సిద్ధింపవనుట మల్లన స్వీయ భావమే. పిదప చూడుడు.

గీ॥ నీలకంఠుని శిరసుపై నీళ్ళు చల్లి
పత్తిరిసుమంత నెవ్వడు పాఱవైచు
కామధేనువు వానింటి గాడి పసర
మల్ల సురశాఖి వానింటి మల్లెచెట్టు 1_65

శివుని శిరముపై గంగ పోసి కొంచెము నెవ్వండుంచునో వాని యింట కామధేనువు ఇంటి గోవువలె తిరుగుననియు, కల్పవృక్షమా యింటి మల్లెచెట్టు వంటి దగునమటలో పరమశివుని అపార భక్త వాత్సల్యము ప్రదర్శింపబడినది. ఇట అభిషేకించుటను " శిరసుపై నీళ్ళు చల్లి " యనియును, శివప్రీతికరమైన బిల్వపత్రము (మారేడు) నర్పించుటను " ఇసుమంత పత్తిరి పైచుట " యనియును మిక్కిలి సొగసుగ వ్యావహారికమునకు

గొప్పదిగాను, శక్తివంతంగాను చేయగలరు - ఎమర్సన్

దగ్గరగ తాదాత్మ్యముతో చెప్పటం మల్లనకే చెల్లును. మఱియొకటి యరయుడు.

సీ॥ నవరత్నమయ భూషణములు దాల్చిన వారు
సింహాసనస్థులై చెలగు వారు
పరతత్త్వ వాసనా పరత గాంచిన వారు
నిఖిల విద్యాప్రౌఢి నెరయు వారు
చిరకాల జీవులై క్షేమమందెడు వారు
వితరణ విఖ్యాతి వెలయు వారు
బంధు మిత్ర స్ఫూర్తి బాయకుండెడు వారు
బహు పుత్ర లాభంబు బడయు వారు
గీ॥ చక్కదనమున వన్నెకు నెక్కు వారు
తొంటి భవముల సద్భక్తి తొంగలింప
కాశికానాథు కామారి కాలకంఠు
పూజ చేసిన వారెపో పువ్వుబోడి. 1—66

ఈ రీతిగ సకలేప్సితార్థ కృతార్థులు పూర్వజన్మలలో శివభక్తి తత్పరులే యనుటలో మల్లన శివైకాయత్త చిత్తత గమనింపదగినది. ఇట ద్వితీయ పాదమున పరతత్త్వవాసనాపరత, నిఖిల విద్యా ప్రౌఢి నెఱయుటలు చెప్పబడినవి. ఇది జ్ఞానమునకు ప్రతీకలు. జ్ఞాన సంసిద్ధిని కలిగింపజాలినవాడు మహేశ్వరుడే. అందులకు ప్రమాణము 'జ్ఞానం మహేశ్వరాదిచ్ఛేత్' యనునది. ఇదియే పైన సొగసుగ గర్భీకరింపబడినది.

ఇక సకలమునకును మార్గదర్శకము 'శంభుసేవ'యే యని నిష్కర్షముగ చెప్పుటలో మల్లన నిశ్చింతత్త్వము గోచరించును. "శంభురీశః పశుపతిః...." ఇత్యాదిగ అమరము. చూడుడు.

సీ॥ కడ లేని సంసార జడధిలో మునిగిన
జనుల పాలిట నావ 'శంభుసేవ'
కడుదూరమైయున్న కైవల్య సీమకు
జక్కని పెనుత్రోవ 'శంభుసేవ'
యతి భోగ భాగ్యంబులను ముత్తియంబుల
సరులగూర్చిన కోవ 'శంభుసేవ'
సకలాగమ జ్ఞానసార మహీజాత
జాతంబులో చేవ 'శంభుసేవ'
గీ॥ నిరవధిక్రూర పాతక దురవగాహ
గహన దహన సమున్నిద్ర గంధవాహ
సఖ శిఖామాలికల తేవ "శంభుసేవ"
సద్గుణముల లతాంతముల తీవ "శంభుసేవ". 1—67

సంసార సాగర తరణమునకు జనులపాలిట నావ, దూరాతి దూరమున నున్న మోక్ష పదమునకు చక్కని పెనుత్రోవ, యతి భోగ భాగ్యములను ముత్యముల సరులు కూర్చిన కోవ, సమస్త వేద జ్ఞాన సారయుతమైన వృక్ష సముదాయములోని చేవ, పాప సమూహములను కాల్చు అగ్నిజ్వాలల తేవ, సద్గుణ పుష్పములతో శోభిల్లు తీవ....శంభుసేవ అనుటలోని శివభక్తి మాధుర్యము అనుభవైక వేద్యము. తదుపరి—

క॥ కావున మనమద్దేవుని
భావంబున నిలిపి సుతుని బడయుద మనుచున్
దేవియును దాను భూపతి
కేవలతర శైవ మార్గ కృత నిశ్చయుడై. 1—68.

ఆ రాజు ఇట్లు భావించి "కేవల తర శైవ మార్గ కృత నిశ్చయుడై"నాడట. ఈ పాదమున మల్లన శివైకార్పిత మానస కృత నిశ్చయము నిర్దిష్టమైయున్నది. పిమ్మట—

క॥ హాటక శైలధనుర్ధరు
బాటింపనివాడు నాకు బగవాడనుచున్
గూట పరిపంథిగర్వో
చ్చాటన గుణశాలి యతడు చాటంబంచెన్. 1—69

శివభక్తుడు కానివాడు తన పగవాడనుట చూడ "ఘంటాకర్ణుని భక్తి" జ్ఞప్తికి వచ్చును. పిదప—

విద్య నేర్పుటకు జీవిత మర్పించువాడు చనిపోడు - మహమ్మద్ ప్రవక్త

ఉ॥ ఎచ్చట జూచినం బ్రమథ హిండిత చండ
నిశాట వర్తనం
బెచ్చట జూచినన్ గుహగణేశ్వర
భవ్యగుణానువాదనం
బెచ్చట జూచినన్ శివసమీహిత
పుణ్యకథాను కీర్తనం
బచ్చు పడంగజేసె నతడాదిమ
శైవకులాగ్రగణ్యుడై. 1-70.

ఆ విధముగ నెచ్చట జూచినను శివపారమ్యమునచ్చుపడ జేసినాడట ఆ హేమధన్వుడు.

ఒక చక్కని విచిత్ర కల్పనముతో మల్లన శివ హృదయ మవలోకింపుడు.

శా॥ చూడం జిత్రము పత్ర పుష్పముల కంచుంజేర
నేతెంచి పెన్
బ్రోదల్ శైవకథా రహస్యములకై
పోరాడుచుం బోవుచో
గూడద్వచ్ఛితదీయ వాదముల
చిక్కుల్దీర్చుబో పట్టణ
క్రీడాకానన వీధికాగ్రశుక శారీ
కిన్నర ద్వంద్వముల్. 1-71.

పత్ర పుష్పాదులకై వచ్చిన పండిత ప్రకాండులు శైవకథా రహస్యములను గూర్చి వాదులాడుకొనుచుండగ నచటి విహార వనములలోని చిలుకలు, గోరువంకలు, కిన్నరీ పక్షులు వచ్చి వారి వారి వాదములలోని చిక్కులు తీర్చి పోవునట. అచటి పులుగులు నయితము శివాగమ కళా మర్మజ్ఞులమట మల్లన శివభక్తి తత్పరతకు జక్కని తారకాణము.

శా॥ కించిన్మర్దళ నృత్యగీత సరసక్రీడా విధంబుల్,
శుకీ
చంచూచంచదనూనరత్న ఖచిత స్తంభంబు
లభ్రంక షో
దంచద్గోపుర పంక్తులున్మెఱయ మద్వద్భక్తి
నూరూర గ
ట్టించెన్ భూపతి దేవతానిలయ కోటిన్
జాహ్నవీ జూటికిన్. 1-72.

ఆ భూపతి యద్యద్భక్తితో నూరూర పరమశివునికి దేవళములను కట్టించినాడుట. ఇందలి యద్యద్భక్తి మల్లనదే యనుట నిర్వివాదము.

పిదప రాజు చంద్రధరుని కొల్చిన విధము నిస్సంశయ ముగ మల్లనదే. కాంచుడు.

సీ॥ చంద్రకాంతోపల స్వచ్ఛవేదీస్థలుల్
కట్టి జవ్వాది చే గల యనలికి
యనువుగా క్రొత్త కట్టాణి ముత్తియముల
నిగ్గులు పెదచల్ల ముగ్గుపెట్టి
యచ్ఛోదకంబుల నభిషేక మొనరించి
రమణీయ రత్న పీఠమున నునిచి
మృగ మదపంకంబు మేననింద నలంది
మేలేర్చి క్రొవ్విరుల్ గీలుకొలిపి

గీ॥ ధూపమర్పించి కర్పూర దీపమొసగి
యమృత దివ్యాన్నరుచిరోప హారమిచ్చి
వనితయును దాను సాష్టాంగ వినతిజేసి
చంద్రధరు గొల్చు నా రాజచంద్రు డెపుడు. 1-73.

శా॥ రాజచ్చంద్ర శిలాంతర లతారమ్య
ప్రదేశంబులన్
గాజుంగుప్పెలలోని యచ్ఛతరగంగా
వారి నోలార్చి యా
రాజున్ దేవియు మంత్రపూతముగ
హేరాళంపుప్ల గుత్తులన్
బూజల్ సేయు దురిచ్ఛలం జెలగి
ముప్పూటం బురారాతికిన్. 1-74.

మూడు పూటల పురారాతి యయిన శివుని గంగతో నభిషేకించి పూలతో నర్చించుటాదితము మల్లన యర్చనా ఫణితియే యైయుండును. తరువాత-

ప్రజాస్వామ్యంలో ప్రజలు కోరేది స్వాతంత్ర్యం లేని క్రమశిక్షణ కాదు - ఆచార్య కృపలాని

క॥ సంతాన కాంక్ష నాశ్రిత
చింతామణి సకలలోక సేవితు గరుణా
స్వాంతుని రాజత శైల ని
శాంతుని భజియింతురెపుడు సతియు బతియున్ 1-75

ఇందలి శివ విశేషణములు ఆశ్రిత చింతామణి, సకల లోక సేవితుడు, కరుణాస్వాంతుడు, రజతాద్రివాసుడు, అనునవి చూచిన మల్లన శివార్పిత హృదయము తెల్లమగును.

ఒక చక్కని చమత్కారము వీక్షింపుడు. శివుడు ఆ రాజు హృదయ మాధుర్యము మరిగి స్థిరనివాసుడై తన వెండి కొండకు వెళ్ళుట కూడ మానుకొని మిక్కిలి బద్ధకస్తుడైనాడట.

క॥ ఆ మానవపతి చిత్తా
రామములో నుండ మరిగి రాజత భూభృ
త్సీమకు యి పోదలంపక
సోమకళాధరుడు మిగుల సోమరి యయ్యెన్ 1-76

ఈ నిందాస్తుతి బహు రమ్యము, రస భాసితమును. అట్లు శివుని మానసవీధిని బంధించినవాడు నిజముగను మల్లనయే.

స్వప్నమున పరమేశ్వరుని గాంచిన హేమధన్వుని భక్తి పారవశ్యమిది.

చ॥ కల గని యమ్మహీవిభుడు గ్రక్కున లేచి
నిజంబుగా మదిన్
దలపుచు మేను గర్పొడవ నగ్గడలుం బరికించి
యో కృపా
జలనిధి ! యో మునీంద్రవరసంస్తుత !
యో జగదేకనాథ ! నిన్
గల గనుగొంటి తొంటి కలి కల్మషజాలము
వీడుకొంటినే 1-78

కృపాజలనిధి, మునీంద్ర వరసంస్తుత, జగదేకనాథ అనుటలో శివుని జగత్కర్తృత్వాదికమున మల్లన స్థిర నిశ్చయము పొడగట్టును. మఱియు నిన్ను కలలో కనుగొంటిని. నా పూర్వ జన్మ కలి కల్మషములను వీడితినని రాజుచే పలికించుటలో శివభక్తి వైశిష్ట్యము చూపబడినది.

ఈ స్వప్న వృత్తాంతమును భార్యతో రాజు చెప్పిన తీరున దోచు శివభక్తి భావమనుపమానము.

ఉ॥ పాలిక మేలుకొల్పి నరపాల శిఖామణి వింటివే వినీ
లాలక ! నిన్న రేయి యొక యచ్చెరు
వాశ్రితపారిజాత మ
బ్బాల శశాంకమౌళి, మనపాలిటి
కొంగు పసిండి మంచమం
దాలస లీల వచ్చె దరహాస విభాసి
ముఖారవిందుడై 1-80

ఆ బాల శశాంకమౌళి ఆశ్రితపారిజాతమనుటయే కాక మన పాలిటి (భక్తులపాలిటి) కొంగు పసిండి యనుటలోని శివభక్తి మాధుర్యము రమణీయమైనదియే.

పిమ్మట రాజు శివుడిచ్చిన ఫలమును భార్యకీయగా నామె దానిని "శివార్పణము" చేసి యాస్వాదించుటలోని శివదృష్టి చూచిన ఆమె " శివలక్ష్మి " యే అనిపింపక మానదు.

ఉ॥ ఇచ్చిన మ్రొక్కి పుచ్చుకొని
యింపును సొంపును బల్లవింపగా
నచ్చపలాయతేక్షణ ' శివార్పణమం ' చు
సుధారసంబుతో
మచ్చరికింపజాలు రుచి మత్ఫల మాచట
నారగించి, వా
క్రుచ్చగరాని మోదమునకు న్నెలవై పెను
పొందెనంతటన్ 1-83

సర్వ భూతములయందు దయ గలవాడు దేవుని కృపకు పాత్రుడు - ఏసుక్రీస్తు

మల్లన యమునానదీ గత శిలలను సైతము—

మ॥ జటిసంఘాత సమీప సంఘటిత
రజ్యద్వాలుకా లింగ సం
స్ఫుటముల్ .... (3-32) అని భావించిన అద్వితీయ శివభక్తాగ్రగణ్యుడు.

అటులనే కాంతిమతీ రాజశేఖరుల వివాహసందర్భముగ

శా॥ డాకేలన్నిజ కన్యకామణులు కంఠశ్రేణి
గీలించి, వీ
ణాకంజాతము లాత్మపాద సభరేఖందార్చి,
సంగీత వి
ద్యా కౌశల్యము గానరా మదికి
నాహ్లాదంబు సంధిల్ల, గౌ
రీ కళ్యాణము పాడిరప్పుడు పురంధ్రీరత్నముల్
వేడుకన్ 3-167

అనుచు పురంధ్రీరత్నములచే "గౌరీ కళ్యాణము" ను పాడించినాడు.

ఈ రీతిగ "రాజశేఖర చరిత్ర" కావ్యమంతయు రాజశేఖరస్తుతి విశేషాదులతో నలరించుచు మల్లన శివభక్తి మాధుర్యమును జూపుచు "ధూర్జటి" ని స్ఫురింప జేయును.

—0○0—

# అన్నదాన మహిమ

చోళదేశంలో శంబరుడు అనే బీద బ్రాహ్మణుడొక డుండెడివాడు. రోజూ నాలుగు గ్రామములలో భిక్షాటనము చేసి అన్నదానం చేస్తుండెడివాడు. బీదలకు పెట్టగా మిగిలినది తను తన భార్య, కుమారుడు తినెడివారు. మిగలని రోజున మంచినీళ్ళు త్రాగి దైవనామస్మరణతో నిత్యం తన జీవితమును గడుపుచుండెడివాడు.

ఒకరోజు రాత్రి వృద్ధుడు ఒకడు చాల ఆకలితో వచ్చి అన్నదాన మివ్వమని ప్రాధేయపడ్డాడు బ్రాహ్మణుడు తనవద్ద నున్న కొద్దిపాటి అన్నం పెట్టెను, గాని, ఇంకా ఆకలిగా ఉన్నదని శంబరుని అడిగాడు తనకున్న గోవుపాలను తీసి ఆకలిని తీర్చుకొనమని యిచ్చినాడు.

ఊహించని పరిస్థితులలో అప్పటికి సింహమొకటి వచ్చి ఆవును చంపి తినుటకు సిద్ధపడెను. అది చూచి శంబరుడు నమస్కరించి, "సింహరాజా ! నా గోవును చంపవలదు. నన్ను, నా భార్యను, నా పుత్రుని చంపి నీ ఆకలిని తీర్చుకొనమ"ని ప్రాధేయపడినాడు.

అంత, శ్రీ మహావిష్ణువు వారి ముగ్గురకు ప్రత్యక్షమై శంబరునితో, "నిన్ను పరీక్షించుటకై సింహరూపములో వచ్చితిని. నీ భక్తికి మెచ్చితిని. నీకు కావలసిన వరం కోరుకో" అనెను.

"మహాప్రభో ! నీ దర్శనమునకై ఇంతకాలము వేచి యుంటిని. కృతార్థుడనైతిని, నేను ఎన్ని జన్మము లెత్తినను దానగుణం గలవాడనై, నీ నామస్మరణలో లీనమై నీ పాదసేవనే చేయు వరమును ప్రసాదింపుమని" సాష్టాంగ నమస్కారము చేసెను.

శ్రీ విష్ణువు "తథాస్తు" అని చెప్పి అంతర్థానమైనాడు, శంబరుడే శివిచక్రవర్తిగా జన్మయెత్తి ఏకఛత్రాధిపతిగా ధర్మపరిపాలన గావించినాడు.

"అన్ని దానములలో అన్నదానమే గొప్ప"

సేకరణ : **తాటికొండ తిరుపతయ్య**

మీ సమాధానములు గరుత్మంతునివలె వేగముగాను సూదిమొనంత పదునుగా వుండాలి- డా॥ పట్టాభి

# కన్యాశుల్కము - నార్ల వారి కుదింపు

**డాక్టర్ మన్నవ సత్యనారాయణ**

ఆంధ్ర నాటక సాహిత్యంలో గురజాడ అప్పారావు గారి "కన్యాశుల్కము" ఒక విశిష్ట స్థానాన్ని ఏర్పరచుకుంది. ఈ నాటకాన్ని చదువునప్పుడు అప్పారావుగారు ఎంతోమంది వ్యక్తులని వారి మనస్తత్వాలను, ఎంత సునిశితంగా పరిశీలించి నాటకాన్ని వ్రాశారన్నది విస్పష్టము. అందుకు కారణము ఈనాటకములోని భిన్న మనః ప్రవృత్తులుగల పాత్రలేనని చెప్పవచ్చు. కన్యాశుల్క దురాచార నిర్మూలనమే, ఈ నాటకంలో ప్రధాన విషయమైనప్పటికీ వ్యభిచారము, జూదము, తాగుడు ఇత్యాది సాంఘిక దురలవాట్లు అనేకము ఆ యా సందర్భములలో చక్కగా ప్రతిపాదింపబడినవి. అందుచేతనే ఈ నాటకం పలువురి పండిత పామర ప్రశంసలకు పాత్రమవుటంతోపాటు రష్యన్ వంటి పాశ్చాత్య భాషలలోనికి అనువదింపబడినది.

ఇటీవలి కాలంలో అప్పారావుగారి 'కన్యాశుల్కం' ను నార్ల వెంకటేశ్వరరావుగారు కేంద్ర సాహిత్య అకాడమీ పక్షాన కుదించడం జరిగింది. అలా కుదించడం ఎంత సమంజసమో, ఎంత సబబో పరిశీలించటమే ఈ వ్యాసం యొక్క ముఖ్యోద్దేశ్యం, అప్పారావుగారి కన్యాశుల్కంలో ఏడు అంకాలుంటే వెంకటేశ్వరరావుగారు వానివి ఐదుకు కుదించారు. రంగాల సంఖ్య కూడా ఇదే విధంగా కుదించారు.

ఎంతో ప్రఖ్యాతి నార్జించుకొన్న ఒక రచయిత రచనను కుదించటమంటే ఆ రచయితకు తీర్చని అన్యాయం చేయడమే అవుతుంది. ఈ కుదింపు వలన అప్పారావు గారికి తీరని అన్యాయం జరగడమే గాక ఆయన ప్రతిపాదించిన విషయము కూడా దెబ్బతిన్నది. ఈ కుదింపు కేంద్ర సాహిత్య అకాడమీ పక్షాన జరగడం ఎంతైనా శోచనీయం. ఒక రచయిత యొక్క గ్రంథాన్ని కుదించే హక్కు మరొకరికి లేదు. ప్రదర్శనా సౌలభ్యం కోసం ప్రదర్శకులు తమకున్న సౌకర్యాలను బట్టి నాటకములోని ఆయా భాగాలను విడిచి చదువుకొనవచ్చు. "లోకో భిన్న రుచిః" పాఠకులందరి అభిరుచి ఒకే విధంగా ఉండదు. ఇలాంటప్పుడు వెంకటేశ్వరరావుగారి కుదింపు మాత్రం పాఠకులను తృప్తి పరచగలదని ఎలా చెప్పడం? వెంకటేశ్వరరావుగారు, తమ కుదింపు పీఠికలో పేర్కొన్నట్లు "పూటకూళ్ళమ్మ, ఆమె చీపురుకట్ట నాటకానికి ప్రాణం వంటిదని ఒకరంటే, బైరాగి, హెడ్ కానిస్టేబుల్, సిసిరిగాడు మున్నగు పాత్రలు ఎంతో సజీవమైనవని పేర్కొనవచ్చును". ఇలాంటప్పుడు నాటకాన్ని కుదించి ప్రకటించటం ద్వార పాఠకులందర్ని తృప్తి పరచడం సాధ్యమా.

నార్లవారు తమ కుదింపు పీఠికలో "కన్యాశుల్కం రచనకు శ్రీ గురజాడ ఉద్యమించింది కన్యాశుల్కం దురాచార ఖండన కోసం. కాని ఆ లక్ష్యం నాటకానికి ఆయన వ్రాసిన ఇంగ్లీషు పీఠికను దాటి ఏమంత దూరం వెళ్ళలేదు" అనే అభిప్రాయాన్ని ప్రకటించారు. ఇలా అభిప్రాయపడటం అంత సమంజసం కాదేమో; అప్పారావుగారు తమ నాటకంలో కన్యాశుల్కంతో పాటు తాగుడు. వ్యభిచారం, జూదం ఇత్యాది సాంఘిక దురలవాట్లను, బైరాగుల పేరుతో ప్రజలను మోసగించడం, భూతాదులపై ప్రజలకు గల మూఢ విశ్వాసాలను ఎన్నింటినో తొలగించడానికి ప్రయత్నించారు. కేవలం ఒక్క

భగవంతుడు కష్టపడేవానికే ఆశీస్సులు ఇస్తాడు - కాళిదాస కవి

కన్యాశుల్కంనే ప్రధాన విషయంగా గ్రహించి నాటకము వ్రాస్తే ఇంతగా ప్రజాభిమానాన్ని పొందేది కాదేమో !

నార్ల వారు తమ కుదింపుద్వారా గిరీశం పాత్రను ఉదాత్తమైనదిగా తీర్చి దిద్దటానికి ప్రయత్నించి విఫలులైనారని చెప్పవచ్చు. వీరు తమ పీఠికలో " గిరీశం వెంట వెళ్ళిపోయిన బుచ్చమ్మ ఏమైనట్లు అనే ప్రశ్నను నా కుదింపు మిగల్చవచ్చు ఇందుకు నా సమాధానం :– ఆమెను గిరీశం పెళ్ళిచేసికొని చక్కగా ఏలుకొన్నాడని. ఈ విధంగా జరగవచ్చుననడానికి కన్యాశుల్కంలోనే కొన్ని ఆధారాలున్నాయి. అని అంటూ "అయామ్ డెస్పరేట్లీ యిన్ లవ్ విత్ హర్ " " ఇన్నాళ్ళు మధురవాణి వల్లో పడి యెలాగు యాస్ అయిపోయానో నాకు నా మట్టుకే ఆశ్చర్యంగా వుంది". "దీనిని చెడగొట్టటానికి ప్రయత్నం చేయకూడదు. చేసినా సాగేది కాదు. కనుక కొత్త దారి, కొంత న్యాయమైన దారి తొక్కాలి " అని కొన్ని ఉదాహరణలు చూపి గిరీశానికి లేని మంచితనాన్ని అంట గట్టటానికి ప్రయత్నించారు.

గిరీశానికి కొంత కీర్తికాంక్ష, బుచ్చమ్మ ఆస్తిపైన మాత్రమే మమకారం గలదని, బుచ్చమ్మ మీద ఎలాంటి ప్రేమ, సానుభూతి లేదని, వెంకటేశ్వరరావుగారి కుదింపు ద్వారానే ఋజువు చేయవచ్చు. గిరీశం కొత్తదారి, న్యాయమైన దారి తొక్కాలి అన్నాడని వెంకటేశ్వర రావుగారు అనడం సరికాదు. ఆ కొత్తదారి, న్యాయమైన దారి గిరీశం అభిప్రాయము ప్రకారము " మాయోపాయం చేసి దీన్ని లేవదీసుకుపోయి విడో మ్యారేజి చేసికుంటి నట్టాయెనా కీర్తి, సుఖం కూడా దక్కుతాయి " అన్న మాట న్యాయమైన ఆ క్రొత్తదారి బుచ్చమ్మను మోసం చేసి మాయోపాయంతో లేవదీసుకు పోవడమన్న విషయము ఈ సందర్భములో స్పష్టపడుతుంది న్యాయ మార్గము ననుసరించే వాడికి మాయోపాయాలతో పని యేమిటి ?

గిరీశానికి నిజమైన ప్రేమ వుంటే క్రెడిట్ డెబిట్‌లతో బాలన్స్ షీట్ తయారు చేయవలసిన అవసరం వుండదు. గిరీశం బుచ్చమ్మను పెళ్ళాడటం వలన కలుగు లాభనష్టాలను గురించి బేరీజు వేసుకుంటూ " చుక్కల వలె కర్పూరపు ముక్కలవలె నీదు కీర్తి మల్లోకముల్ క్రిక్కిరిసి పిక్కటిల్లెను " అన్నట్లు గిరీశం గారికి కీర్తి మిన్నుముట్టింది. గిరీశంగారి విధవా వివాహమహోత్సవం కథ న్యూస్ పేపర్లలో పెద్దక్షరములతో పడుతుంది. క్రెడిట్ నంబరు ఫైవ్ – విడో మారియేజి యసోసియేషన్ వారు ఒక తృణం యిస్తారు. బుచ్చమ్మకు కూడ కొంత డబ్బుంది. డెబిట్ దావాతెస్తే గాని అవధాన్లు మావగారు దాన్లో దమ్మిడీ ఇవ్వడు అని ఆలోచించేవరకు ధనకాంక్ష కీర్తి వాంఛ కలవాడై " అవశ్యం విడో మారియేజి చేసికొని తీరవలసిందే " అన్న నిర్ణయానికి వస్తాడు.

మధురవాణికిని, ఈ మనిషికిని కంపారిజన్ వున్నదా ? అది రంగు వేసిన గాజుపూస యిది ప్యూర్ డైమండ్ అని గిరీశం అనడంలో అతని కామ ప్రవృత్తి వ్యక్తమౌతుందే కాని గిరీశంలో బుచ్చమ్మపై ప్రేమ గాని, సంస్కరణాభావము గాని వున్నట్లు కన్పించదు. గిరీశం మొదటిసారి బుచ్చమ్మను చూసి " ఏమి చక్కదనం, యీ సొంపు యక్కడా చూశ్శేదే ! పల్లెటూరు పొదను కొన్నాను గాని పెద్ద కాంపేనుకి అవకాశం యిక్కడ కూడ దొరకటం నా అదృష్టం " అని తనలో అనుకొనే మాటలే అతని ప్రవర్తనను పాఠకులకు తెలియజేస్తాయి.

వెంకటేశ్వరరావుగారి కుదింపు చదివితే వారు భావించినట్లు గిరీశంపైన మంచి అభిప్రాయము కలుగవచ్చును. పాఠకులకు అలాంటి అభిప్రాయం కలిగితే అప్పారావుగారి ఆశయం నాశనంగాక తప్పదు. అప్పారావుగారి కన్యాశుల్కం నాటకము " డామిట్ ! కథ అడ్డం తిరిగింది " అనే గిరీశం డైలాగుతో పూర్తి అవుతుంది. గిరీశం ఏవో కొన్ని మాయ మాటలు చెప్పి సౌజన్యారావు

వ్యక్తిగతమైన ప్రశంసలు తగ్గి, కావ్యగతమైన ప్రశంసలు పెంపొందాలి – శ్రీ జమ్మలమడక

పంతుల్ని సహితం, మోసగించటానికి ప్రయత్నించి విఫలమైనట్లు పై డైలాగ్ ద్వారా స్పష్టమగుచున్నది. పూటకూళ్ళమ్మ నుండి సంతలో సామాను కొనడానికని డబ్బు తీసికొని డాన్సింగు గర్ల్ క్రింద ఖర్చుపెట్టటం దగ్గర్నుండి సౌజన్యరావు పంతులిచేత మందలింపబడేంత వరకు గిరీశం పాత్రను పరిశీలించి చూస్తే గిరీశం మోసకారని, నాలుగు బట్లర్ ఇంగ్లీషు ముక్కలు నేర్చుకొని అమాయకుల ఎదుట ప్రగల్భాలు పలికేవాడు గాను, బ్రతుక నేర్చిన వాడుగాను సాక్షాత్కరింపగలడు. ఇంతేకాక తాను చేసిన తప్పుల్ని కూడ తన తప్పుడు వాఖ్యానాలతో ఒప్పులుగా మార్చి వెంకటేశం వంటి అమాయకుల్ని అపమార్గం పట్టించడంలో సమర్థుడని వెంకటేశ్వరరావుగారి కుదింపులోని క్రింది ఉదహరణను పరిశీలిస్తే పాఠకులు గ్రహింపగలరు. "మొన్న బుగతగారి యింట్లో మీరు పొగాకు కట్ట యెత్తుకొచ్చారు గదా, పాపం చేశారని దేవుడు కోప్పడ్డా?" అన్న వెంకటేశం అమాయకపు సందేహానికి గిరీశం "పొగాకు కట్టకు పాపమేంవిటాయి, కాల్చి పారేసేదానికి: అందులో పొడుంచేసే బుద్ధి హీనుల దగ్గర పొగాకు ఎత్తుకురావడం లోకోపకారమని నమ్మ". అని సమాధాన మిస్తాడు. గిరీశం దృష్టిలో "యిలా చుట్ట కాలిస్తే స్టీము యింజనులాగ, భగ్ భగ్మని పొగ ఆకాశానికి పరిగెత్తి మేఘమై వర్షం కురుస్తుంది. పొడుంగాని పీలిస్తే ఆ ఘాటుకు ఆకాశం అర్చుకుపోతుంది" అనేదన్నమాట. వీనిని బట్టి గిరీశం విషయంలో "బుచ్చమ్మ పట్ల ప్రేమ అతని ప్రవృత్తిలో నిజంగానే పెద్ద మార్పు తెచ్చిందని ఎందుకు అనుకోరాదు?" అని వెంకటేశ్వరరావుగారు ప్రశ్నించడంలో అర్థం లేదు.

వెంకటేశ్వరరావుగారు మీనాక్షి పాత్రను ప్రవేశపెట్టటం అనవసరమని భావించి ఆ పాత్ర సంభాషణలను పూజారి చేత చెప్పించారు. ఈ విషయంలో కూడ వారు పొరబడ్డారనే చెప్పవచ్చు. బాల్య వివాహము చేయటం ద్వారా చిన్నతనంలోనే వైధవ్యం సంభవించిన స్త్రీలు వ్యభిచారిణులుగా మారడం ఆపై జరిగే అనర్థాలు మీనాక్షి పాత్ర ద్వారా అప్పారావుగారు చక్కగా వివరించారు. ఇలాంటి పాత్రను తొలగించడంలో వెంకటేశ్వరరావుగారి ఔచిత్యమేమిటో బోధపడదు.

తరువాత పరిశీలింప దగిన అంశం వెంకటేశ్వరరావు గారు సౌజన్యారావు పాత్ర సజీవమైనది కాదని భావించి ఆ పాత్రను పూర్తిగా నాటకం నుండి తొలగించడమే. అసలు అప్పారావుగారు సౌజన్యారావు పాత్రలోనే జీవించారు అనడంలో అతిశయోక్తి లేదు. సౌజన్యారావు పంతులు వంటి వ్యక్తి లోకంలో నుండటం అసహజమని వీరు భావించటం అసమంజసం. నేటికైనా వున్నారనటం నిర్వివాదాంశం.

కన్యాశుల్కం నాటకం ద్వారా అప్పారావుగారు ప్రజలకు ఏదైనా సందేశం అందించారంటే అది సౌజన్యారావు పంతులు పాత్ర ద్వారా మాత్రమే. నిజంగా సౌజన్యం మూర్తీభవించిన వ్యక్తి, సహృదయుడు, పరోపకార పరాయణుడు. అప్పారావుగారి వ్యక్తిత్వం ఈ పాత్రలో ప్రతిబింబిస్తుంది. ఈ నాటకమునకు ఏడవ అంకం అయువుపట్టువంటిది. సౌజన్యారావు పాత్ర ప్రధానంగా గల ఈ అంకంలోనే కథ పతాక స్థాయికి చేరుతుంది. సౌజన్యారావు మేటి ఉదాత్త పాత్రను సజీవమైనది కాదని భావించి వెంకటేశ్వరరావుగారు తమ కుదింపులో చివరి అంకాన్ని పూర్తిగా ఎత్తివేశారు. ఒక చివరి అంకమే కాదు అప్పారావుగారి కన్యాశుల్కాన్ని సగానికి పైగా కత్తిరించివేశారు. సౌజన్యారావు పంతులు పాత్ర లేని ఈ నాటకం ప్రాణంలేని శవం వంటిది.

అప్పారావుగారు తమ నాటకంలో కన్యాశుల్కం నిర్మూలనం అనే సంస్కరణతోపాటు, వ్యావహారిక భాషలో రచనా వ్యాసంగం జరగాలనే అభిప్రాయం కలవారై భాషా సంస్కరణను కూడ సాధించారు. తెలుగు సాహిత్యంలో ప్రజల వ్యావహారిక భాషలో వ్రాయబడిన మొదటి నాటకం "కన్యాశుల్కం". ఇది విశాఖ, శ్రీకాకుళం మాండలికాలలో పాత్రోచిత భాష కూడ పోషింపబడింది. దీనిలో భాషాపరంగా పాత్రల నడుమ ఎంతో వైవిధ్యం

సత్పురుషులు ప్రేమించేది స్వాతంత్ర్యాన్ని, మిగిలినవారు

గోచరిస్తుంది. కన్యాశుల్కంలో అగ్నిహోత్రావధాన్లు యొక్క భాష అగ్నిహోత్రావధాన్లది. అసిరిగాని భాష అసిరిగానిది. మధురవాణి భాష మధురవాణిది బుచ్చమ్మ భాష బుచ్చమ్మది. ఈ విధంగానే బైరాగి, హెడ్ కనిస్టీబు, పూజారి గురవయ్య, రామప్పపంతులు ఇత్యాది పాత్రల సంభాషణలో భాషాపై విద్యం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

ఈ విధంగా ప్రతి పాత్ర ద్వారా భాషా సంస్కరణలను సాధించి అప్పారావుగారు తరువాతి వారికి ఆదర పాత్రులైనారు.

వెంకటేశ్వరరావుగారు కన్యాశుల్కం నాటకాన్ని కుదించటం చేత అప్పారావుగారు సాధించదలచిన భాషా సంస్కరణ మరుగున పడినది. అందుకు కారణం వెంకటేశ్వరరావుగారు తమ కుదింపులో అసిరిగాడు, బైరాగి, పోలిశెట్టి, సిద్ధాంతి, దుకాణదారు, యోగిని, హవల్దారు, గ్రామ మునసబు, మనవాళ్ళయ్య, వీరేశ ఇత్యాది పాత్రలను తొలగించడమే. పైన పేర్కొన్న పాత్రలు లేకుండ అప్పారావుగారు సాధించిన భాషా సంస్కరణను గ్రహించడం సాధ్యపడదు. కాబట్టి వెంకటేశ్వరరావుగారి కుదింపు అప్పారావుగారి భాషా సంస్కరణను మరుగుపరిచినది అనడంలో అతిశయోక్తి లేదు. గురజాడవారి కన్యాశుల్కాన్ని, నార్లవారి కుదింపును పరిశీలనాత్మకముగా పోల్చి చూస్తే గురజాడ వారిది పంచ భక్ష్య పరమాన్నము వంటిదని, నార్లవారి కుదింపు పచ్చడి మెతుకులులా వుంటుందని అనిపిస్తుంది. ప్రస్తుత కాలంలో కన్యాశుల్కం పూర్తిగా రూపుమాసింది. ఐనా ఈ నాటకం పాఠకులకు ఎప్పటికప్పుడు నూతనత్వముతో ' మరోసారి చదవాలి ' అనే భావాన్ని కల్గించుతుంది. ఇంత ఉత్కృష్టమైన నాటకాన్ని కుదించే విషయంలో వెంకటేశ్వరరావుగారు సాహసించారనే చెప్పవచ్చు.

కన్యాశుల్కమనే సాంఘిక దురాచారం నశించే ప్రస్తుత కాలంలో వరశుల్కమనే మరో దురాచారము విజృంభించి, ఆడపిల్లలను, కన్న తల్లిదండ్రులను అష్ట కష్టాలపాలు చేస్తున్నది. ఈ తరుణంలో సమర్థులైన నార్లవారు కన్యాశుల్కాన్ని కుదించడానికి బదులు వరశుల్కాన్ని ఖండిస్తూ ఏదైనా నాటకం వ్రాసి యుంటే ఎంతో బాగుండేది. సంఘానికి కూడ కొంత మేలు చేసినవారయ్యేవారు. ఇలా చేయలేకపోయినా కన్యాశుల్కంలో తమకు కన్పించిన లోపాలను ఎత్తి చూపి విమర్శ వ్రాసిన బాగుండేది. ఇవేవి కాకుండ పలువురి మన్ననలకు ఆదరాభిమానములకు పాత్రమైన కన్యాశుల్కం నాటకాన్ని కుదించి వెంకటేశ్వరరావుగారు ఆశించిన ప్రయోజనాన్ని సాధించలేక పోయారు అని చెప్పక తప్పదు. 000

# ఏం తెలుసు?

జాబిలి అందం సుందరమైనా....
నింగి దానికి హద్దని తెలుసు!
తారల తళుకు బెళుకులు మిలమిలమన్నా....
నింగి దానికి హద్దని తెలుసు!
సాగర మెంత విస్తృతమైనా ...
తీరం దానికి హద్దని తెలుసు!
చీకటి ఎంత చిమ్మనైనా....
ప్రభాతం దానికి హద్దని తెలుసు!
సంతోషం ఎంత కాలం సాగినా....
విషాదం దానికి హద్దని తెలుసు!
కానీ, దుర్మార్గాలు, దోపిడీలు, హత్యలు,
దౌర్జన్యాలతో ముందుకు సాగిపోతున్న
ఈ ఛీత్కార సమాజానికి హద్దు ఎప్పుడు
అనేది ఎవరికి తెలుసు?

- అమిర్నేని హరికృష్ణ

కోరుకోనిది విశృంఖలత్వాన్ని - జాన్ మిల్టన్

# వందేమాతరము - జాతీయ గీతము

వందేమాతరమ్ !

అమ్మా ! నీకు నమస్సులు.

ఇది ఏదో పదముల యాదృచ్ఛిక సమ్మేళనం కాదు. ఒక రాజకీయపు పెత్తుగడ కాదు. శ్రావ్యతకై కూర్చిన పద్యపాదము కాదు. మాతృభూమితో విడదీయలేని అనుబంధాన్ని సుస్థిరంచేసి గౌరవప్రదమైన, ప్రతిభావంతమైన ఒక పవిత్ర ప్రతిజ్ఞ అది. తల్లికి నమస్సులర్పించి ఉజ్జ్వల హర్షాన్ని ఉదయింపజేసే తులలేని జాతీయ మంత్రోచ్చారణ అది. భారత స్వాతంత్ర్య సంగ్రామస్థలీ గాండీవుల్ని ముందుకు నడిపించిన జగన్నేత ఆజ్ఞ అది. ఈ మహా మంత్రాన్ని జపిస్తూ ఎందరు ఉరికంబాల్ని కౌగలించుకొన్నారో, ఎందరు దేశభక్తులు తమ జీవన సుమాల్ని భారతాంబ పాదపీఠిపై సమర్పించారో, ఎందరు వీరులు అస్తమించని ఆంగ్ల సామ్రాజ్యాధిపతులతో పోరాడుతూ కూడా ఈ జీవన మంత్రాన్ని జపించారో, గణించలేము. పరస్పర సందర్శనా సమయంలో అభివాద మంత్రం అది. మృత్యువును కౌగిలించుకొంటున్నప్పుడు కూడా మహనీయుల నాలుకలపై నాట్యమాడిన దివ్య సంజీవనీ మంత్రం అది. అట్టి మహా మంత్ర ఉద్గాత బంకించంద్ర ఛటోపాధ్యాయ. 1838 జూన్ 27 న బెంగాలులోని ఇరవైనాలుగు పరగణాలలో " కాంతల పాడా"లో జన్మించాడు. తండ్రి గవర్నమెంటు ఆఫీసరుగా ఉండేవాడు. కలకత్తాలోని ప్రెసిడెన్సీ కాలేజీనుండి పట్టభద్రుడైన బంకిం తన 20 వ యేట జెస్సూర్‌లో డిప్యూటీ మెజిస్ట్రేటుగా నియమింపబడి 33 సంవత్సరాల ఉద్యోగానంతరం పదవీవిరమణ చేసిన మూడు సంవత్సరాలకు 1894 ఏప్రిల్ 8 వ తేదీన పుడమితల్లి ఒడిలో ఒదిగిపోయారు.

మహా యోగి అరవిందులు బంకిం గురించి ఇలా అంటారు. " గత వైభవాన్ని స్మరించుకొంటూ, ఆ రోజులు తిరిగిరావని, సనాతనమైన యీ మహోన్నత దేశంలో ఉద్భవించిన మానవ మేధస్సుకు, నాగరికతకు ఉద్దీపన కలిగించిన మహర్షులు ఈ గడ్డపై తిరిగి జన్మించటం కల్ల అని వాపోతున్నవారు లేకపోలేదు. కానీ అది పొరపాటు. మనది సనాతన భూమి, సనాతన

కల్లూరి కాశీవిశ్వేశ్వరశర్మ

పూజ, సనాతన ధర్మము. దీని బలము, మహత్వము, పవిత్రత మేఘాచ్ఛాదితము కావచ్చుకాని అస్తిత్వమును మాత్రము కోల్పోవు. వీరుడు-ఋషి-ప్రవక్త " మన హిందూ భూమియొక్క సహజ ఫలాలు. వీరు పుట్టని కాలమే లేదెప్పుడూ. నవ్యభారతాన్ని సృష్టిస్తున్న పునరుజ్జీవన మంత్రం "వందేమాతరం" మనకు ప్రసాదించిన మహా మనిషి పేరును అర్వాచీన యుగపురుషుల మధ్య చేర్చాలని చిట్టచివరకు మనం గుర్తించాము " అని అంటారు.

విశ్వకవి రవీంద్రనాథ ఠాగూర్ " వంగ సాహిత్యాకాశంలో దేదీప్యమానంగా వెలుగుతున్న సాహితీభానునిలా ఆయనను గుర్తించాను అంటూ సుస్థిర జాతీయ ప్రగతికి ఏకైకమైన పునాది ఆయన వేసారు. మన దుఃఖంలో ఓదార్పుకు, మన పతనంలో ఆశకు, మన అలసటలో శక్తికి మార్గం చూపించినది ఆయనే " అంటారు.

అట్టి మహానుభావుడు రచించిన " వందేమాతరం " కోట్లాది భారతీయులచేత మాతృదేవతాదర్శనం చేయించిన మహోన్నత జాతీయగీతము ఈ గీతము ముందుగానే రచించినప్పటికి "ఆనందమఠం"లో చేర్చారు బంకింబాబు. 1875 లో శాంతిరహిత కలకత్తా నగరంనుండి బయలుదేరి ప్రయాణిస్తున్న బంకింబాబు దృష్టి పచ్చని పంట పొలాల

అన్యాయాన్ని, అధర్మాన్ని భయం లేకుండా ఎదుర్కొనే టానిక్ లాంటిది విద్య - శ్రీ వేదవ్యాస్

మీద పడింది. ఆయన మనస్సు ఆనందతరంగితమై ఉప్పొంగింది. అతని అంతరదృష్టి మాత్రం మాతృభూమి పరిపూర్ణ మహత్తర వైభవాన్ని దర్శించింది. "వందే మాతరం" సృష్టింపబడింది. మన మాతృభూమి తన శిశువులలో, వారి గుండె లోతులలో తమ మాతృభూమి యొక్క మహత్తర శ్రేయస్సుకోసం వెలుగుకోసం అధికృతను త్యాగంచేయటానికి తమను పూర్తిగా అంకితం చేయగల ప్రగాఢమైన వాంఛను రేకెత్తించగలదు. మాతృభూమి విమోచనగానపు మంత్రశక్తి మూగవాణ్ణి మాట్లాడేటట్లు, అశక్తుణ్ణి తన కాళ్ళమీద నిలబడేటట్లు, బొక్కబోర్లపడిన దురదృష్ట జాతి బాహువులెత్తి సింహం లాగా గర్జించేటట్లు చేస్తుంది. అలాంటి జాతిని ఎవడాప గలడు ? ఎవడడ్డుకోగలడు ? దేశభక్తి ప్రేరిత ప్రజల గమనాన్ని సమస్త ప్రపంచం ఏకమైనా ఆపలేదు.

నిజమే మరి. జరిగింది కూడా అదే కదా ! కానీ మనం వందేమాతరాన్ని జాతీయగీతంగా గౌరవించలేక పోయాము. ఎవరో ఏదో అన్నారని, అనుకొంటారని దాన్ని ప్రక్కన పెట్టాము. ఒక వంక దాన్ని ఉచ్చరిస్తూనే దానికి సముచిత స్థానం యివ్వలేకపోయాము. కారణం ఏమిటి ? ఎవరు చేసారీ దారుణం ? ? మనని మనమే వంచించుకొన్నాము. ముస్లిం సంతుష్టీకరణ విధానాలతో వారితో హీనాతిహీనంగా రాజీ పడ్డాము. 1923 లో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో ఆనాటి అధ్యక్షులు మౌలానా మహ్మదాలీ వందేమాతరం పాడటానికి వీల్లేదు అంటే పాడితీరుతాను అని విష్ణుదిగంబర పలూస్కర్ తన శ్రావ్యమైన గొంతుకతో వందేమాతరం గానం చేసారు. వందేమాతరం ఎడల ముస్లింలీగుయొక్క వ్యతిరేక ధోరణి అనేక సందర్భాలలో వ్యక్తం అవుతూ వచ్చేది. ముస్లింలీగు ఒక తీర్మానం ఆమోదించింది. అది ఇలా వుంది "వందేమాతరం జాతీయగీతంగా చొప్పించటంలో కాంగ్రెస్‌యొక్క వైఖరి మొండిగాను, ఇస్లాం వ్యతిరేకంగాను, విగ్రహారాధోకతత్వంగాను, సరియైన జాతీయతా వికాసానికి వినాశకరంగాను భావిస్తూ దానిని ఈ అఖిల భారత ముస్లింలీగు సమావేశం దృఢంగా గర్హిస్తున్నది. ఈ సమావేశం దేశంలోని వివిధ ప్రజా సంస్థలయొక్క, శాసన సభలయొక్క సభ్యులను మిక్కిలి అక్షేపణీయమైన ఆ గీతంతో సంబంధం పెట్టుకోవద్దని గట్టిగా కోరుతున్నది. అలాగే అనేకమంది ముస్లిం సభ్యులు వందేమాతరం పాడేటప్పుడు గౌరవంతో లేచి నిలబడకుండా కూర్చునే వుండేవారు కూడా. చివరికి ముస్లింలీగును సమాధాన పరిచేందుకు ఆ గీతాన్ని ఛిన్న భిన్నంచేసి అందులో మొదటి రెండు పాదాలను మాత్రమే పాడాలని కాంగ్రెస్ తీర్మానించింది. "విచ్ఛిన్నకరవాదులు కొన్ని సంవత్స రాల తరబడి వ్యతిరేకిస్తూ వచ్చిన ఆ వందేమాతరం గీతానికి చివరకు ఆ గతి పట్టింది. అది త్రుంచివేయ బడింది" అని ఎంతో దుఃఖంతో మున్షి వ్రాశారు.

వందేమాతరం జాతీయగీతంగా స్వీకరింపబడటానికి దానిలో విగ్రహారాధన తత్వం ఉంది అని అభ్యంతరం తెలుపబడినప్పుడు అరవిందులు "అందులో ఆరాధింపబడ్డ దుర్గ విజ్ఞానానికి, శక్తికి, ఘనతకు కీర్తికి ప్రతీకగా ఉన్న భారతమాతయే కాని మరొకటి కాదు అంటూ ఈ గీతంలో వెలువరించబడిన భావాలు తమ మతానికి వ్యతిరేకం అని ఎవరైనా అభ్యంతర పెడితే వారు భారతదేశం అంటే ఏమిటో అర్థం చేసుకోలేకపోతున్నారనాలి. ఆమె యొక్క సాంస్కృతిక విలువలను పూర్తిగా దోచుకోవడానికి ప్రయత్నిస్తున్నారనాలి. యుగ యుగాలనుండి భారత దేశంలో విశాల దృక్పథంతో ఆరాధింపపడుతున్న ఆత్మ సౌందర్యం యావత్ ప్రపంచ మన్ననలను పొందింపన్న సత్యాన్ని ప్రతిబింబింప చేయలేని జాతీయగీతం ఆదర్శ వంతమైంది కాజాలదు. అలా కాని పక్షంలో ఆమె యావత్ చరిత్ర ఒక పెద్ద సున్నాయే అవుతుంది" అన్నారు.

శత్రువులవల్ల వచ్చే బాధలకంటే, చాదస్తంవల్ల కొనితెచ్చుకొనే బాధలు ఎక్కువ - కురల్

ఈ వందేమాతరం విషయంలో ముస్లింలీగుతో కాంగ్రెస్ కుస్తీ పట్టటంతో అలిసిపోయింది. అందుచేత వారొక రాజీకి రావలసివచ్చింది. ఆ యత్నంలో పాపం 'వందేమాతరం' ఒక అనాధ శిశువు అయింది. గాంధీజీ విసిగిపోయి "హరిజన్" పత్రికలో యిలా వ్రాశారు. "అది (వందేమాతరం) ఎక్కడ పుట్టిందో, ఎప్పుడు ఎలా రచించపడిందో అనేది అనవసరం. కాని అది బెంగాల్ విభజనదినాలలో హిందువులకు, ముస్లింతో కూడ అత్యంత శక్తివంతమైన యుద్ధ నినాదమైంది. అది సామ్రాజ్య వాద వ్యతిరేక నినాదం. నేను బాలునిగా ఉన్నప్పుడు ఆనందమఠాన్ని గురించి దాని కర్త అయిన అమరకవి బంకింను గురించి కాని ఏమీ ఎరుగకముందే మొదటిసారిగా వందేమాతరంగీతాన్ని విన్నప్పుడు అది నన్ను గట్టిగా ఆకట్టుకొని నన్ను తన దాసుణ్ణి చేసుకొంది. అది హిందువుల గీతమని కాని, హిందువుల కోసమే ఉద్దేశింపబడిందని కాని నాకు ఎన్నడూ అనిపించలేదు. దురదృష్టవశాత్తు మనకిప్పుడు చెడ్డకాలం వచ్చింది. పూర్వకాలపు మేలిమి బంగారమంతా ఇప్పుడు కల్తీ లోహమయింది. ఇటువంటికాలం మేలిమి బంగారాన్ని అమ్మచూపకుండా ఉండటమే వివేకం. హిందువులు, ముస్లింలు కలిసి సమావేశాలలో ఆ పాట పాడి తగాదా తెచ్చుకొనేందుకు మాత్రం నేను సిద్ధంగా లేను. అలా అని ఆ పాట వాడుకనుండి తప్పిపోదు. అది కోట్లాది ప్రజల హృదయ సింహాసనాలలో సుప్రతిష్ఠితమైవుంది. జాతి జీవించి యున్నంతవరకు ఆ పతాకము, ఆ గీతము జీవిస్తాయి" అంటూ ముస్లింలీగ్ యొక్క నీచ వాంఛకు తల వొగ్గారు గాంధీజీ.



ఇలా కుంటి సాకులతో, పనికిరాని వాదోపవాదాలతో, వందేమాతరం జాతీయగీత స్థాయి నుండి అతి విచిత్రంగా జార్చివేయబడింది. దాని స్థానంలో "జనగణమన" ప్రత్యక్షమైంది. విశ్వకవి రవీంద్రునిపై గల మన వారికి గల భక్తికి తార్కాణంగా జనగణమనకి ఈ గౌరవం కల్గించామంటారు. విశ్వకవి సహితం గౌరవించే బంకిం బాబు గీతానికి మనం ఇచ్చిన గౌరవం ఏదీ ఎవరినో కొందరిని సంతృప్తిపరచటానికి కోట్లాది భారతీయుల గుండెల్లో మంటలు రేకెత్తించటం న్యాయమా? భారత మాతను శతృభయంకరమూర్తి దుర్గామాతగా, దశప్రహరణ ధారిణిగా, విద్యాదాయినిగా, ఐశ్వర్యప్రదాయినిగా భావించటం తప్పా? అందులో అభ్యంతర పెట్టాల్సింది ఏముంది? ఉన్నా, (కొంతమందికి) ఆ అభ్యంతరాన్ని మనం మన్నించాల్సిన అవసరం ఏముంది? ఈ ప్రశ్నలు అప్పుడు ఇప్పుడు కూడా శేషప్రశ్నలుగానే మిగిలిపోయాయి. వీటికి సమాధానం కాలమే యిస్తుందో లేక మరో బంకింబాబే యిస్తాడో చెప్పలేం. అయినా వేచి చూద్దాం.

---

స్నేహితులను రహస్యంగా మందలించు, పొగిడేటప్పుడు బహిరంగంగా పొగడు - సైరస్

# కాలభైరవుడు ........................ దూబగుంట సుబ్రహ్మణ్యం

అడియాస కొలువు గొలువకు
గుడిమణియము సేయబోకు కుజనుల్ తోడన్
విడువక కూరిమి సేయకు
మడలని దొడరయ కుండనరుగకు సుమతీ ॥

ఇందులోని రెండవ పాదములోని " గుడిమణియము సేయబోకు " అను విషయమౌచిత్య మేమిటనునది ప్రశ్న ? దీని వివరణమై అఖండ కవివర్యులగు శుకంటి పాపిరాజుగారి ప్రణీతంబైన ఉత్తర రామాయణ సప్తమాశ్వాసమునందొక ఇతిహాసము కలదు.

అట్టి శ్రీరామచంద్రమూర్తి పరిపాలనా కాలమందు, నొకానొక దినంబున, మంత్రి సామంత్య, సోదర సమస్త పరివార బృందంబులతో గొలువుకూటము ప్రవేసించి మణిమయాద్యలంకృతమైన పీఠమునందాసీనుడై యుండెను. సభాప్రాంగణమంతయు, ఋషి బృందంబుల తోను విద్వత్కవివర్యులతోను వేదాధ్యయనధ్యాపక విప్రోత్తములతోను ఇంకను పుర ప్రముఖులగు ప్రేక్షక జనంబులతోను సభాప్రాంగణమంతయు కిక్కిరిసి యుండెను.

అట్టితరి రఘుకుల తిలకుని ఆజ్ఞానుసారం సౌమిత్రి సభాప్రాంత మొగసాలకేగి, మనవి కొఱకై వేచియున్న అర్థులెవరైనను లోనికి రండని కోరెను. అంతట పుర జనులెల్లరు నిలిచి, శ్రీరామచంద్ర ప్రభువు పరిపాలన యందసమాన సౌఖ్యాదులతో వర్థిల్లుచున్నవారమనియు మా కేలాంటి కొరతయు లేదనియు, వారి పాదపద్మముల దర్శించి ఆనందోత్సాహముల నోలలాడుటయే మా నిత్య కృత్యమనియు విశదపరచిరి.

ఇంతలో ఒక శునకము భయభ్రాంతిచే వడంకుచూ శిరంబు నుండి రక్తధార స్రవించుచూ సన్నగా రోదించుచూ అల్లంత దూరమున వక మూలగా సౌమిత్రి కంటబడెను. ఆయన దాని దగ్గరకు వెళ్ళి ఇదేమి హేతువని ప్రశ్నించెను. అందులకా గొలేయకము ఆప్తుల పాలిటి రక్షకుడైన వారికి మాత్రమే వివరించగలనని యనెను.

లక్ష్మణుడావిషయ మన్నగారికి నివేదించెను. అన్నగారు నీవు మరల వెళ్ళి నేను రమ్మనమని చెప్పినట్లుగా వినిపించి నీ వెంట గొనిరమ్మనమని చెప్పెను. అంతట ఆ శునకము అచ్చట మహాఋషిపుంగవులు, రాజాధిరాజులు వేదాధ్యయన విప్రవర్యులు మొదలగు పుణ్యపురుషులు గల పవిత్ర స్థలమునకు నీచజాతి మృగమునైన నేను రా తగనని జవాబిచ్చెను.

అప్పుడు ఆ దీనదయాళుడగు పరమాత్మయే స్వయముగా వచ్చి యిట్టి నీ గతికి కారణమేమని ప్రశ్నించెను. అప్పుడా శునక మిట్లనియెను.

నే నెవ్వరిని బాధించుదానను గాను నన్నకారణముగా ఒక భిక్షువు తన చేతిలోని పొడపైన దండముతో నా నెత్తిమీద మొత్తెను. అప్పుడనాథులపాలిటి నాధుడగు పరమాత్మ రక్షక బృందంబుల పంపించి ఆ భిక్షుకుని పట్టి తెప్పించెను. నీవు బ్రాహ్మణ భిక్షువుగా యుండి, యింతటి పాపకృత్యమునకేల పాల్పడితివని ప్రశ్నించెను.

నేను కడు వృద్ధుడను. మధ్యాందిన వేసవి యండ మిక్కుటముగా నుండు సమయంబున, పిపాసా పరాయత్త చిత్తంబున భిక్షాటనకు వెళ్లుచుండగా నన్నడ్డగించినందున యీ శునకమును గొట్టితిని. ఇది నా యొక్క నేరమే కాగలదు. తమరు విధించు శిక్షకు నేను సర్వదాపాత్రుడనే. తమ శిక్ష ననుభవించినచో పరలోకంబున దండధరుని శిక్ష తొలగిపోవునని చెప్పెను

గాయం పరాభవం కంటే త్వరగా మానిపోతుంది - చెస్టర్ ఫీల్డ్

ఆటుతరి శ్రీరామచంద్రమూర్తి ఎట్టి శిక్ష విధించవలయునని ఆలోచించుచుండగా ఆ శునకమే తన కోరికను తెల్పెను. ఇచ్చటికి సమీప దూరములో కాలాంజనగిరి మీద గల సుప్రసిద్ధ దేవాలయమునకు పరిపాలనాధిపత్య మొసంగవలయునని కోరెను, ఆ వెంటనే రాజాజ్ఞమేరకు సకలవిధ ప్రభుత్వలాంఛనములతో భద్రగజంబుపై నెక్కించి పంపించబడెను.

అంతట మంత్రివర్యు లెల్లరు యిదేమి శిక్ష. యిట్లయినచో బ్రాహ్మణులందరు కుక్కల తలకాయలు పగులగొట్టి యిట్టి శిక్షకు తయారగుదురుగదా యని యడిగిరి. అంతట వారు ఆ విషయము కుక్కనే అడుగుడనెను. అందుపై ఆ శునకము ఇంతకన్నా అవమానకరమైన శిక్ష మరియొకటి లేదనియు అట్టి పదవినే నేననుభవించి, తదన్నభుక్తముల నారగించిన దుష్ఫలితమే యీ జన్మనెత్తవలసి వచ్చినదనియు చెప్పెను. అయితే ఆ జన్మలో నేను చేసియున్న మంచిపనులు కొన్ని యుండుటవలన పూర్వజన్మ స్మృతినిగలిగి యుంటిననియు చెప్పెను. దేవ బ్రాహ్మణ సొమ్మును యే విధముగా ఆరగించినను యిట్టి నికృష్ట జన్మ తప్పదని స్పష్టపరచెను.

తదుపరి ఆ శునకము శ్రీరామచంద్రమూర్తి వీడ్కోలందుకొని, అయోధ్యాపురి నుండి మెల్లమెల్లగా నడచి వారణాశి పట్టణము చేరి అచ్చట కొంతకాలము నిరశనతో గృశించి తనువు చాలించి సద్గతి నొందెను. ఇప్పటికిని కాశీక్షేత్రములో కాలభైరవుని పేర నొక దేవాలయ ముండుటయు యాత్రికబృందంబు లనేకమంది ప్రతిరోజు అచ్చట పూజలు జరిపించుటయ యిందుకు తార్కాణము.

—0—



పరాజయం కాదు, హీనమైన లక్ష్యం కలిగి వుండడమే - జె. ఆర్. లోవెల్

( గత సంచిక తరువాయి )

సెంట్రలుజైలు, రాజమండ్రి
ది 29-1-1976

ప్రియమైన జయ,

'హేమ' వివాహం కుదిరినందుకు చాలా సంతోషం. మంచి లగ్నం పెట్టించగలవు. జైలులో విసుగూ విరామం లేకుండా పని కల్పించుకొని జీవించగలవారు అదృష్టవంతులు. అందుకోసమనే ప్రతి క్షణం ఊరికనే వృధాపర్చడంలేదు. ఇంకా మంచి పుస్తకాలు చదవాలను కొంటున్నాము. సమయం సరిపోవడం లేదు. ఒకదాని వెంబడి ఒకటి తీరుబడి లేకుండా చేస్తున్నాం. అట్లా పని కల్పించుకొననివారు దిగులుతో ఏదో వ్యాకులత జెందు తుంటారు. మానవుడు తాను నిర్మించుకోవడంలోనే వుంటుంది విశేషం. మానవుడు నిజంగా తలచుకుంటే దేవుడు కాగలడు. రాక్షస రూపం దాల్చగలడు. మంచి వాడు అవుతాడు, క్రూరుడూ అవుతాడు. అంతా మనం అనుసరించే పంథామీద ఆధారపడి వుంటుంది. పరులకు ఉపకారం చేసేవార్ని దేవుడంటారు. అపకారం చేసేవార్ని రాక్షసుడంటారు. తన శక్తిని, యుక్తిని, బలాన్ని, సాహసాన్ని, తెలివిని, త్యాగాన్ని పరులను అన్యాయం నుండి, కష్టాల నుండి రక్షించడానికి ఉపయోగించడం మానవధర్మం. గడించిన అనుభవాన్ని ఆచరణలో పెట్టడంలోనే వున్నది మానవుని ప్రజ్ఞ. గత అనుభవాలు భవిష్యత్తుకు రాజమార్గాలు గత వైభవాన్ని తలచుకొని భవిష్యత్తును అంధకారం చేసుకోరాదు, గత కష్టాలను తలచుకొని భవిష్యత్తును తీర్చిదిద్దుకోవాలి. తరుణోపాయాన్ని అన్వేషించాలి. కష్టసుఖాల మిళితమే జీవితం. చేదు రుచి తెలుస్తేగాని ి విలువ అర్థం కాదు. ఇదే విధంగా కష్టమును అనుభవిస్తేగాని సుఖం ప్రాముఖ్యత అర్థం కాదు. ఈ రెంటి అనుభవాలను పొందినప్పుడే జీవితం సార్థకమవుతుంది. ఈ రెంటిని సమభావంతో చూడగలిగినప్పుడే మానవుని వ్యక్తిత్వం ఇనుమడిస్తుంది కష్టాలు సంభవించినప్పుడు ధైర్యాన్ని కోల్పోవడం, సుఖం వచ్చినప్పుడు వళ్ళు మరచిపోవడం విజ్ఞత లక్షణం కాదు. ఈ రెంటిని సక్రమంగా, సవ్యంగా అర్థం చేసుకున్నవారికి అపజయం వుండనే వుండదు. జీవితం సాఫీగా సాగిపోతుంది. ఇక వుంటా ....

ఇట్లు
'సీ'

ది 14-2-1976

ప్రియమైన జయ,

కొంతకాలం అతివృష్టి, మరి కొంతకాలం అనావృష్టి. నీ వద్ద నుండి ఉత్తరాలు ఆ విధంగా వున్నాయి. "పెరోల్" కు పంపాను ఇస్తారో ! ఇవ్వరో ! చెప్పలేను. ప్రయత్నం చేయాలి గాబట్టి చేస్తున్నాను. సుదీర్ఘమైన ఉత్తరాలు వ్రాయడానికి సమయం ఉండటం లేదు. ఎక్కువ సమయం సంస్కృతం నేర్చుకోడానికే సరిపోతున్నది. ఉదయం లేచిన దగ్గరనుంచి రాత్రి 11 గంటల వరకు తీరుబడి లేని పని. వారానికొక పర్యాయం సంస్కృత పరీక్షలు. ఇప్పటికి రెండు పరీక్షలు అయినాయి. రెంటిలో నేనే ఫస్టుమార్కులు తెచ్చుకున్నాను. ఈ విధంగా చదువుతే మన విద్యానికేతన్ పిల్లలకు సంస్కృతం చెప్పగలను. సంస్కృతం వచ్చి

గ్రామం గేయం లాంటిది, నగరం నాటకం లాంటిది. ఈ రెండూ

వుంటే మూలగ్రంథాలు చదవడానికి అవకాశం వుంటుంది గదా ! భగవద్గీత పూర్తి చేశాను. దాని మీద వ్యాఖ్యలు మూడు పుస్తకాలు చదివాను. భవిష్యత్తులో సామాన్య ప్రజలకు అర్థమయ్యే విధంగా, నిత్యజీవితంలో ఎదుర్కొనే సమస్యలకు పరిష్కార మార్గాలను సూచిస్తూ "భగవద్గీత" మీద వ్యాఖ్య వ్రాయాలని తలంపు కల్గింది. ఇంకా చాలా పుస్తకాలు చదవాలి. ఆ విధంగా వ్రాయాలంటే యింకా రెండు మూడు సంవత్సరాలు పట్టవచ్చు. కావల్సిన సమాచారాన్ని సేకరించాలి. ఇంతవరకు నాకు రాజకీయాలలో తప్ప మరే సాహిత్యంలోను ప్రవేశం లేదు. ఆధ్యాత్మిక విషయాలలో అసలే అనుభవం లేదు. తెల్సిన రాజకీయాలు – వాటి మంచిచెడులను బహిర్గతం చేసే అవకాశం ప్రస్తుతానికి నాకు లేదు. రాత్రిపూట " సుందరకాండ " చదువుతున్నాం. 20 సంవత్సరాల తరువాత విద్యార్థి జీవితాన్ని చవిచూస్తున్నాను. మేము బయట వుంటే ప్రమాదమని జైలులో పెట్టింది ప్రభుత్వం. " అంతయూ మన మేలుకే " అన్నట్లు ఇది కూడ మంచిదే అయింది. బయటవుంటే యింత శ్రద్ధగా చదివే అవకాశం వుండదు గదా ! భగవంతుని ఆజ్ఞ లేనిదే ఒక వ్యక్తిని మరొక వ్యక్తి ఏమీ చేయలేడు. పాడు చేయాలనుకొనినా బాగుపడతాడు. భగవత్ చిద్విలాసాన్ని అర్థం చేసుకోలేక అంతా నా వల్లనే ఈ ప్రపంచం నడుస్తున్నదని విర్రవీగుతుంటారు కొంతమంది ప్రబుద్ధులు. అంతేకాదు అహంకారం, అహంభావంతో అధికారాన్ని దుర్వినియోగ పరుస్తారు మరికొంతమంది అధినేతలు చరిత్ర ఋజువుచేస్తున్న నగ్నసత్యం ఇదే. ఇక వుంటా ....

ఇట్లు
' సీ '

Phone : 3436

గత 57 సం॥గా ప్రఖ్యాతిగాంచిన ఏకైక సంస్థ




హెడ్ ఆఫీస్ & ఫ్యాక్టరీ :
రాజా బిల్డింగ్స్, మచిలీపట్నం
సేల్సు బ్రాంచీలు : బీసెంట్ రోడ్, విజయవాడ-2
చిక్కడపల్లి, హైదరాబాద్-20
Mg. Partner: P. V. SUBBA RAO, B.Sc.,

ది 19-2-1976

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన రెండు ఉత్తరాలు ' హేమ ' పెండ్లి శుభలేఖలు అందినాయి. " సూర్యం " ఆరోగ్యం వ్రాయగలవు. మందు తీసుకోవడంలో అశ్రద్ధ చేయవద్దని చెప్పు. రాజు వచ్చి వెళ్ళినట్లు వ్రాశావు. చాలా సంతోషం. ఖర్చు పొదుపుగా చేయగలరు. మర్యాదల విషయలలో ఏ మాత్రం అశ్రద్ధ చేయవద్దు. పెండ్లి మన యింట్లో చేస్తున్నాం కాబట్టి బాధ్యత అంతా మన మీదనే వుంటుంది. " హేమ " పెండ్లి చేసే యోగ్యత మీ నాన్నగారికి లేకుండా పోయింది. నాకు కూడ ఆ అవకాశం లేదు. ఒకవేళ ఆ సమయానికి వచ్చినా చుట్టం వచ్చినట్లేగదా ! అందుకోసమనే, నేను మీ నాన్నగారు కలిసి ఎంత ప్రయత్నించినా " హేమ " పెండ్లిని చేయలేకపోయాం. విధి బలీయం. ఈ పెండ్లికి ఈ లోకాన్ని

నెలి స్తే చక్కని గేయ నాటకం తయారవుతుంది – లాంగ్ ఫెలో

విడిచి వెళ్ళిన మీ నాన్నగారు అసలు రానే రారు నేను ఈ లోకంలో వుండి కూడా వస్తానో ; రానో : చెప్పడం కష్టం. కనుక ఈ పెండ్లిని నిర్వహించే బాధ్యత మీ చేతులలోనే వున్నది. " రాజు " పెండ్లి ఎంతో ఘనంగా చేయాలని అనుకునేవాడను. కాని చేయగలిగానా ? పరమేశ్వరుడు ఆడించినట్లుగా ఆడవలసిన వాళ్ళమే మనం. పరమేశ్వరుడు చూపిస్తున్న "సినిమా" ను చూచే ప్రేక్షకులు మాత్రమే మానవులు. ఆ కాసేపు చూచి ఇది బాగున్నది. అది బాగాలేదు అని విమర్శిస్తుంటాం. బాగుకు, చెడుకు బాధ్యులు ప్రేక్షకులు కాదుగదా ! వారి చేతులలో ఏమీ లేదు. ఎవరు ఏ పని చేసినా, ఏ పెండ్లి చేసినా ఎవరి చేతుల మీద జరిగినా, నాలుగు కాలాలపాటు సుఖంగా జీవించి మంచి పేరు ప్రతిష్ఠలు తెచ్చుకోవాలనే అందరి అభిలాష. ఇది కూడా ఒక అనుభవమే. పరిస్థితుల ప్రభావం వల్లనే మానవుడు అనుభవాన్ని పొందుతాడు. డక్కా ముక్కీలు తింటేనే రాటు తేలుతాడు. ఇదే చరిత్ర ఋజువుచేస్తున్న వాస్తవం. ఇక వుంటా....

ఇట్లు
" స్నే "

[ పెరోల్ ప్రభుత్వం నిరాకరించడంవలన పెండ్లికి కూడా వెళ్ళే అవకాశం లేకుండా పోయింది ]

* *

28-2-1976

ప్రియమైన జయ,

చి॥ లక్ష్మికి సంస్కృతంలో ఉత్తరం వ్రాస్తున్నాను. సంస్కృతం అందరు అధికారులకు రాదు గదా ! నేను ఏవో రహస్యాలు వ్రాసి వుంటానని వారు భావించడం సహజం. పిల్లలు దేవుళ్ళతో సమానమన్నారుగదా ! ఎవరైనా దేవునితో అబద్ధాలు, రహస్యాలు చెప్పడానికి సాహసిస్తారా ? అదే విధంగా అబద్ధాలు, రహస్యాలు, కుట్రలు వ్రాసి అమాయకులైన పసిపిల్లల నిర్మలమైన మనస్సులను గాయపరచుతారా ? ఎవరైనా అట్లా చేసే వారుంటే అట్టివార్ని అవివేకులు, మూర్ఖులు అనక తప్పదు. అధికారులకు తెలియడానికోసం సంక్షిప్తంగా ఆ సంస్కృత ఉత్తరం భావం కూడా వ్రాసి వార్కి యిచ్చాను. లేకపోతే ఈ ఉత్తరం నీకు పోస్టుచేయరు గదా !

ప్రియ లక్ష్మి - శుభాశీర్వాదాః

అహం అత్ర కుశలః । యూయం సర్వే తత్ర కుశలాః ఏవ ఇతి భావయామి । తవ పరీక్షః సమీపం ఆగచ్ఛన్తి । తతః త్వం శ్రద్ధయా పఠిష్యసి । ఏతత్ప రీక్షాసు త్వం ప్రప్రథమా ఉత్తీర్ణ భవేః । అహం అత్ర సంస్కృత పరీక్షాయాం ప్రప్రథమః ఉత్తీర్ణః అభవమ్ । మమ గుణాః ౯౨ (92) శాతం ప్రాప్తః ।

తవ అనుజాః చందు, ఉదయ, శ్యాం దౌష్ట్యం కుర్వన్తివా ? నో చేత్ శ్రద్ధయా పఠన్తివా ? " సర్వే అధ్యాపకాః శ్రద్ధయా పాఠయన్తి " ఇతి భావయామి । తేషాం మమ నమస్కారాన్ వద । ప్రతి దినం త్వం క్షీరమేవ పిబ। కాఫీ మా పిబ। తత్ అనారోగ్య కరమ్। నాగేశ్వరరావ్, వెంకయ్య, సమ్యక్ కార్యాణికుర్వన్తివా? దౌష్ట్యకారిణీ గౌరి కిం అపి పఠతివా ? "పిలకా గణపతిః" కిం కరోతి ?

మహిష్యః సమ్యక్ క్షీరం యచ్ఛన్తివా ?
త్వం తవ అనుజాః చ నిత్యం ప్రభాతే
మాతృపాదాభివందనం అవశ్యం కురుత ।

యుష్మాకం " పితామహం, పితామహీం, మాతరం పితృవ్యం చ కుశలం పృచ్ఛామి " ఇతివద ।

" సర్వదా సత్యమేవ వదేయుః । శ్రద్ధయా పఠేయుః దౌష్ట్యం న కుర్యుః " సర్వే బాలకాః ఏతత్ వాక్యాని శ్రద్ధయా ఆచరేయుః ।

" విద్యా, విజ్ఞానం, క్రమశిక్షణా, దేశభక్తిః సచ్ఛీలం " ఇతి అస్మత్ విద్యానికేతన్ ఆదర్శాః । సర్వే బాలకాః ఏతాన్ శ్రద్ధయా ఆచరేయుః ।

సర్వే బాలకేభ్యః మమ శుభాశీర్వాదాః ।

ఏవం తవ జనకః
కొమరగిరి కృష్ణమోహనరావ్

మానవ విజ్ఞాన తృష్ణను తీర్చే క్షీరసముద్రాలు గ్రంథాలయాలు - శ్రీ పర్వతనేని గంగాధరరావు

# భగవదానుగ్రహం లభించాలంటే ...

కోమరగిరి జయప్రద

భగవంతునికి మా మీద దయ లేదు, అనుగ్రహమొక్కటీ కలిసిరావటంలేదు ” అని ప్రతి నిత్యం బాధపడేవారు కోకొల్లలు. కానీ భగవంతునికి ఇష్టమైన పనులు మనం ఏం చేస్తున్నాం ? అనే విషయం మాత్రం ఆలోచించేవారు మాత్రం బహు అరుదు.

భగవాన్ బాబావారు ఒక పర్యాయం భక్తి లక్ష్యమును చక్కగా వివరించారు. “ భగవంతుని ప్రీతితో ఆరాధించుట ఒక విధమైన సాధన మాత్రమే. కానీ భక్తులు కాగోరువారు అంతమాత్రమునకే తృప్తి పడక తమ ప్రేమ భగవంతునియందు ఎంతమాత్రము కలదని యోచించుట కంటెను, భగవంతుని ప్రేమానుగ్రహములు తమపై ఎంతమాత్రము కలవనియు, ఎట్టి కర్మలు చేసిన, ఏ రీతిగా మెలిగిన భగవంతుడు సంతుష్టుడు కాగలడో — అనగా భగవంతుని ఆనందపరచు మార్గమేది యని యోచించి, విచారించి, తదనుగుణ్యముగా వర్తించుటే భక్తి లక్ష్యమని తేలుచున్నది ” అని బాబా పేర్కొనినారు. కనుక ఎవరికి వారు ఈ విషయమై ఆత్మ పరిశీలన చేసుకొని ఉత్తమ భక్తి మార్గాన పయనించాలి.

అధికారుల వద్దకు గాని, పెద్దల వద్దకు గాని వెళ్ళేటప్పుడు పండో, కాయో, పువ్వో స్వీటో తీసుకొని వెళ్ళి అది వారికిచ్చి వినయవిధేయతలను ప్రదర్శించడం పరిపాటి. అప్పుడు వారు తమకున్న పరిధిలో మనకు కొన్ని పనులు చేసిపెడతారు. ఆమాత్రం ఉపకారానికే మనం వారు మనకు కనిపించినప్పుడల్లా కృతజ్ఞతలు తెలియజేస్తూ వారు చేసిన సహాయాన్ని పదిమందికి చెబుతాం. ఇది మామూలుగా లోకంలో జరుగుతున్న విషయం.

ఈ సకల చరాచర సృష్టికి కర్త అయినటువంటి, మనల్ని అన్నివిధాలా, కంటికి రెప్పలా, తల్లిలా అనుక్షణం మన యోగక్షేమములను చూస్తున్న ఆ సర్వేశ్వరునికి మనం ఎంత ఋణపడి ఉన్నామో ! ఎప్పుడైనా ఆలోచిస్తున్నామా ? “ జంతూనాం నర జన్మ దుర్లభమ్ ” అన్ని జన్మలలోకెల్లా ఉత్తమమైనది మానవజన్మే కదా ! అట్టి జన్మను పొందిన మనం మన ధర్మాన్ని నిర్వర్తిస్తున్నామా ? భగవంతుని అభీష్టానికి అనుకూలంగా నడుస్తున్నామా ? భగవంతునికి ప్రీతికరంగా ప్రవర్తిస్తున్నామా ? ఎంతసేపటికి నేను భక్తుణ్ణి, భక్తురాలను అని చెప్పుకోవటమే గాని, భగవంతునికిష్టమైన పనులు చేస్తున్నామా ? ఆయన బోధించిన విషయాలను ఆచరిస్తున్నామా ? ప్రతి ఒక్కరూ ఆత్మ పరిశీలన చేసుకోవాలి.

“ఉత్సాహం, సాహసం, ధైర్యం, బుద్ధి శక్తిః పరాక్రమః షడేతె యాత్ర తిష్ఠన్తి ; తత్రదేవోఽపి తిష్ఠతి ”

“ఉత్సాహము, సాహసము, ధైర్యము, సద్బుద్ధి, శక్తి, పరాక్రమము - అను ఆరు సుగుణములు ఎచ్చటనుండునో అచ్చట సాక్షాత్ భగవానుడు కాపురముండును ” అని పెద్దలు ఏనాడో తెలవిచ్చారు. అనగా పై ఆరు సద్గుణములు ఎవరియందుండునో వారికి దైవానుగ్రహం లభించునని అర్థము. పై ఆరు సద్గుణాలను శ్రద్ధతో ఆచరించడం నేర్చుకోవాలి. “ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం ” శ్రద్ధగలవానికే జ్ఞానం లభిస్తుందని గీత కూడా ప్రబోధిస్తున్నదిగదా ! ఎంత చిన్న పనినయినా శ్రద్ధతో చేసినప్పుడు వచ్చే ఫలం అధికంగా వుంటుంది. మనం చేయవలసిన పనిని శ్రద్ధతో సక్రమంగా చేసినట్లయితే అదే “ యోగము ” అవుతుందని పెద్దలు చెప్పారు.

గ్రంథాలయములు దేశ సౌభాగ్యానికి పునాదులవంటివి - శ్రీ అలపాటి రామచంద్రరావు

మనం ఏ పనిని ప్రారంభించినా, పవిత్రభావంతో, విద్యుక్త ధర్మంగా భావించి చేయాలి ఫలితాన్ని మాత్రం భగవంతునికే వదలాలి. కొద్ది పని చేసి గొప్ప ఫలితాన్ని ఆశించడం అవివేకం. ఆకర్షణీయమైన ఈ రంగుల ప్రపంచంలో అంతులేని ఆశలు, తీరని కోరికల వలన కలుగుతున్నది అశాంతి. వాటికై ఆవేదన, ఆరాటం, వీటితో జీవితం సగం భాగం గడచిపోతున్నది. ఆ విధంగా జరగకుండా వుండాలంటే మనస్సును ప్రశాంతంగా వుంచుకోవాలి. ప్రశాంతత కావాలంటే కోరికలను తగ్గించుకోవాలి స్వార్థమును విడనాడి, నిస్వార్థంగా ఫలాపేక్ష రహితంగా, సమాజ సౌభాగ్యానికి ఉపయోగపడే విధంగా కర్మలనాచరించాలి. అట్టిదానినే నిష్కామ కర్మ అంటారు.

ప్రతిఫలాన్ని ఆశించకపోవటమే నిజమైన ప్రేమ లక్ష్యము. భగవాన్ బాబావారు ప్రేమకు పెద్ద పీటవేశారు. వారు ప్రేమ లక్ష్యమును వివరిస్తూ " ప్రేమకు మించిన ఆధ్యాత్మిక సాధన లేదు. ప్రేమ యొక్క పరాకాష్ట సేవ. సేవ యొక్క స్ఫటిక రూపం త్యాగం సేవ ద్వారా ప్రేమ అనుభూతిలోనికి వస్తుంది హృదయ విశాలత పెరుగుతుంది సేవ ద్వారా భగవంతుని మెప్పును పొందవచ్చును. సేవ చేసి లక్ష్మి తరించింది. హనుమంతుడు ప్రశంసలనందుకున్నాడు " అని పేర్కొనినారు. సర్వత్రా వ్యాపించియున్న భగవత్ తత్వమే ప్రేమ ఇది ఏ పరిశోధనకు అందనటువంటిది అందరియందు అన్నిటియందు భగవంతుడున్నాడని విశ్వసించడమే ప్రేమ యొక్క ప్రధాన లక్ష్యం. ఎదుటివాని పతనాన్ని కాక, ఉన్నతిని కోరేదే అసలైన ప్రేమ మానవుడు అటువంటి నిస్వార్థ నిర్మల ప్రేమను తన హృదయంలో స్థాపించుకోగలిగిననాడు ఏ వ్యాధులకు, బాధలకు ఈ ప్రపంచంలో చోటు వుండదు. ప్రేమ మానవత్వానికి మూలాధారము.

" ప్రేమ, విశ్వాసం లేనప్పుడు మానవత్వం రూపొందదు. పక్షికి రెండు రెక్కలు ఎట్లా అవసరమో, బండికి రెండు చక్రాలు ఎట్లా ప్రధానమో మానవునికి ప్రేమ, విశ్వాసం అంత ప్రధానం " అంటారు బాబా. మానవత్వం లేని భక్తిని దైవము కూడా ఆమోదించడు, హర్షించడు. సంకుచిత భావాలను విడనాడి సర్వుల యందున్న ఆత్మ ఒక్కటే అన్న విశాల భావాన్ని పెంచుకొని, త్రికరణశుద్ధితో, తనకు చేతనైన సేవ సమాజానికి చేయటమే మానవత్వం. ఈర్ష్య, అసూయల వంటి అసుర భావాలను విడనాడటమే మానవత్వం.

" మొట్టమొదట మానవుడు సుగుణసంపత్తిశీలుడు కావాలి. సుగుణములు లేని మానవత్వం మానవత్వమే కాదు. గుణమే మానవునికి ప్రాణం. గుణము లేని మానవుడు శిథిల మందిరం లాంటివాడు " అని అంటారు బాబా. ఎట్టి గుణములు ? సద్గుణములచేతను, సదాచారములచేతను, సత్ చింతనచేతను, సత్సంగముచేతను సర్వేశ్వరుని ఆరాధించిన యెడల, ఆయన అనుగ్రహమునకు పాత్రులమవుతాం కేవలం పుష్పములతో పూజించుతే భగవదానుగ్రహం లభించదు. గుణ పుష్పములతో ఆరాధించడమే భగవంతునికి ప్రీతికరమని శంకర భగవత్పాదులవారు పేర్కొనినారు. ఆ పుష్పము లేవనగా....

" అహింసా ప్రథమం పుష్పం, పుష్పమింద్రియనిగ్రహః
సర్వభూతదయా పుష్పం, క్షమాపుష్పం విశేషతః
శాన్తి పుష్పం తపః పుష్పం, ధ్యానపుష్పం తథైవచ
సత్యమష్టవిధం పుష్పం, విష్ణోః ప్రీతికరం భవేత్ "

అహింస, ఇంద్రియ నిగ్రహం, సర్వభూత దయ, క్షమ, శాంతి, తపస్సు, ధ్యానం, సత్యము – అను ఎనిమిది గుణ పుష్పములు విష్ణుభగవానునకు అత్యంత ప్రీతికరములై యుండును. కావున లౌకిక పుష్పములతో పాటు, ఈ సద్గుణరూప మనః పుష్పముల చేత భగవానుని ఆరాధించినప్పుడు, ఆయన అనుగ్రహమును పొందగలుగుతాము. అనగా పై ఎనిమిది సద్గుణములను అలవరచుకొని ఆచరించినప్పుడు దైవ కృపకు పాత్రులమవుతాం. దైవానుగ్రహమును అందుకుంటాం. అట్టివారికే భగవదానుగ్రహం లభిస్తుంది.

తల్లి శరీరాన్ని పోషించి పెంచుతుంది. ఉత్తమ గ్రంథం

# చిత్రకళా ప్రపూర్ణుడు సి. ఎస్. వెంకటరావు

యథాసుమేరు ప్రవరో నగానాం ।
యథాండజానాం గరుడః ప్రధానః ।
యథానరాణాం ప్రవరః క్షితీశః ।
తథాకలానామిహ చిత్రకల్పః ॥

కళలు మానవ సంస్కృతికి ప్రతిబింబాలు. ఏ దేశం కళలకు నిలయమవుతుందో ఆ దేశం నాగరికదేశమైనట్లు లెక్క. ఆ దేశపు ప్రజలు విజ్ఞానవంతులైనట్లు భావించాలి. కళలమీదనే ఆ దేశపు గౌరవ ప్రతిష్టలు ఆధారపడి వుంటాయి. ఒక దేశ ఔన్నత్యాన్ని జాతి పురోగమనాన్ని ఆ దేశపు కళల అభివృద్ధివల్ల వెల్లడవుతుంది. భారతదేశం కళలకు పుట్టినిల్లు.

భారత చిత్రకళలో ఆంధ్ర చిత్రకళకు విశిష్టమైనస్థానముంది. చిత్రలేఖనంలో ఆంధ్రులు చేసిన కృషి నిరుపమానమైంది. లేపాక్షి, ఎల్లోరా, నాగార్జున, అజంతా, అమరావతి మొదలగు చిత్రకళా క్షేత్రాలు ఆంధ్రుల కళా వైభవానికి ప్రతిబింబాలు.

సర్వాంగ సుందరంగా అపురూప చిత్రకళాఖండాల్ని సృష్టించి ఆంధ్ర, భారతజాతి చరిత్రల్ని ప్రపంచానికి చాటిచెప్పిన మహా చిత్రశిల్పులు తెలుగు చిత్రకారులు. విశ్వ విఖ్యాతి గడించిన గొప్ప చిత్రకారులు తెలుగు నేలపై ఎందరో వున్నారు. చిత్రకళలో తెలుగువారు సిద్ధహస్తులు. దామెర్ల రామారావు, అడివి బాపిరాజు, వరదా వెంకటరత్నం, వరహాగిరి వెంకట భగీరథి, సి ఎస్. వెంకటరావు, చామకూర భాష్యకార్లు రావు, అంకాల వెంకట సుబ్బారావు, కౌతా రామమోహన శాస్త్రి, ఆనంద మోహనశాస్త్రి, మొక్కపాటి కృష్ణమూర్తి మాధవపెద్ది గోపాలకృష్ణ గోఖలే, హెచ్. వి రామ గోపాల్, దామెర్ల బదరీనారాయణరావు, అంట్యాకుల పైడిరాజు మున్నగువారు నవ్యాంధ్ర చిత్రకారుల్లో ప్రముఖులు. ప్రస్తుతం సి. ఎస్. వెంకటరావుగారి బహుముఖ చిత్రకళా ప్రావీణ్యతను తెలుసుకుందాం.

తెలుగు చిత్రకళా రంగంలో మహోన్నతమైన చిత్రాల్ని చిత్రించి చిత్రకళాప్రియుల హృదయాల్లో

---

## డాక్టర్ వి. సిమ్మన్న

---

సుస్థిరమైన స్థానాన్ని సంపాదించుకొన్న ప్రఖ్యాత చిత్రకారులు సి. ఎస్. వెంకటరావుగారు. వీరు నారాయణరావు, సత్యభామా భాయి పుణ్యదంపతులకు 1885 లో అనంతపురంలో జన్మించారు. రావుగారి విద్యాభ్యాసం అనంతపురం, వేలూరు, నెల్లూరుల్లో జరిగింది. చిన్నవయస్సునుంచి వీరికి చిత్రకళ అంటే ప్రాణం. ప్రారంభంలో ఆంజనేయుని చిత్రాన్ని ఎక్కువగా చిత్రించేవారు. వీరు మచిలీపట్నంలో మూడు సంవత్సరాలుపాటు చిత్రకళలో శిక్షణపొంది యోగ్యతాపత్రాన్ని పొందారు. అనంతపురంలోని పురపాలక ఉన్నత స్కూల్‌లో చిత్రకళాధ్యాపకులుగా కొంతకాలం పని చేశారు. తర్వాత పెనుకొండ బోర్డు ఉన్నత స్కూల్‌లో చిత్రకళాధ్యాపకులుగా చేరారు.

వెంకటరావుగారికి చిత్ర రచనలో టి. యల్. ఆర్. చంద్రన్, ఐ వి యస్. గారు ఎంతగానో ప్రోత్సహించి సహాయ సహకారాలు అందించారు. వీరి ప్రోద్బలంవల్లే రావుగారు మద్రాసు వెళ్ళి గొప్ప చిత్రకారులైన దేవీ ప్రసాద్‌రాయ్ చౌదరిగారి దగ్గర చిత్రకళను క్షుణ్ణంగా నేర్చుకున్నారు. బొంబాయి, కలకత్తా, లాహోరుల్లోని

హృదయాన్ని పోషించి పెంచుతుంది - (శ్రీ) రాపూరి

చిత్రకళాశాలల్ని సందర్శించి అక్కడి చిత్రకళారీతుల్ని తెలుసుకొన్నారు. పెనుకొండ, లేపాక్షి, తాడిపత్రి, విజయనగరం మొదలగు కళాక్షేత్రాల్ని సందర్శించి అందులోని కళా ప్రావీణ్యతను అలవరించుకొన్న ఉత్తమ చిత్రకారుడు సి. ఎస్. వెంకటరావుగారు.

వీరి చిత్రాలు దేశ విదేశాల్లో ప్రదర్శించబడి ప్రముఖుల మన్ననల్ని పొందాయి. అమెరికా, ఇంగ్లాండు, జర్మనీ, జపాన్ మొదలైన దేశాల్లో వీరి చిత్రాలున్నాయి. హైదరాబాదు సాలార్‌జంగ్ మ్యూజియంలో రావుగారి చిత్రాలుచోటుచేసుకొన్నాయి వీరి "గౌతమీ అవతరణం" అనే చిత్రం భారత రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్‌గారికి బహూకరించబడింది.

వెంకటరావుగారు మొదట్లో తైలవర్ణ చిత్రాల్ని లిఖించేవారు. వీరి తొలి తైలవర్ణచిత్రం 'ధ్రువనారాయణ' 'శ్రీరామ పట్టాభిషేకం', 'లంకిణీ సంహారం', 'కురుక్షేత్రం', "హరిహరులు" మొదలగు తైలవర్ణ చిత్రాల్ని వీరు వేశారు.

"కాపు పడుచు", "సుగాలి పడుచు", "నాగకన్య", "మేరీ", "తత్పరిత", "శాంతి ప్రప్రము", "శ్రీరామునికి ఉదత", "జటాయు మరణం", "శివకుటుంబ నృత్యం", "గౌరీ శంకరుడు", "అర్ధనారీశ్వరుడు", "రతిమన్మథుడు" "కళా జననం", "గాన జననం", "వైనాయకనం", "ద్వైతాద్వైత ప్రేమతత్వం" మున్నగు ఎన్నో ఉత్తమ చిత్రాల్ని వేసిన సుప్రసిద్ధ చిత్రకారులు రావుగారు.

పెనుకొండలో విజయనగర చిత్రకళాశాలను ఒక దానిని స్థాపించి ఎంతోమందికి చిత్రకళలో శిక్షణ ఇచ్చిన గొప్ప చిత్రకళా ప్రపూర్ణులు వెంకటరావుగారు. వీరు 1940 లో పరమపదించారు.

—o|o—

# గీతా మాధుర్యము

వ్యాఖ్యాత : శ్రీ బోడపాటి హరికిషన్‌గారు
నల్లావారి వీధి, సత్యనారాయణపురం,
విజయవాడ - 520 011

డిస్ట్రిబ్యూటర్స్ : నవజ్యోతి పబ్లికేషన్స్
ఏలూరు రోడ్, విజయవాడ-2

వెల : రు. ।




ఈ వ్యాఖ్యాన గ్రంథము పేరు గీతా మాధుర్యము. భగవద్గీత కిది అత్యాధునికమైన వివరణము. మాధుర్య మనగా నేమి ? స్వాదువైనది, యిష్టమయినది. కటుతిక్తరసత్వేఽపి విరుద్ధలక్షణయా మధురా (కారమయినను, చేదయినను విరుద్ధలక్షణచేత మధురమయినది) లోక హితము కోరి భగవంతుఁడు ప్రవచించిన వాక్కులు స్వాదువులు, ఇష్టములు గాకెట్లుండును ? గీతామాధుర్య మన్న పేరు సరియు సముచితము. మహాభారతాంతర్గతమైన శ్రీమద్భగవద్గీతకు పూర్వకాలమున పరిశ్శతములు వ్యాఖ్యానములు వచ్చినవి. శంకర, రామానుజ, మధ్వాచార్యుల వ్యాఖ్యానములుండగా, తిలక్ ప్రభృతులు ఆధునికులు భగవద్గీతకు వ్యాఖ్య వ్రాసిరి. శ్రీ వివేకానంద స్వామి వారు చెప్పినట్లు భగవద్గీత " Universal Scripture ".

భగవద్గీతాసంబంధములైన పూర్వీకుల వ్యాఖ్యానములు పరమ వైదాంతికముగా, ఆధ్యాత్మికక్షేచింతనా పరములు వధులుగా వ్రాయబడినవి. శ్రీ హరికిషన్‌గారి గీతా మాధుర్య వ్యాఖ్యానము అత్యాధునిక మానవునికిఁ గూడ లక్ష్య సాధనయందు స్ఫూర్తిని గల్గించుచున్నది. పరమాధునిక నాగరికతా వ్యామోహముచేత ప్రతారింపఁబడిన బుద్ధి నుండి భారత జాతిని జాగృతము చేసి సచ్ఛీలవంతము జేయుటలో హరికిషన్‌గారి ప్రయత్నము ఫలించినది.

సర్వ ధర్మస్వరూపుఁడు భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు లోకానుగ్రహార్థము ప్రవచించిన అమృత వాక్కులను శ్రీ హరికిషన్‌గారు భగవద్గీత యందలి ప్రతి శ్లోకమున దర్శించి వ్యాఖ్యాన రూపమున వివరించిరి. వీరి వ్యాఖ్యానము సహేతుకము, శాస్త్రప్రమాణము కల్గిన కారణమున అవశ్యపఠనీయమగుచున్నది. శ్రీ హరికిషన్‌గారు చేసిన గొప్ప పని యేమనఁగా, తాము చేసిన గీతావ్యాఖ్యానములో, కేవల పండితైక వేద్యములయిన శాస్త్రీయ సాంకేతిక పదములు గుప్పింపలేదు. తత్పరిభాషాగతమైన విశేషార్థములను సులభ రమణీయములుగా ఆవిష్కరించిరి. భగవద్గీత బోధ పడదన్న దుర్భ్రమ తొలగించిరి. ప్రతి అధ్యాయమునకు మొదట ఆయా అధ్యాయములందు ప్రస్తావింపఁబడు అంశములను సమగ్రముగా వివరించిరి. అధ్యాయాంతమున యందు వ్యాఖ్యాన సారాంశము నిచ్చిరి. ఈ యిచ్చుటలో శ్రీ సత్యసాయి స్వామివారి అనుగ్రహ భాషణలను పొందుపరచిరి. 5000 ఏండ్ల నాడు భగవంతుడు స్వయముగా ఏ మహా విషయములను లోకమున కనుగ్రహించిరో, ఆ యంశములు నేటికిని ఎట్లు సర్వజన శ్రేయఃప్రాప్తికి మార్గములో శ్రీ కిషన్‌గారు నిరూపించిరి. ఇది ఆశ్చర్యమైన విషయము.

శ్రీ బోడపాటి వారిని లోకము నవలా రచయితగా ఎఱుగును. వీరి ప్రతిభ తావన్మాత్రము కాదు. వీరి " రామాయణ మహావృక్షము ", బాలకాండ నుండి యుత్తరకాండ వరకు చారిత్రక సత్యముగా చేయబడిన విమర్శ రాముని దైవత్వము, మానవత్వమును వీరు వ్యాఖ్యానించి చెప్పిరి ఇట్టి పని చేయుటకు ఎంత

మనిషి హృదయం మంచితనానికి కొలబద్ద — అలెర్

సూక్ష్మ సూక్ష్మతర వివేచన యుండవలయును. ఆ శక్తి శ్రీ కిషన్‌గారికి సమృద్ధిగా గలదు.

సాధారణముగా వ్యాఖ్యాతలు భగవద్గీతాది గ్రంథము లకు వ్యాఖ్యానము చేయునపుడు తమ విశేష గ్రంథపఠనా పాండిత్య ప్రకర్షణను జూపుదురు. మూల కర్త భావ మేదియో అర్థము కాదు. శ్రీ హరి కిషన్‌గారు భగవద్గీతా శ్లోక తాత్పర్యమును విస్పష్టముగా వ్రాసిరి. ఆ పైని తమ అభిప్రాయములు వివరించిరి. ఇది ఆరోగ్యకరమైన పద్ధతి.

ఈ "గీతా మాధుర్యము" లో 18 అధ్యాయము లలో కూడ శ్రీ సత్యసాయి వారి అమృత భాషణలు పొందుపరుపబడినవి. శ్రీ కిషన్‌గారు భగవద్గీతకువలెనే ఉపనిషత్తులకుం గూడ ఈ దృశమైన వ్యాఖ్యలు వ్రాసి నచో "ఆంధ్రావళి మోదము" పొందును. శ్రీ సత్య సాయి కృపకు మనము పాత్రులమగుదుము.

— కాజ లక్ష్మీనరసింహారావు

# స్వీకారం

"హజరత్ ఇమామ్ హుస్సేన్"

వెల : రు 50-00

ఆంగ్ల మూలం : ఖ్వాజ్ మౌల్వీ మీర్జా గులామ్ అబ్బాస్ అలీ సాహెబ్

తెలుగుసేత : శ్రీ అయినంపూడి గురునాధరావు

ప్రతులకు : ఫిదక్ పబ్లికేషన్స్ ఆఫ్ ఇండియా 2/180, బీబీ ఆస్థానా, అల్‌ఫిదక్ ఇనుకుదురుపేట, మచిలీపట్నం

"సాయినాథ" (శతకం) అమూల్యం

రచన : డా॥ చల్లా రాధాకృష్ణ శర్మ

డా॥ చల్లా రాధాకృష్ణశర్మ, విజిటింగ్ ప్రొఫెసర్ తమిళ యూనివర్‌సిటి, తంజావూరు 613005

"నేపటి గీతం" వెల : 5-00

రచన : శ్రీ పై. నాగేంద్రరావు

C/o కోణార్క్ ప్రింటర్స్, పెండెంవారివీధి, కావలి

"దేశం మేలుకుంది" వెల : 12-00

రచన : డా॥ మిరియాల రామకృష్ణ

ప్రతులకు : శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్‌ప్రైజెస్ మ్యూజియంరోడ్, విజయవాడ — 2

"గాయత్రీ మహిమ" వెల : 2-00

సంకలనకర్త : డా॥ కోడూరి సుబ్బారావు

ప్రతులకు : గాయత్రీ ఆశ్రమము 12-10-586/6, వ్యాసనగర్, సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ 500 361

"క్షేత్రయ్య" వెల : 3-00

రచన : డా॥ మంగళగిరి ప్రమీలాదేవి

ప్రతులకు : తెలుగు విశ్వవిద్యాలయం కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్ 500004

"శ్రీసూక్త పూజావిధానము" వెల : 5-00

ప్రకటితము : శ్రీ గోదావరి అచ్చయ్య శాస్త్రి

ప్రతులకు : పేట్లపాలెం, తూ. గో. జిల్లా

"శ్రీ సత్యసాయీ తారావళి" వెల : 2-00

రచన
ప్రతులకు
శ్రీ పంచాంగము శివప్ప శాస్త్రి

శ్రీ సత్యసాయి గోకులము పుట్టపర్తి - అనంతపూర్ జిల్లా 515 134

ద్వేషం అనేది ప్రేమలోనే చల్లారుతుంది - డా॥ సర్వేపల్లి



# ండ్రికి తగ్గ తనయుడు!



## శ్రీ కొత్త రాజా ప్రతాప్

బి.కాం., బి.ఎల్., డి.ఎల్.ఐ.ఎం.

జీవిత భీమా వృత్తికి అంకితమైన 'భీమా కేసరి' శ్రీ కొత్త మాధవరావుగారి రెండవ కుమారుడు శ్రీ రాజా ప్రతాప్. ఇన్స్యూరెన్స్ ఏజెంటుగా తండ్రి అడుగుజాడలలో నడుస్తూ తండ్రికి తగ్గ తనయుడుగా పేరుప్రతిష్ఠలనందుకున్న 'యువ ఏజంట్'. శ్రీ మాధవరావుగారు స్థాపించిన సేవాకేంద్ర ప్రధాన నిర్వాహకులు. ఇటీవల జీవిత భీమా సంస్థ నిర్వహించిన 'Save Through Life Insurance Campain' పోటీలో విజయం సాధించి కేంద్ర ఆర్థికశాఖా సహాయ మంత్రి శ్రీ ఫోరిడా ద్వారా అవార్డునందుకున్నారు శ్రీ రాజా ప్రతాప్.

**Some achievements of SRI K. RAJA PRATAP**

To obtain DLIM certificate in Machilipatnam Division — 1985
To win National Award from Vijayawada Branch — 1987
To cross Double Crore in Machilipatnam Division — 1987-88
To complete One Crore in Vijayawada Branch — 1988 & 1989

జీవిత భీమా సంస్థ ఏజెంటు శ్రీ కొత్త రాజా ప్రతాప్ గారికి ప్రతిష్ఠాకరమైన 1990 సం॥ 'మిలియన్ డాలర్ రౌండ్ టేబుల్' అమెరికా సంస్థ సభ్యత్వానికి ప్రప్రథమముగా అర్హత లభించినది. జీవిత భీమా ఏజన్సీ వృత్తిగా స్వీకరించి, వ్యాపార సేకరణలో అసాధారణమైన ప్రతిభాపాటవాలు ప్రదర్శించే సమర్థులైన బహుకొద్దిమంది ఏజెంట్లకు మాత్రమే ఈ అంతర్జాతీయ గౌరవము లభిస్తుంది. శ్రీ రాజాప్రతాప్ 1988 లో అత్యధిక మొత్తంలో ప్రీమియం వసూలుచేసి 'జాతీయ బహుమతి' అందుకొన్నారు. ఈ విధంగా దేశాభివృద్ధికి తనవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించకలగటంలో శ్రీ రాజా ప్రతాప్ కృతకృత్యులైనారని చెప్పుటకు మేమెంతయో గర్వపడుచున్నాము.

- కె. యస్. రామమూర్తి
సీనియర్ డివిజనల్ మేనేజర్
మచిలీపట్నం డివిజన్

ఈ యుగంలో విజయం సంఘటనమీద ఆధారపడి వుంటుంది - చిన్మయానంద

# బాధలు మరిపించిన "బాద్షా" ఖాన్ (సరిహద్దు గాంధీ)

పెషావర్‌లో పుట్టినా, పాకిస్తాన్‌లో పెరిగినా, ఆఫ్ఘనిస్తాన్‌లో తిరిగినా హిందూ - ముస్లిమ్ ఐక్యతకు జీవితాంతం కృషి సల్పిన మహనీయుడు "అబ్దుల్ గఫార్ ఖాన్". సమైక్యతా మైకంలో హద్దులు ఎరుగక మూడు దేశాల్లోనూ తిరిగాడు. నియంతలపాలిట, అన్యాయం ముంగిట సింహస్వప్నంగా నిలిచాడు ఉపఖండపు ఉప గాంధీ (బాద్షాఖాన్). ఆంగ్లేయులు, పాకిస్తాన్ నియంతలు చివరకు అనారోగ్యంతోను పోరాడి జీవితంలో అలసట చెంది 98 ఏళ్ళ అనంతరం (20-1-1988) న తుది శ్వాస విడిచాడు. గాంధేయవాది, స్వాతంత్ర్యసమరయోధుడైన గఫార్‌ఖాన్‌ను పఠాన్లకు తిరుగులేని నాయకుడగుటచే బాద్షా ( రాజు ) గా ప్రకటించి " బాద్షాఖాన్ " అని, తన ఉద్యమాలన్నీ దేశ సరిహద్దులో శాంతియుతంగా నిర్వహించుటచే " సరిహద్దు గాంధీ " అని ప్రజలు ముద్దుగా పిలుచుకునేవారు.

ఆయనకు మన దేశ పౌరసత్వం లేకున్నా 1987 లో " భారత రత్న " అవార్డు నిచ్చి సత్కరించుకోవటం, మనల్ని మనల్ని గౌరవించుకోవటమే అవుతుంది. ఆయన సేవలను అమ్నెస్టీ ఇంటర్నేషనల్ సంస్థ మొదలు యావత్ప్రపంచం వరకూ కొనియాడాయి. ఆయన మరణంతో గాంధీ శకం దాదాపు ముగిసిందనే చెప్ప వచ్చును. దాదాపు 35 ఏళ్ళపాటు జైలు జీవితం అనుభవించాడు. బాద్షాఖాన్‌కు 1930 లో మహాత్మాగాంధీతో స్నేహం ఏర్పడింది. అదే ఏట పఠాన్లందరికీ ఎర్ర చొక్కాలు తొడిగి " ఖుదాయ్ ఖిద్మత్‌గార్ " అనే ఉద్యమాన్ని దాదాపు లక్షమందితో నడిపాడు. క్విట్ ఇండియా ఉద్యమంలో ఏళ్ళతరబడి జైళ్ళల్లో ఉండగా గాం పండిట్ నెహ్రూలతో సాన్నిహిత్యం పెరిగింది. అనేక కాంగ్రెస్ ఉద్యమాల్లో పాల్గొన్నాడు. ఎన్నోసార్లు అనేక పదవులు ( చివరకు కాంగ్రెస్ అధ్యక్ష పదవి ) వచ్చినా ఏ పదవీ ఆశించని మహనీయుడు, నిరాడంబరుడు బాద్షాఖాన్. తన ఉద్రేకపూరిత ఉపన్యాసాలతో దేశ వాసుల్లో దేశభక్తిని పెంపొందించెడివాడు.

1947 ఆగస్టు 15 న మనకు స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత దేశ విభజన ప్రతిపాదనకు కాంగ్రెస్ కూడా తలొగ్గినందుకు గాంధీజీతో " మమ్మల్ని ఈనగాచి నక్కలకు వేశారు" అని ఆవేశంగా అన్నాడు. పాకిస్తాన్ అవతరణతో పౌర, సైనిక ప్రభుత్వాల అణచివేతకు బాద్షాఖాన్ గురయ్యాడు. ఇండియాలో " ఖిలాఫత్ " సదస్సు పిలుపు మేరకు ఆఫ్ఘనిస్తాన్ వలస వెళ్ళాడు. ఇలా 15 ఏళ్లు పాకిస్తాన్ జైలు జీవితం, ఇంకొక 15ఏళ్లు ఆఫ్ఘనిస్తాన్‌లో ప్రవాస జీవితం గడిపాడు. తీవ్ర అనారోగ్యానికి గురగుటచే 1964 లో ఇంగ్లండ్ వెళ్ళాడు. మళ్ళీ రెండు నెలలకు తిరిగి ఆఫ్ఘనిస్తాన్ వచ్చి అక్కడే ఉండిపోయాడు. బౌద్ధమతాన్ని అభిమానించుటే కాక ఆ మతాన్ని పఠాన్ల జీవనశైలిలో భాగం చేశాడు బాద్షాఖాన్. భారత ప్రభుత్వం బాద్షాఖాన్‌కు గాంధీ శత జయంతి సంవత్సరమైన 1969 లో నెహ్రూ అవార్డునిచ్చి సత్కరించింది. శాశ్వత మానవతా విలువల కోసం శాంతి, అహింస, సమైక్యత, మానవతా స్వేచ్ఛలకోసం బాద్షా పాటుపడ్డాడు. ఆ మహావ్యక్తి మృతి సందర్భంగా మన దేశం ఒక రోజు సెలవు, 5 రోజులు సంతాప దినాలుగా ప్రకటించుటే కాక, అంత్యక్రియలకు అప్పటి ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధి, ఉప రాష్ట్రపతి డా॥ శంకర్ దయాళ్‌శర్మ నాయకత్వంలోని 12 మంది సభ్యుల బృందం వెళ్ళింది. ఆయన మృతి చెందిన సందర్భంలో శ్రీ రాజీవ్‌గాంధి " బాద్షాఖాన్ వ్యక్తిత్వంముందు మనం తలలు వంచాలి" అని అన్నారు. డా॥ శంకరదయాళ్‌శర్మ "ఆయన గొప్ప మానవతావాదిగా జీవించారు. మహాత్మా గాంధి, స్వాతంత్ర్యసమరయోధులు రూపొందించిన ఉన్నత మానవతా విలువలకు ప్రాతినిధ్యం వహించారు. ఆయన కరుణ,సాదాసీదాతనం,నిజాయితీ,ఆత్మస్థయిర్యం, ఆత్మనిగ్రహాన్ని చూసి లక్షలాది భారతీయులు తరించారు. భారత ఉపఖండంలో శాంతి, సౌఖ్యాలు విలసిల్లాలని జీవితాంతం ఆకాంక్షించిన, భారతదేశపు ఉత్తమ స్నేహితుడు. ఆయన అనుసరించి, ఆచరించిన నైతిక విలువలు భావి తరాలకు మార్గదర్శకత్వం వహిస్తాయి " అని చెప్పారు. ఆయన మార్గంలో పయనిస్తూ అహింస, జాతీయ సమైక్యత, శాంతి, మానవ హక్కులకోసం పాటుపడటమే "బాద్షాఖాన్"కు మనమర్పించగల నిజమైన శ్రద్ధాంజలి.

- ఎ. ఎన్. ఎస్. శంకరరావు